విద్యాప్రాంగణంలో విజ్ఞాన కుసుమాలు వికసించిన

# విశ్వభారతి

## గుడివాడ

| పబ్లిక్ స్కూలు (ఇంగ్లీషు మీడియం) | Ph : 2724, 2335<br>L.K.G to X | విద్యానికేతన్ (తెలుగు మీడియం) |
|---|---|---|

* నాడు, నేడు నూరు శాతం ఫలితాలు

1994 S.S.C. పరీక్షలో 84 విద్యార్థులు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత - ఒక విశిష్టత.

| | | | | |
|---|---|---|---|---|
| * ఇంగ్లీషు మీడియం | - | 3వ బ్యాచ్ | - | 100% First Class |
| తెలుగు మీడియం | - | 23వ బ్యాచ్ | - | 100% First Class |

## TRACK RECORD

* **1994 S.S.C.** లో **535** మార్కులు పొందిన మా విద్యార్థిని

**మాలెంపాటి ప్రవీణ - కృష్ణాజిల్లాలో ఫస్ట్**

కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీమతి లక్ష్మీపార్థసారథి భాస్కర్ గారిచేప్రశంసాపత్ర గ్రహీత.

* **16** మంది విద్యార్థులు నేషనల్ మెరిట్ స్కాలర్ షిప్స్ పొందటం గర్వకారణం.

హాస్టల్:- 1. బాలురకు బాలికలకు ప్రత్యేకమైన అధునాతనమైన భవనాలు.

2. అధునాతనమైన డైనింగ్ హాలు.

## ప్రత్యేకతలు

1. విద్యా, వైజ్ఞానిక ప్రదర్శనలు. 2. విహార యాత్రలు 3. విశాలమైన ఆట స్థలం - క్రీడల పట్ల ప్రత్యేక శ్రద్ధ. 4. ప్రోత్సాహక బహుమతులు. 5. నిర్వహించిన పట్టణ స్థాయి పోటీలలో విజేతలు. 6. సృజనాత్మక శక్తిని పెంపొందించుటకు వివిధ కార్యక్రమాల నిర్వహణ 7. పఠనా శక్తిని పెంపొందించుటకు లైబ్రరీ. 8. ప్రయోగాలు చేయుటకు లాబొరేటరీ.

| | |
|---|---|
| శ్రీమతి పొట్లూరి సరోజిని M.Sc., B.Ed., | పొట్లూరి శ్రీమన్నారాయణ |
| గౌరవ డైరక్టర్ | వ్యవస్థాపకులు |



KCP Sugars, Lakshmipuram



మా ఖాతాదారులకు, శ్రేయోభిలాషులకు సంక్రాంతి శుభాకాంక్షలు

రుచిలో మధురం
జిహ్వాలో సుగంధం
వెన్నంటే పరిమళం
త్రివేణి ఆహ్లాదం







# త్రివేణి

## సుగంధ

## వక్కపొడి



తయారుచేయువారు

త్రివేణి నట్ పొడర్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీ, మచిలీపట్నం ఫోన్ : 3458



ప్రొ॥ దేసు వెంకట సుబ్బారావు

సోల్‌సెల్లింగ్‌ఏజంట్స్

వినాయక ఏజన్సీస్, మచిలీపట్నం ఫోన్ : 4266

# శ్రీవాణి జీవిత సభ్యులు



శ్రీ యెనిశెట్టి గంగయ్య
F/o. శ్రీ యెనిశెట్టి విఠల్
రామాయం పేట, మెదక్ జిల్లా



**Sri V. Haranadh**
Rooparatna Agro Chemicals,
Main Road,
TANUKU.



**Sri K. Narayana Rao**
B.L. Sujata Cottage Industries,
Samarangam chowk,
VIJAYAWADA - 1.



**Smt.Ch.B.Tripura Sundari**
C/o. K. Krishna Mohan,
Pleader
BHIMAVARAM. W.G.Dt.



**Sri Bolisetty Hari Babu**
Sri Rama Krishna Complex,
Kandula vari Street,
VIJAYAWADA - 1



**Smt.K. Lakshmi Kumari**
W/o. Sri K. Bhaskara Rao
Excise Superintendent,
SANGA REDDY, Medak Dt.



**Sri Ch. Gangadhara Rao**
NIZAMABAD



**Smt. K. Sarada**
Bank of Maharastra,
Sultan Bazar,
HYDERABAD



**Sri M. Lingaraju** M.A., M.Ed.,
**Lecturer**
N.B.K.R.B.Ed. College,
VIDYANAGAR, Nellore Dt.

శ్రీవాణి దశాబ్దిసంచికకు శుభాకాంక్షలు - జనవరి 1995

శ్రీవాణి నూతన సంవత్సర శుభాకాంక్షలతో!

| జనవరి | ఫిబ్రవరి | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ | 1995 క్యాలెండర్ | | | | | జూలై | ఆగష్టు | సెప్టెంబరు | అక్టోబరు | నవంబరు | డిసెంబరు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 31 | 28 | 31 | 30 | 31 | 30 | | | | | | 31 | 31 | 30 | 31 | 30 | 31 |
| ఆ | బు | బు | శ | సో | గు | 1 | 8 | 15 | 22 | 29 | శ | మం | శు | ఆ | బు | శు |
| సో | గు | గు | ఆ | మం | శు | 2 | 9 | 16 | 23 | 30 | ఆ | బు | శ | సో | గు | శ |
| మం | శు | శు | సో | బు | శ | 3 | 10 | 17 | 24 | 31 | సో | గు | ఆ | మం | శు | ఆ |
| బు | శ | శ | మం | గు | ఆ | 4 | 11 | 18 | 25 | | మం | శు | సో | బు | శ | సో |
| గు | ఆ | ఆ | బు | శు | సో | 5 | 12 | 19 | 26 | | బు | శ | మం | గు | ఆ | మం |
| శు | సో | సో | గు | శ | మం | 6 | 13 | 20 | 27 | | గు | ఆ | బు | శు | సో | బు |
| శ | మం | మం | శు | ఆ | బు | 7 | 14 | 21 | 28 | | శు | సో | గు | శ | మం | గు |

కూర్పు: SN. దుర్గారావు






476324

*With Best Compliments from :*




**24 Hours in Customer Touch**




39-2-55,
PITCHAIAH STREET,
LABBIPET,
VIJAYAWADA-10.

**శ్రీవాణి** సాంస్కృతిక మాస పత్రిక

సంపాదకులు: కొమరగిరి కృష్ణ మోహనరావు

# విషయ సూచిక

**జనవరి 1995**

**సంపుటి 11 సంచిక 1**

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

**24-52, రామానాయుడు పేట**

**మచిలీపట్నం -521 001**

**ఫోన్ :2818**

**విడిప్రతి : రు.10/-**

**సం.చందా రు. 54/-**

**4 సం.చందా రు. 200/-**

**జీవిత సభ్యత్వం రు. 600/-**

**పోషకులు రు. 1,116/-**

Cheques & Drafts should be drawn infavour of **SREE VANI Monthly** MACHILIPATNAM

Edited, Printed & Published By **Komaragiri Kirshna Mohan Rao**

* * *

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM



*దశాబ్ది ప్రత్యేక సంచిక వాణి శ్రీవాణి*

# అందరికీ నమస్కరించి ...

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యాశీస్సులతో శ్రేయోభిలాషుల సహాయ సహకారములతో, చందాదారుల అండదండలతో, రచయితల ప్రోత్సాహంతో క్రమం తప్పకుండా, ప్రతినెలా సకాలంలో, పాఠకులకు అందించబడుతూ, వారి ప్రశంసల నందుకుంటూ, దశాబ్ది ప్రత్యేక సంచిక స్థాయికి ఎదిగింది 'శ్రీవాణి'

శ్రీవాణి ఈనాడు మన రాష్ట్ర పరిధులను దాటి భారతదేశంలోని అన్ని ప్రధాన పట్టణములలోనున్న తెలుగువారి వద్దకేగాక, అమెరికా మొదలగు విదేశాలలో నివసిస్తున్న తెలుగువారి చెంతకు కూడా చేరుకొని వారి ప్రశంసల నందుకుంటున్నది. మరియు రాష్ట్ర స్థాయిలో రెండు పర్యాయములు ఉత్తమ ఆధ్యాత్మిక పత్రికగా విశిష్ట అవార్డులను కూడా అందుకొనినది.

శ్రీవాణి కి 1994 డిశంబరుకు పది సంవత్సరములు నిండినాయి. ఆ సందర్భమున 1995 జనవరి సంచికను 'దశాబ్ది ప్రత్యేక సంచిక'గా అమూల్యమైన వ్యాసములతో ఎక్కువ పేజీలతో పాఠకులకు అందించుచున్నాను.

అర్ధనగ్న దృశ్యాలతో, సినిమాబొమ్మలతో పత్రికలు దర్శనమిస్తున్న ఈ తరుణంలో, సెక్స్ సాహిత్యంతో, ప్రేమ కథలతో పత్రికలు మార్కెట్‌లోనికి వస్తున్న ఈ సమయంలో; నవలా సాహిత్యంపై మోజు పెరిగిపోతున్న ఈకాలంలో; డిటెక్టివ్ సాహిత్యంపై అభిరుచి పెంచుకుంటున్న ఈ సంధి సమయంలో; వీటన్నింటికి ఏమాత్రం స్థానమివ్వకుండా, కేవలం సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన విషయములకు సంబంధించిన వ్యాసములను మాత్రమే ప్రచురించుతూ పత్రికను నడపటం కాలమునకు ఎదురీదటమే అయినప్పటికీ, ఆశయ ఆదర్శముల విషయంలో ఏమాత్రం రాజీపడకుండా, గత పది సంవత్సరములుగా, శ్రీవాణిని క్రమం తప్పకుండా, ప్రతినెలా పాఠకులకు అందిస్తూ, ఈనాడు "దశాబ్ది ప్రత్యేక సంచిక"ను అందించే స్థితికి చేరుకొనినాను. ఇది నా ప్రతిభ ఏమాత్రం కాదు. భగవాన్ సాయి దివ్యానుగ్రహ ఫలితమేనని నా సంపూర్ణ విశ్వాసం.

శ్రీవాణి కి సర్క్యులేషన్ మేనేజర్లు లేరు. అడ్వర్‌టైజ్‌మెంటు మేనేజర్లు అంతకన్నా లేరు. పాఠకుల సహృదయ సహకారములు మరియు భగవాన్ సాయి దివ్యాశీస్సులు నిండుగా దండిగా ఉండటం వలననే పత్రికను నడుపగలుగుతున్నానని నా నమ్మకం.

దివ్యాశీస్సులనందిస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి పాదపద్మములకు ప్రణమిల్లి నమస్కరిస్తూ, సహకారం అందిస్తున్న పాఠకుల నభినందిస్తూ, అప్పుడప్పుడు ప్రకటనల (Advertisements) నిచ్చి ప్రోత్సహిస్తున్నవారికి కృతజ్ఞతలను తెలియబరుస్తూ, జీవితసభ్యులుగా, పోషకులుగా ఆర్థిక సహకారం అందిస్తున్న ఉదారవదాన్యులకు ధన్యవాదముల నర్పిస్తూ అమూల్యమైన వ్యాసములను పంపుతున్న రచయితలకు కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తూ. ఇదే విధమైన సహాయ సహకారములు భవిష్యత్తులో కూడా శ్రీవాణి కి అందించమని హృదయ పూర్వకంగా కోరుకుంటున్నాను. శ్రీవాణి సర్క్యులేషన్‌ను పెంచే మహా ప్రయత్నంలో శ్రీవాణి ని అభిమానించే ప్రతి ఒక్కరూ తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

ధన్యవాదములు

సదా సాయి సేవలో

కొమరగిరి కృష్ణమోహనరావు

సంపాదకులు

# శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri Namuduru Venkata Rao**
VIZIANAGARAM



**Sri V. Sundara Ram**
Nagarjuna Public School
MACHILIPATNAM

★

సం
క్రాం
తి
శు
భా
కాం
క్ష
లు





కీ. శే. మసీదు కోటి
వీరయ్య జ్ఞాపకార్థం
భార్య మల్లికాంబ
పరిటాల వారు పంపినది



కీ॥ శే॥ SVN గణేష్‌వరప్రసాద్
జ్ఞాపకార్థం వారి కుమారుడు
చి॥ ఎస్. హరిహరప్రసాద్
మచిలీపట్నం వారు ఇచ్చినది

## కృతజ్ఞతలు

శ్రీవాణి వికాద్రి ప్రత్యేక సంచికను సర్వాంగసుందరంగా తీర్చిదిద్దటానికి ఎందరో మహానుభావులు తమ వంతు సహకారమును అందించినారు. అందరికీ వందనాలు. కొందరు రచయితలు సహృదయంతో సందేశాత్మక రచనలు పంపారు. కొందరు ఉదారవదాన్యులు అడ్వర్‌టైజ్‌మెంట్సుద్వారానూ, మరికొంతమంది పోషకులుగా, జీవిత సభ్యులుగా ఆర్థిక సహకారం అందించారు. కొంతమంది సహృదయులు క్రొత్త చందాలు చేర్పించి పంపారు. శ్రీవాణి ప్రింటర్స్, బృందావన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్‌వారు ప్రత్యేక సంచికను సర్వాంగసుందరంగా తీర్చిదిద్ది సకాలంలో అందించినారు. కొందరు దివ్యపురుషులు, అవతారమూర్తులు మరియు పెద్దలు ఆశీఃపూర్వక దివ్యసందేశములను అందించినారు. ఈ మహాయజ్ఞములో భాగస్వాములైన సహృదయులందరికి నా కృతజ్ఞతాభివందనలు

— సం.



# సంస్కారం లేని చదువులు చెల్లని నాణెంవంటివి

— భగవాన్ సాయి దివ్యబోధ

ధనమె దైవంబయ్యె దర్పంబె మతమయ్యె
స్వార్థమే జీవికి నిలయమయ్యె
అహము ఫేషను అయ్యె ఆశలందంబయ్యె
ధర్మంబు వమ్మయ్యె ధాత్రిలోన
ధర్మహీనంబయ్యె నయము శూన్యంబయ్యె
కపటమే జీవిత కాంతియయ్యె
ప్రేమానురాగముల్ రోగాల పాలయ్యె
కామాంధులుగ జేసె కలిని చదువు
బ్రతుకు బరువయ్యె మతులకు గతులు దప్పె
జాగు చేసిన జగతి ఏగతియు నగునో
విద్యలందున నైతికము విధిగ జేర్చి
భరతమాత బిడ్డలమని కీర్తిబడయురప్పు!

## విద్యార్థులారా! విద్యార్థినులారా!

చదువనగా ఏమిటి? ఎట్టి చదువులు మనం చదవాలి? ఈ చదువు వలన కలిగిన లక్షణములు ఏమిటి ? ఎట్టి చదువులు మానవాభ్యుదయమునకు మార్గదర్శకమవును? నేటి చదువుల వలన కలిగే ఫలమేమిటి? ఈ అయిదింటిని విమర్శించి, పరిశీలించి, విచారించి, గుర్తించినటువంటి వాడే విజ్ఞుడు. మానవతాగుణములను వికసింప జేయునది కేవలం విద్య మాత్రమే కాదు, దీనికి సంస్కారం కూడా అత్యవసరం.

## సంస్కారం

సంస్కార మనగా ఏమిటి సత్సంకల్పం, సద్భావం, సద్గుణం, అనగా మానవుని యొక్క నడతలు పవిత్రమైనవిగా ఉంటుండాలి. భావములు, ఆలోచనలు సమాజ క్షేమమును గూర్చినటువంటివిగా ఉండాలి.

"సర్వే లోకహితే రతః సర్వేజ్ఞానోప సంపన్నః
సర్వే సముదితాః గుణైః సర్వే లోక హితః"

విద్యార్థుల యందు, సమస్త జగత్తు సంక్షేమాన్ని ఆశించేటటు వంటి విశాలహృదయం ఆవిర్భవించాలి. కేవలం భౌతిక, లౌకిక జ్ఞానములనే కాక; నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక జ్ఞానములను కూడా విద్యార్థులు సంపాదించాలి. సర్వ సద్గుణములు విద్యార్థులయందు ఆవిర్భవించాలి, రాణించాలి. ఇదియే విద్యార్థి యొక్క నిజమైన సత్య స్వరూపము. ఇదియే భారతీయ సంస్కృతి యొక్క ప్రధానమైన సూత్రము. ఈ సంస్కారమే లేని చదువులన్నియూ కేవలం తాడు తెగిన గాలిపటము వంటివి. తాడుతెగిన గాలిపటము ఏ గంపల పైన వాలునో ఏ కొంపల పైన కూలునో చెప్పలేము గదా! అదే విధముగా సంస్కారము లేని చదువుల వలన ఎవరికి, ఏ విధమైనటువంటి హాని చేకూరుతుందో చెప్పుటకు వీలు కాదు. సంస్కారం లేని చదువులు దీపంలేని గూడు(గృహము) వంటివి. దీపం లేని గృహము నందు గబ్బిలములు, విషపురుగులు ప్రవేశిస్తాయి. సంస్కారం లేని విద్యలు మానవత్వమును మరిపంప జేసి, దుర్గుణములను వికసింప జేసి, దురాచారములలో ప్రవేశింప జేస్తాయి. సంస్కారము లేని చదువులు చెల్లని నాణెం వంటివి. ఈ చెల్లని నాణెమును బిచ్చగాడు కూడా తీసుకోడు. సంస్కారం లేని విద్య నభ్యసించిన విద్యార్థిని కన్న తల్లి దండ్రులు కూడా

ప్రేమించడానికి జంకుతారు. సర్వమునకూ సంస్కారమే ప్రాణ సమానం.

## విద్య అనగా

'విద్య' అనగా కేవలం పదములకు అర్థమును బోధించునది కాదు. సచ్ఛీలవంతులుగా రూపొందింప జేయటమే విద్య యొక్క ప్రధానకర్తవ్యం. కేవలం విజ్ఞానమే దివ్యమైన శక్తియని అనేక మంది భావిస్తుంటారు. కాదు....కాదు....క్రియాశీలతే నిజమైన శక్తి. "వినయము లేని విద్య, విచక్షణ లేని పని, విజ్ఞత లేని పాండిత్యం, సత్యము లేని పలుకు, కృతజ్ఞత లేని మైత్రి, మాధుర్యం లేని సంగీతం, నీతి నిజాయితీలు లేని రాజకీయము జగత్తున రాణించదు".కనుక వినయముతో పాటు విజ్ఞానముండినప్పుడే, తమ యొక్క వివేకం వికసింప జేస్తుంది. కనుక ఈనాడు జగత్తునకు, సమాజమునకు ఉపయోగ కరమైన విద్యనభ్యసించాలి. జాతి పౌరులను సరిదిద్ది, వారిని సరియైన మార్గంలో నడిపింప జేసేటటువంటిదే సరియైన విద్య.

## మానవత్వం

మానవ జాతి పవిత్రమైనది, ఉత్తమమైనది, చాలా విలువైనటువంటిది. అట్టి విలువైన మానవత్వాన్ని ఈనాడు మనం విస్మరించాం. మానవతా లక్షణములను మరచి పోయినాము. కనుకనే దేశంలో ఇన్ని అల్లకల్లోలములకు అవకాశం ఏర్పడింది. దేశంలో దరిద్రం తాండవించడానికి గాని, భయభ్రాంతులకు గురికావటానికి గాని, ఆధ్యాత్మిక రహస్యాలను గుర్తించుకో లేని మూఢులు అధికంకావటానికి గాని, నైతిక ధార్మికత్వాన్ని కోల్పోవటానికి గాని కారణం ఏమిటి? మానవుడు, మానవునిగా, మానవులలో సంచరించ లేక పోవడమే దీనికి మూల కారణం. మానవుల మధ్య ఈ మానవుడు మృగముగా ప్రవర్తిస్తున్నాడు, రాక్షసుడుగా జీవిస్తున్నాడు. మానవునిలో ప్రవేశించిన అహంకారం, అసూయలే దీనికి కారణం. దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యుడు దట్టమైన మేఘముల చేత కప్పబడినప్పుడు, సూర్యుడు ఏ విధంగా కనిపించడో, స్వప్రకాశమైన ఆత్మతత్త్వమును, అహంకారమనే మేఘము చేత కప్పబడటం వలన మానవత్వమునే మరిపింప జేస్తున్నది.

## స్వార్థం-స్వభావం

స్వార్థం...స్వార్థం... ఏమిటి ఈ స్వార్థం? ఈ స్వార్థమంటే అర్థమేమిటి? స్వ + అర్థము = స్వార్థము. వ్యక్తి యొక్క స్వార్థము కాదిది.'స్వా'అనగా 'ఆత్మ' ఆత్మను అర్థము చేసుకోవటమే స్వార్థము. స్వ....భావము అనగా ఆత్మభావమే స్వభావము. ఇది నా 'స్వభావం' అని అనేక మంది అనుకుంటారు. కాదు...కాదు... ఆత్మ స్వభావము నిర్మలమైనది, నిశ్చలమైనది, నిస్వార్థమైనటువంటిది. కనుకనే అట్టి ఆత్మతత్త్వాన్ని ఆనాటి యోగులు"నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, నిర్మల స్వరూపనం" అని వర్ణించారు. అట్టి విలువైన 'స్వార్థము'ను ఈనాడు దేహభ్రాంతితో, దేహమునకు అవసరమైన విషయములను కోరటమే 'స్వార్థము"అని భావిస్తున్నారు.

## దేహం, ప్రాణం, జ్ఞానం

దేహము జడమైనది ఇది కేవలం పదార్థముల చేరిక, ఇట్టి దేహమును ఏది కదిలింప జేస్తుండాలి?అదియే జ్ఞానం, అదియే ప్రజ్ఞానం. దీనినే వేదము "ప్రజ్ఞానం బ్రహ్మ" అన్నది. ఈ ప్రజ్ఞానమును, ఆంగ్లభాషయందు Radiation అన్నారు. ఈ Radiation ద్వారా దేహాన్ని కదిలించే కదలిక శక్తికే Vibration అన్నారు. అదియే ప్రాణము. ఆ ప్రాణశక్తి వలననే దేహం కదలుతుంటుంది. ఇది కేవలం ఒక Materialisation. కనుక దేహము పదార్థముల యొక్క చేరిక. ప్రాణము పదార్థము యొక్క చేరిక. జ్ఞానము పరమాత్ముని యొక్క చేరిక. కనుకనే ఈ మూడింటి (దేహము, ప్రాణము, జ్ఞానము) యొక్క

సన్నిహిత, సంబంధ బాంధవ్యాన్ని విద్యార్థి గుర్తించడానికి తగిన ప్రయత్నం చేయాలి. అయితే ఈనాడు విద్యార్థి జడమైన ఈ దేహము వలననే ఆనందమును అనుభవిస్తున్నానని భావిస్తున్నాడు. ఇది నిజమైన ఆనందం కాదు, స్థిరమైన ఆనందం అంతకన్నా కాదు, ఇది క్షణికమైన ఆనందం. యౌవనం క్షణంలో మారిపోయేటటు వంటిది. ఈక్షణ భంగురమైన ఆనందం కోసం పరుగిడు తున్నారు గాని, నిత్యసత్యమైన ఆత్మానందం కోసం ఎవ్వరూ కృషి చేయటం లేదు.

## యాంత్రిక విద్య

ఈనాడు విజ్ఞానాన్ని ఆర్జిస్తున్నాం. విజ్ఞానానికి తెలివి తేటలు లేకపోతే విజ్ఞానం వలన ఏమి ప్రయోజనం? తెలివి తేటలు పెంచుకుంటున్నాం కాని విజ్ఞానం లేక పోతే ఏమి ప్రయోజనం? "Knowledge Without Action is Useless, Action Without Knowledge is Foolishness" కనుక ఈ రెండింటి యొక్క చేరికనూ కావాలి. అయితే ఈనాటి విద్యావంతులు ఈ రెండింటికినీ ఏ మాత్రం చేరిక లేకుండా చేసుకుంటున్నారు. ఈనాడు జాతీయభావము విద్యార్థుల యందు శూన్యమై పోతున్నది. ఈ నాటి విద్యా విధానం కూడనూ దురవస్థలలో ఉంటున్నది. విద్యాధికారులు విద్యామంత్రులు మారుతున్నారు గాని విద్య మాత్రం మారటం లేదు. ఈనాడు మన భారత దేశంలో 200 విద్యాలయాలున్నాయి. 9000 కళాశాలలున్నాయి. వీటిల్లో ఒక కోటి మంది విద్యార్థులు చదువుతున్నారు. వీరిని గ్రాడ్యుయేట్సుగా చేసి ప్రపంచంలోనికి వదిలి పెడుతున్నాయి ఈ విద్యాసంస్థలు. ఈ విద్యాలయములన్నీ కేవలం యాంత్రికంగా పనిచేస్తున్నాయి. ఒక విధమైన Mechanical Work Shop గా పని చేస్తున్నాయి. విద్యార్థులనుGraduates గా తయారు చేయటం బయటకు పంపటమే వీటి పని. విద్యార్థుల భవిష్యత్తును గురించి అటు ప్రభుత్వం గాని, ఇటు విద్యాలయాలు గాని ఎవ్వరూ పట్టించుకోవటం లేదు. సమాజము నకు ఉపయోగ పడని విద్యలు చదివి ప్రయోజనం ఏమిటి? ఈనాటి విద్యలన్నీ కేవలం ఇంద్రియాలకు బానిసలుగా జేస్తున్నాయి. అందువలన సమాజములకు సేవ చేయవలసిన విద్యావంతులు నేడు కేవలం ఇంద్రియాలకు బానిసలై పతనమై పోతున్నారు. కనుక విద్యా విధాన స్వరూపం మారాలి. ఏ విద్యనభ్యసిస్తే తనకు తన కుటుంబమునకు దేశమునకు ఉపకారమవుతుందో అట్టి విద్యను నేర్వాలి.

## ఆధ్యాత్మికము

"ఆధ్యాత్మిక విద్యా విద్యానాం" ఇది సర్వ విద్యలకు మూలాధారమైనది. ఇది సముద్రము వంటిది. అన్ని నదులూ సముద్రంలో లీనం కావల్సిందే. లీనం కాకుండా గ్రామాల పైన, పట్టణాల పైన పడ కుండా రెండు వైపులా గట్లు ఉండాలి. అదే విధంగా ఈ జీవితమనే నదికి "శ్రద్ధావాన్ లభతేజ్ఞానం" అనే అష్టాక్షర నామం ఒకవైపు గట్టుగా, "సంశయాత్మా వినశ్యతి" అనే అష్టాక్షర నామం మరో వైపు గట్టుగా ఉండాలి. ఒక గట్టు శ్రద్ధ, రెండవ గట్టు సంపూర్ణమైన విశ్వాసం - ఈ రెండూ ఉండినప్పుడే ఈ జీవితమనే నది అనుగ్రహమనే సాగరంలో లీనమై పోతుంది. గట్టులు లేని నది, గట్టులు తెగిన నది ఏ విధంగా గ్రామాల మీద, పట్టణాల మీద పడి భీబత్సం సృష్టిస్తుందో! జీవితం మీద శ్రద్ధ, విశ్వాసం లేని మనిషి ప్రవర్తన కూడ అదే విధంగా ఉంటుంది. ఈనాడు సమస్త అనాచారములకు మూలకారణము ఆధ్యాత్మికతను కోల్పోవటమే.

## ఆత్మవిశ్వాసము

ఆత్మవిశ్వాసము లేని జీవితం అదొక జీవితమా? కనుక తనను తాను కాపాడుకోవటానికి మొట్టమొదట తగిన ప్రయత్నం చేయాలి. మొట్టమొదట Self Support ను మనం గావించాలి. ఈ Self Support చేసినప్పుడు Self Confidence అభివృద్ధి అవుతుంది. ఈ Self Con-

fidence అభివృద్ధి అయినప్పుడు ఈ Self Sacrifice ను చేయగలుగుతాం. Self Sacrifice ను గావించినప్పుడు Self Realisation లభిస్తుంది. ఈ Realisation లేకపోతే మానవ జీవితమే వ్యర్థమవుతుంది. కనుక మానవత్వంలో ముఖ్యంగా వుండ వలసిన ఈ లక్షణములు విద్యా విధానంలో కూడా ఉండాలి.

## HELP EVER, HURT NEVER

వాల్మీకి రావణుని 'మూర్ఖుడు'అన్నాడు శ్రీరాముని 'మహాజ్ఞాని' అన్నాడు. 64 విద్యలు నేర్చిన రావణుని 'మూర్ఖుడు' అని 26 విద్యలు మాత్రమే నేర్చిన శ్రీరాముని 'మహాజ్ఞాని' అని ఎందుకన్నాడు? దీని అంతరార్థమేమిటి? రాముని యందు ఈమూడు గుణములు ప్రధానంగా ఉన్నాయి. 1. సర్వే లోక హితేరతః 2. సర్వే జ్ఞానోప సంపన్నః 3 సర్వే సముదితాః గుణైః ఈ మూడు గుణములు రావణుని యందు లేవు. రావణుడు 64విద్యలు నేర్చియూ, ఇంద్రియాలకు దాసుడై పోయినాడు. కాబట్టి ఇంద్రియములకు దాసుడైనవాడు, ఎంతటి విద్యా వంతుడైనప్పటికీ, వాడు మూర్ఖుడే. గుణ రహితుని వలన దేశానికి ప్రయోజనం లేదు. రాముడు దేవుడు కావటానికి కారణం ఏమిటి? 1. సచ్ఛీలము. 2. దయ. 3. అహింస. 4. మనోనిగ్రహము 5. ఇంద్రియనిగ్రహం. 6. కీర్తి లేక ప్రతిష్ఠ- ఈ ఆరు సద్గుణములు ఆయనలో ఉండటం వలననే మానవుడు దేవుడుగా మారి పోయాడు. దీనిని చక్కగా విద్యార్థులు గుర్తించాలి. ఈ ఆరు గుణాలలో ఒక్కటైనా మనలో ఉంటున్నదా ? కాని ఒక్కటి మాత్రం విద్యార్థులందరిలో పరిపూర్ణంగా ఉంటున్నది. ఏమిటది ? Violence (హింసా ప్రవృత్తి) . ఇది మానవతా గుణమునకు చాలా దూరమైనది. ఇది మానవత్వానికే ఒక అవలక్షణం. కనుక Violence (హింసామార్గం) లో మనం ప్రవేశించ కూడదు. ఎందు వలన? అందరి యందు భగవంతుడున్నాడు గదా! నీలో ఉండిన ఆత్మయే, నీ ఎదుటివాని యందుంటున్నది. ఎదుటి వాని యందు ఉన్నటువంటి ఆత్మయే నీ యందుంటున్నది. కనుక పరులను హింసించటమంటే నిన్ను నీవు హింసించుకున్నట్లే అవుతుంది. కనుకనే వ్యాసుల వారు కూడా " పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం" అన్నారు. Help Ever, Hurt Never అన్నారు. నీకు Help చేయటం చేత కాకపోతే మెదలకుండా ఉండాలి. ఇతరులకు Hurt చేయకుండా ఉండటమే గొప్ప Help. ఉపకారం చేయడం చేతకానప్పుడు అపకారం మాత్రం చేయవద్దు. అదే గొప్ప ఉపకారం.

## బలం

మన విద్యాలయములోని విద్యార్థులు ఒక విధమైన కంకణం కట్టుకోవాలి. సమాజంలో ప్రవేశించి ఇంటింటికి భారతీయ సంస్కృతిని చాటాలి. ఈ సంస్కృతియే ఈ దేశమునకు వెన్నెముక. ఇలాంటి సంస్కృతిని మీరు చాటక పోతే మీరు ఇక్కడ చదివి ప్రయోజనం ఏమిటి మీరు ఇవ్వవలసిన గురుదక్షిణ ఒక్కటే. ఏమిటి మీరు శాంతిగా ఉండి, జగత్తునకు శాంతి నందించండి. అదే నాకు ఇవ్వవలసిన గురుదక్షిణ. మీ వలన సమాజంలో ఏమాత్రం అశాంతి కలుగ నీయకుండా చూచుకోవాలి. అందరి యొక్క ఐకమత్యమును మీరు సాధించాలి. ఐకమత్యమే మహాబలం. అంత కంటే గొప్ప బలం వేరొకటి లేదు.

## నిత్యజీవితంలో పనికిరాని చదువులు

ఈనాడు విద్యాలయాలలో చదివిన చదువుకు నిత్యజీవితానికి ఏ మాత్రం సంబంధం లేకుండా పోతున్నది. మన చదువులు కేవలం గ్రంథ పరిచయమునకు మాత్రమే పరిమితమై పోతున్నాయి. కేవలం Bookkish Knowledge వలన దేశానికి ఏమీ ఉపయోగం లేదు. Practical Knowledge లో ప్రవేశించాలి. గ్రంథముల ద్వారా తెలుసుకొనని విషయాలను పరిశీలన చేసి నిత్యజీవితంలో

వాటిని ఉపయోగపెట్టాలి. మనం పుట్టినది, పెరిగినది, జీవించునది, అంత్యమగునది కూడనూ ఈ సమాజము నందే కదా! కనుక ఈ సమాజమునకు సరియైన సహాయం చేయాలి, ఉపకారం చేయాలి. ఈ సమాజంలో మనం కూడా భాగస్వాములనే విషయాన్ని విస్మరించరాదు. సమాజగౌరవం పోతే, నీ గౌరవం కూడా పోయినట్లే. కనుక మొట్ట మొదట ఈ Respectను Self Supportను సంపాదించుకో. నీపైననే నీకు Support లేనప్పుడు, ఇంకా ఇతరులను ఏ రీతిగా విశ్వసించ గలవు? మొట్ట మొదట నిన్ను నీవు విశ్వసించాలి. ఈSelf Confidence లేనటువంటి వాడే ఇతరులను కూడా విశ్వసించడు. కనుక మొట్టమొదట Self Confidence, Self Support లను పెంచుకోవాలి. ఈ రెండూ లేక పోతే Self Sacrifice ను చేయనే చేయలేవు. ఈSelf Sacrifice ను చేయలేక పోతేSelf Realisation కోట్లమైళ్ళ దూరంలో ఉంటుంది. What do you want ? అన్నప్పుడు I want Self Realisation (ఆత్మసాక్షాత్కారం) అంటారు. ఇది మార్కెట్‌లో దొరికే కూరగాయలు కావు. అంత సులభంగా లభించేటటు వంటిది కాదు. మొట్ట మొదట Self Confidence (ఆత్మ విశ్వాసము) ను అభివృద్ధి చేసుకుంటే Self Satisfaction (ఆత్మసంతృప్తి) వస్తుంది. అప్పుడు Self Sacrifice (ఆత్మసుఖ త్యాగం) చేయగలుగుతావు. అప్పుడు Self Realisation (ఆత్మసాక్షాత్కారము) వస్తుంది. కనుక Self Confidence అనే Foundation (పునాది) మీద Self Satisfactionఅనే Wall (గోడ) ను కట్టాలి. దాని మీద Self Sacrifice అనే Roof (కప్పు)ను వేయాలి. అందులో Self Realisation అనేటటువంటి Life (జీవితము) ను మనం కాపురం పెట్టాలి. వీటన్నిటిలోను Self ఏకత్వంగా ఉన్నది. ఈ Self అనగా ఏమిటి? నీ దేహమా? నీమనసా? నీ బుద్ధా? నీ ఇంద్రియాలా? కానే కావు. Self అనగా ఆత్మనే. ఈనాడు అట్టి ఆత్మవిశ్వాసాన్ని దూరం చేసుకొని, కేవలం గ్రంథ పరిచయమైన పుస్తకాధారాన్ని తీసుకొని తద్వారా University లో ఇచ్చే పట్టాను చేతిలో పట్టుకొని ఆఫీసుల చుట్టూ ఉద్యోగం! ఉద్యోగం! అని తిరుగుతున్నారు. ఎన్ని ఉద్యోగాలకు Apply చేస్తున్నారు కాని No Reply అని వస్తుంది. ఈ నిరుద్యోగ సమస్య పెరిగి పోవటం వలన అనేక మంది యువకులు పెడ మార్గాలలో ప్రవేశిస్తున్నారు. ఈనాడు దొంగలలో, కిడ్నాపర్లలో, హైజాకర్లలో ఎక్కువ మంది చదువు కున్న వాళ్ళే, కారణం ఏమిటి? వీరికి తగినటువంటి పనిని (Job) అందించక పోవటమే మూల కారణం. ప్రభుత్వం Jobs ను మాత్రం చూపించటం లేదు గాని కాలేజీలను మాత్రం పెడుతున్నది. ఇది చాలా తప్పు ఏ రంగములో ఎంతమంది ఎటువంటి వారి అవసరముంటుందో గుర్తించి వారికి తగినటువంటి విద్యలు నేర్పాలి. ఏమిటి ఈ చదువు?

"చదువులన్ని చదివి చాల వివేకియై
మదిని తన్నెరుగడు మందమతుడు
ఎంత చదువు చదివి ఏరీతినున్నను
హీనుడవగుణంబు మానలేడు."

"తరచి చదువు చదవ తర్కవాదమె కాని
పూర్ణ జ్ఞానమెపుడు పొందలేడు
చదువులన్నియు చదివి చావంగ నేటికి
చావు లేని చదువు చదువ వలయు."

ఈ చదువుల వలన మనకు శాంతి రాదు. అయితే ఎలాంటి చదువులు చదవాలి? ఈ లౌకికి చదువులతో పాటు ఆధ్యాత్మిక చదువు కూడా ఉండాలి. ఆధ్యాత్మిక చదువుతో పాటు, నైతిక చదువు కూడా ఉండాలి. ఈ Moral Education లేకపోతే ప్రయోజనం లేదు. కాని ఈనాటి Modern Boysకు Moral Educationఅంటే ఏమాత్రం అర్థంకాదు. Moral Education ఎలాంటిది? అది Spirit of Love.

Modern Education ఎలాంటిది? అది Split of Love. కనుక మీరు Split of Love ను కాదు Spirit of Love ను సంపాదించుకోవాలి. కనుక ఆధ్యాత్మిక చదువులతో పాటు లౌకిక చదువులను కూడా మీరు నేర్చుకోండి. ఈ విధంగా చెప్పే స్వామి ఎందుకు విద్యాలయములు స్థాపించాడు? అని మీరు అడగవచ్చు. ఈ విధమైన కళాశాలలు, విద్యాలయములే ఏర్పర్చక పోతే మీరెవ్వరూ ఇక్కడికి రారు. మీకు ప్రీతి కరమైన లౌకిక విద్యలను చూపుతూ, తద్వారా మిమ్ములను ఇక్కడకు రప్పించుకొని, మిమ్ములను ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశ పెట్టుటమే నా లక్ష్యం. లౌకికము, ఆధ్యాత్మికము-ఈ రెండింటిని ఏకత్వము చేయుటయే స్వామి సంకల్పం. అందుకోసమనే మీకు Free Education యిస్తున్నాను. ఒక్కొక్కArts విద్యార్థికి రూ. 60 వేలు, Science విద్యార్థికి రూ. 90 వేలు ఖర్చు అవుతున్నది. ఇంత ఖర్చు పెట్టి, ఇన్ని విధాల మిమ్ములను ప్రేమించి, దగ్గరకు చేర్చుకొని, ఈవిధంగా చదువు చెప్పిస్తున్నామంటే దేని కోసం? దీని వలన వచ్చే ఆదాయంగాని లాభం కాని నాకు ఏమి లేదు. కాని మీ జీవితాన్ని ఆదర్శవంతమైన జీవితంగా అందించాలని నా సంకల్పం. ఆధ్యాత్మిక తత్త్వమును మీలో నింపి లౌకికమైన ప్రవర్తనలో ప్రవేశ పెట్టాలని నా తలంపు. ఆత్మ లక్ష్యములో ప్రకృతిని అనుభవించు. తప్పులేదు. ఆధ్యాత్మికము, లౌకికములు పాజిటివ్, నెగిటివ్ లాంటివి కనుక ఈ రహస్యాన్ని గుర్తించి వర్తించండి.

## రాజకీయాలలో ప్రవేశించకండి

విద్యార్థులారా! మీరు నిజంగా ఒక విధమైన దీక్షను పూనితే మీరు చేయలేనిదంటూ ఏమీ లేదు. అయితే ఒక్క చిన్న విషయాన్ని మీరు గుర్తించాలి. విద్యార్థి దశలో రాజకీయాలలో ప్రవేశించకండి. దీనివలన ఉభయభ్రష్టులవుతారు. చదువు పూర్తి చేసిన తరువాత మీకిష్టమైనచో అప్పుడు రాజకీయాలలో ప్రవేశించండి. దేశాన్ని ఉన్నత స్థాయిలోనికి తెప్పించండి. మనం స్వాతంత్ర్యమును ఎందుకు కోరాం? భారతీయ సంస్కృతికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్న పరదేశీయుల పాలనను వ్యతిరేకించాం. మన వాళ్ళు స్వాతంత్ర్యం కోసం ఎంతో త్యాగం చేశారు. స్వాతంత్ర్యం వచ్చింది. కాని దురదృష్టవశాత్తు ఐకమత్యం చెడిపోయింది. ఆనాడు తెల్లవారు మన నల్లవారిని బాధ పెడుతూ వచ్చారు. అయితే ఇప్పుడు నల్లవారు నల్లవారినే బాధపెడుతూ వచ్చారు. ఇట్టి స్వాతంత్ర్యం వచ్చి ప్రయోజనం ఏమిటి?మీరు స్వాతంత్ర్యమునకు తగిన విలువను అందించాలి. వైస్‌ఛాన్సలర్ చెప్పిన ప్రతిజ్ఞను చదివారు. వాగ్దానం చేసారు. వాగ్దానం అంటే ఏమిటి? ఈనాడు ప్రపంచంలో వాక్........దానం-వాక్కును మాత్రం దానం చేస్తున్నారు. అది కాదు దానము. హృదయాన్ని దానం చేయాలి. హృదయపూర్వకంగా దానం చేయాలి. హృదయము నుంచి వాక్కులో ప్రవేశించి, వాక్కులో నుంచి హస్తములో ప్రవేశించాలి. అప్పుడే త్రికరణ శుద్ధి ఏర్పడుతుంది. ఈ స్నాతకోత్సవంలో వాగ్దానంచేసి, బయటకు పోయి విరుద్ధంగా ప్రవర్తించటమంటే, ఇంతకన్నా పాపం మరొకటి లేదు. వాగ్దానాన్ని నెరవేర్చుకోవటానికి ప్రాణాన్నయినా త్యాగం చేయండి. వాగ్దానాన్ని మాత్రం మరవ కూడదు.

## సవతి తల్లిని ప్రేమిస్తున్నారు

ఏ దేశం వారు ఆ దేశంపై అభిమానమును అభివృద్ధి పరచుకోవచ్చును. తప్పు లేదు. కాని ఈనాడు కన్న తల్లిని వదిలి పెట్టి సవతి తల్లిని మాత్రం ప్రేమిస్తున్నారు. మన దేశం యొక్క క్షేమాన్ని విస్మరించి, విదేశీయుల క్షేమాన్ని కోరుతున్నాం. ఇది తప్పు. స్వదేశీ క్షేమాన్ని కోరుతూ, విదేశీ క్షేమాన్ని కూడా అభిలషించండి. "లోకాస్సమస్తా సుఖినోభవంతు".అన్ని దేశములూ సుఖంగా ఉండాలని మన అభిలాష. ఇటువంటి విశాలమైన భావాలను మన విద్యా సంస్థలలో నేర్చుకొని వెళ్ళాలి. ఇదే స్వామి అందించే ప్రధానమైన ప్రేమ సందేశం.

## భరతమాత పరితపిస్తున్నది

విద్యార్థులారా! మీరు తలుస్తున్నారో లేదో! కాని ఈ భరతమాత మీ నిమిత్తమై ఎంత పరితపిస్తున్నదో మీకు తెలియదు. కాని మీరు భారతదేశంలో పుట్టామనే విషయాన్ని గుర్తించడానికి తగిన ప్రయత్నం చేయడం లేదు. మీ నిమిత్తమై భరతమాత కావల్సినంత సంపదను దాచి పెట్టింది. ఆ సంపదకు అంతేలేదు. ఏమిటి ఆ సంపద? విజ్ఞాన సంపద, ఆధ్యాత్మిక సంపద, అదియే మీ జీవిత రస సంపద. ఈ సంపదలను మీకు కావల్సినంత పెట్టుకొని ఉంది భరతమాత. విదేశీయులు వచ్చి దానిని అనుభవిస్తున్నారు గాని, స్వదేశీయులు దానిని అనుభవించ ప్రయత్నించడం లేదు. అందరూ అనుభవించండి. ఇది "బృందావనమది అందరిది గోవిందుడందరి వాడేలే!". అధ్యాత్మికము నందు సర్వులకూ అధికారముంది. విదేశీయులైనను దీనిని అనుభవించ వచ్చు. కనుక మీరు అనుభవించి, ఆనందించి, మీతోటి మానవులకు, దీనిని పంచి పెడతారని నేను ఆశిస్తున్నాను.

## అపకీర్తి కంటె మరణమే మేలు

" విద్యా అర్థం తీతి విద్యః, సా విద్యా యా విముక్తయే." మానవత్వాన్ని విముక్తి గావించేటటు వంటి విద్య నిజమైన విద్య. మన యొక్క మానవత్వానికి విలువను సంపాదించు కోవాలి. అట్లు లేకుండా సమాజంలోనికి వెళ్ళి అల్లరిగా, చిల్లరగా నీవు ప్రవర్తించినా వంటే తల్లి దండ్రులకు కూడా అపకీర్తిని తెచ్చిపెట్టిన వాడవవుతావు. మన ఇనిస్టిట్యూట్‌కు కూడా అపకీర్తి తెచ్చిన వాడవవుతావు. ఇది కాదు. తల్లిదండ్రులకు మొట్ట మొదట కీర్తిని తెప్పించండి. మంచి కీర్తిని మీరు సంపాదించాలి. అప్పుడే మీరు పుట్టినందులకు సార్థకమవుతుంది. అపకీర్తి కంటె మరణమే మేలు. Death is better than Ignorence. కనుక మనము అమాయకత్వంతో గాని, గర్వముతో గాని, అహంకారంతో గాని, అసూయతో గాని జీవితాన్ని వ్యర్థం చేయగూడదు. చదివిన చదువుకు తగిన విలువ నందించాలి. అదే నీ విలువ. అదే మానవతా గుణము. అదే మానవతా విలువ. అలాంటి మానవతా విలువలను మీరు సంరక్షించుకొని, జగత్తులో జీవించి, సత్కీర్తిని ఆర్జించి, సహాయములో మునిగి మన ఇనిస్టిట్యూట్‌కు తగిన సార్థక నామాన్ని తేవాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నాను. ప్రేమను పెంచుకోండి! ఈ ప్రేమను అందరికీ పంచుకోండి! ఏవిధంగా పెంచుకోవాలి? భగవత్ నామం చేతనే ఈ ప్రేమ పెరుగుతుంది.

*(ది.22.11.94న ప్రశాంతి నిలయంలో జరిగిన స్నాతకోత్సవ సభలో భగవాన్ శ్రీ సత్య సాయి బాబా వారు చేసిన దివ్య ప్రసంగము నుండి)*

జయ జయ జననీ జయవాణి
జయ మనుమమ్మా అలివేణీ ||

వేదము వాదము నీవె సునాదము
మోదము మాకగు ఆమోదవు నీవు,
సృష్టి కారకుని దృష్టి నిలువను
వీడని వీణియ, సాధన మీవు ||జయ||

ఓంకారపు టొంపుల ఆకారవు నీవు
విజ్ఞత నీదవను విద్దెవు నీవు, బుద్ధివి నీవు
నీవె నటనం నీవే నాట్యం నీవే గీతం సంగీతం
సకల చరాచర జగతిని కళలకు
నిలయం నీవు కాణాచివి నీవు ||జయ||

శ్రీవాణి, నీవాణి పాఠకులలో త్రోణి
కలిగింప వైవిధ్య భావాల పులగాన్ని
విందుగా అందిస్తు స్పందింప మా ఎదలు
ఒయ్యార మొలికిస్తు సర్వదా అలరింప ||జయ||

- 'నవ్యకవి' నాదెళ్ల

# భగవాన్ సాయి చమత్కార వాణి

కొమరగిరి కృష్ణమోహనరావు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు తమ ప్రసంగాలలో మధ్య మధ్య చమత్కారాలు వినురుతుంటారు. అయితే అవి పైకి చమత్కారాలు గా కనిపిస్తాయి, వినిపిస్తాయిగాని, ఆ మాటల వెనుక ఎంతో నిగూఢమైన అంతరార్థం యిమిడి వుంటుంది. బాహ్యార్థమును పట్టుకొని ప్రేలాడితే అంతరార్థం అంతుపట్టదు. లోతుకు పోయి ఆ మాటలను సునిశితంగా పరిశీలించి, పరిశోధిస్తే వాటి అంతరార్థం అర్థమవుతుంది. వాటిల్లో తెలుసుకోవలసినది, నేర్చుకోవలసినది, ఆచరించవలసినది ఎంతో వుంటుంది. స్వామి ప్రసంగాల మధ్య ప్రవచించిన చమత్కారాలను(ఇంగ్లీషు పదాలు) కొన్నింటిని నవంబర్94 ప్రత్యేక సంచికలో, సందర్భోచితమైన కొద్దిపాటి వివరణలు శ్రీవాణి పాఠకులకు అందించబడినవి. ఈ దశాబ్ది ప్రత్యేక సంచికలు మరికొన్ని చమత్కారాలను(తెలుగు పదాలు) పాఠకులకు అందిస్తున్నాను. చదవండి! తెలుసుకోండి! అంతరార్థమును అర్థం చేసుకోండి! ఆనందించండి! ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించి తరించండి!

## అసూయ - అనసూయ

"అసూయకు No Season, No Reason. భయంకరమైన కాన్సర్ నివారణకు ఒక ఔషధం ఉన్నది కాని, ఈ అసూయ అనే రోగమును నివారించుటకు ఏమాత్రం వీలుకాదు." అన్నారు భగవాన్ శ్రీసత్యసాయిబాబావారు. అంతేకాదు ఈ అసూయకు ద్వేషము, క్రోధము, లోభములనే బిడ్డలు. అనసూయకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు (సహనం, ప్రేమ, సానుభూతి) బిడ్డలుగా పుట్టారని బాబా ఒక పర్యాయము చెప్పారు.

కామ క్రోధ లోభములే సాధకునికి పరమ శత్రువులు. కామం పెరిగి, పెనవేసుకొని, ఉరిగా మారిపోయి, తనతో పాటు తన వంశాన్నే నాశనం గావించుకున్నాడు 'రావణాసురుడు' దీనికి అహంకారం కూడా తోడైంది. పంచభూతములను వశము చేసుకొనిన 'హిరణ్యకశిపుడు' క్రోధంతో సర్వనాశనం అయినాడు. అసూయ పెరిగి, ద్వేషం పెల్లుబికి, లోభంతో, ధర్మపరాయణులైన పాండవులకు సూది మొన మోపే స్థలము కూడా యివ్వటానికి నిరాకరించి, తనతో పాటు తనకుటుంబాన్నే సర్వనాశనం గావించుకొనినాడు 'దుర్యోధనుడు.'

"రామాయణం లోపల కామం, భాగవతం లోపల క్రోధం, భారతం లోపల లోభం-ఈ మూడింటి ద్వారానే సర్వ శక్తి వంతులైన వారు సహితం సర్వనాశనం అయినారు." అని అంటారు బాబా. ఒక్కొక్కరిలో ఒక్కొక్క దుర్గుణం వుంటేనే, అలనాడు అంతటి మహాశక్తిసంపన్నులు పతనమై కాలగర్భంలో కలిసి పోయారు. అన్ని దుర్గుణములు ఒకే వ్యక్తి లో కూడుకున్నప్పుడు, ఇంకా ఈ మానవుడు ఎంతటి హీనమైన స్థితికి దిగజారి పోతాడో! ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న దుస్సంఘటనలు ఇందుకు తార్కాణం. కనుక మనం అసూయాసంతతివారం కాకూడదు. అనసూయా సంతతి వారం కావాలి.

## ప్రేమ పుత్రులు - కామపుత్రులు

అధ్యాపకుల బాధ్యత కేవలం విద్యార్థులకు బోధించటమే కాదు, వారిని ఆదర్శవంతులైన విద్యార్థులుగా

దిద్దాలంటారు బాబా. క్లాస్‌లో లెక్చర్ చెబుతాం. వింటే వింటారు. లేకపోతే పోతారు అనే నిర్లక్ష్యంగా ప్రవర్తించరాదు అధ్యాపకులు. "నీ ఇంటిలో నీ బిడ్డలు సరియైన ప్రవర్తనలో లేనప్పుడు నీవెంత బాధపడుతావు? వారు నీకు కామ పుత్రులు కావచ్చును గాని, వీరు(క్లాసులోని విద్యార్థులు) నీకు ప్రేమ పుత్రులు. ఈ ప్రేమ పుత్రులను, కామ పుత్రుల కంటే సన్నిహితం చేసుకోవాలి." అని అంటూ బాబా అట్టివారినే 'ఆచార్యుడు' అని పిలుస్తారు. అధ్యాపకునకు, ఆచార్యునకు చాలా వ్యత్యాసము ఉంటున్నది. ఆచరించి బోధించేవాడు ఆచార్యుడని చెప్పారు బాబా. ద్రోణాచార్యుడు తన కుమారుడైన అశ్వత్థామను కూడా కాదని అర్జునునికి అనేక విద్యలు బోధించాడు. తన కామ పుత్రుడైన అశ్వత్థామ కంటే ప్రేమ పుత్రుడైన అర్జునునకే మరిన్ని రహస్యాలు బోధించాడు ద్రోణాచార్యుడని చెబుతూ అందువలననే ద్రోణుని 'ఆచార్యుడు' అని పిలుస్తూ వచ్చారని చెప్పారు బాబా. కనుక ప్రతి అధ్యాపకుడు'ఆచార్యుడు'గా మారాలి, విద్యార్థులను తీర్చిదిద్దాలి.

## పాపి - గోపి

"జీవితము యొక్క లక్ష్యము, గమ్యము ఆత్మకావాలి కాని, ప్రపంచం కాకూడదు. బుద్ధిని ఆత్మాన్వేషణ నిమిత్తం ప్రవేశ పెట్టవలెను కానీ అన్నాన్వేషణ నిమిత్తం ప్రవేశ పెట్టకూడదు. అన్నం నిమిత్తం ప్రాకులాడే వాడు 'పాపి! ఆత్మ నిమిత్తం ప్రాకులాడే వాడు 'గోపి.' అన్నం మింగటానికి మానవుడు రాలేదు. " అని చెప్పారు బాబా. అందు వలననే మన మహర్షులు" జంతూనాం నర జన్మ దుర్లభం " అన్నారు. 84 లక్షల జీవరాసులలోను, మానవ జన్మ ఎంతో ఉత్కృష్టమైనది, పవిత్రమైనది. అయితే ఈనాడు మానవుడు తన పవిత్ర జన్మను నిరర్థకం గావించు కుంటున్నాడు. 'గోపి'గా తరించవలసినవాడు 'పాపి' గా పతనమవుతున్నాడు. 'పశుపతి'గా ఎదగవలసినవాడు 'పశువు'గానే నిలిచి పోతున్నాడు. మానవుడు రాను రాను దిగజారిపోతున్నాడు గాను, పైమెట్టుకు చేరుకోలేకపోతున్నాడు.

## కింకరుడు - శంకరుడు

"సేవకుడు కాని వాడు నాయకుడు కాలేడు! కింకరుడు కాని వాడు శంకరుడు కాలేడు." అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. పైకి చమత్కారంగా కనిపించినా, దీనిలో ఎంతో నిగూఢమైన అర్థం యిమిడి ఉన్నది. దేశసేవకుడైన వాడు అధికారంలోనికి వస్తే, నిస్వార్థ సేవచేస్తాడు. అయితే ఈనాడు సేవ చేయకుండా, అధికారమును హస్తగతం చేసుకోవటానికి అనేక అక్రమ, అనాచార, అవినీతి మార్గముల ననుసరిస్తున్నారు. ప్రజలకు ఏమాత్రం సహాయం చేయకుండానే, ఏవో అడ్డదారుల ద్వారా అందలం ఎక్కాలని ప్రయత్నం చేస్తున్నారు. ఈనాడు పదవిని పొందటానికి ధనం ప్రధానమైన పెట్టుబడి అవుతున్నది. అధికారం చేజిక్కించుకున్న తరువాత, తాము ఎన్నికలలో పెట్టిన సొమ్మును తిరిగి రాబట్టుకోవటాని కోసం అనేక అవినీతి మార్గముల ననుసరిస్తున్నారు. ఖర్చు చేసిన సొమ్ముకు అనేక రెట్లు సంపాదిస్తున్నారు. అభ్యుదయ కార్యక్రమాలకు ఖర్చు పెట్టవలసిన సొమ్ములో అధిక భాగం వ్యక్తుల జేబులలోనికి పోతున్నది. అందు వలన ఆశించిన ప్రగతి కనిపించటం లేదు. దేశ ఆర్థిక వ్యవస్థ అవస్థలలో పడిపోతున్నది. కనుక ప్రజలు విజ్ఞతను ప్రదర్శించాలి. సేవకు, సేవకునికి ప్రాధాన్యత నివ్వాలి. "సేవలో ఉన్నది పవిత్రత, సేవ ద్వారా ప్రేమ అనుభూతి లోనికి వస్తుంది. సేవ వలన హృదయ విశాలత పెరుగుతుంది. సేవ ద్వారా భగవంతుని మెప్పును కూడా పొందవచ్చును. సేవ చేసి లక్ష్మి తరించింది. సేవకుడుగా, నమ్మినబంటుగా హనుమంతుడు ప్రశంసల నందు కున్నాడు. సేవను గురించి ఉపన్యాసం చెప్పటం కంటే, సేవచేసి చూపించటంలోనే వున్నది గొప్పతనం." అని అంటారు బాబా. "సమాజ సేవే సర్వేశ్వరుని సేవ; మానవ సేవే మాధవ సేవ " దీనిని విస్మరించ కండి సేవచేయండి! తరించండి!

## కాముడు - రాముడు

"కాముడున్న చోట రాముడు, రాముడున్న చోట కాముడు ఉండుటకు వీలు కాదు." అని చెబుతూ బాబా ఒక

చక్కటి ఉదాహరణ చెప్పారు. సీతాదేవి తన సర్వస్వమును త్యాగం చేసి, రాముడే నాకు సర్వస్వము, ప్రధానము, ఆధారము అని భావించినప్పుడు రాముడు ఆమె చెంతనే ఉన్నాడు. ఎట్టి ఆపదరాలేదు. ఎప్పుడైతే బంగారు లేడిని చూచి, దానిని ఆశించడం చేత, ఆమెలో కోరికలు ప్రారంభమైనాయి. అప్పుడే రాముడు ఆమెకు దూరమైనాడు. కష్టాలు ప్రారంభమైనాయని చెబుతూ అంధకారము, ప్రకాశము ఒకే స్థానమందు, ఒకే కాలంలో ఉండుటకు, వీలు కాదు గదా! అని చమత్కరించారు. మరోక పర్యాయం బాబా గారు "మానవుని కంటె కోతే మేలు" అంటూ కోతి మనో భావాలను చక్కగా వివరించారు."ఓ మానవా! నేను లేక నీవు లేవు. ఆకారం ధరించిన నీ మనస్సే నేను. కనుక జగత్తును మురిపింప జేసి, దైవాన్ని మరిపింప జేసేది నేను. నీకంటే నేను ఉత్తముణ్ణి.నేను రామ సేవ చేశాను. నీవు కామ సేవ చేసి నావు. నేను రాముదాసునగుట చేత, కాముడు నాకు దాసుడు. కాముడు రాక్షసుడు, కాముడు భగవంతుడు. చెట్టు, ఉడత, పిట్ట-మేమంతా రామ సేవ చేసిన వారమే. కాని మానవుడు చేసిన దేమి? సీతను కష్టాల పాలు చేసింది, రాముని అవస్థల పాలు చేసింది నీవే. నాకైనా క్షణమైనా స్థిరముండు నేమో గాని నీకు అదీ లేదు" అని కోతి మనోభావాలను వివరించారు. ఇది వాస్తవం. అన్ని అరిష్టాలకు కోరికలే మూలం. కోరికలతో భగవంతుని ఆరాదించే వారికి అనుగ్రహం లభించదు. అందువలన కోరికలున్న చోట కాముడుంటాడు. నిష్కల్మషమైన ప్రేమ ఉన్న చోట రాముడుంటాడు. దీనిని గ్రహించాలి.

## కబంధులు - దైవబంధువులు

"కబంధులంకారాదు, దైవ బంధువులం కావాలి. మన సంబంధం కబంధం కారాదు, దైవబంధం కావాలి."అని బాబా ఒక పర్యాయం చమత్కరిస్తూ శబరి, గుహుడు, సుగ్రీవుడు, ఆంజనేయుడు, జాంబవంతుడు, విభీషణుడు, జటాయువు మొదలగు వారందరూ దైవంతో సంబంధం పెట్టుకున్నారు కాబట్టి ముక్తిని పొందారని చెప్పారు. కబంధుడు రాక్షసుడు. రామలక్ష్మణులను సైతం తన బాహువులతో బంధించాడు. పరమాత్మను బంధించడం వలన తగిన శాస్తిని అనుభవించాడు. కనుక మనం కబంధునిలా ప్రవర్తించ రాదు. " వీడిది కబంద హస్తమురా! అంటారు సహజముగా మనవాళ్ళు. అంటే పరుల సొమ్ముని స్వాహాచేయటం అటువంటి వారి లక్షణమన్నమాట. కబంధుడిలా ప్రవర్తించకుండా, మానవుడు, తనలో అంతర్భూతమై వున్న దివ్యత్వమును తెలుసుకొని, తోటి మానవునిలో గల దైవత్వమును కూడా గుర్తించి, సన్నిహిత సంబంధం ఏర్పర్చు కున్నప్పుడు మనం దైవ బంధువులం కాగల మంటారు బాబా. కనుక పరులతో మన సంబంధం కబంధం కారాదు! దైవబంధం కావాలి.

## విందులు - మందులు

"పెద్దల వాక్యాలు విందులు కావు మందులు" అని బాబా ఒక పర్యాయం చమత్కరిస్తూ విందులలో ఏ పదార్థము నైనా వదిలి వేయవచ్చును గాని, భవరోగాన్ని నివారించే ఈ మందు అడుగు పట్టినా, అందులో నీరు పోసైనా ఉపయోగించాలి కానీ వదలి పెట్టరాదంటారు బాబా. ఇది యధార్థం. కొంతమంది మూర్ఖులు పెద్దల మాటలను లెక్కచేయరు. గురువాజ్ఞను శిరసావహించరు. దైవ కార్యాలను హేళన చేస్తూంటారు. సాక్షాత్ శ్రీకృష్ణపరమాత్మ అవతరించిన యాదవకులం తమ కులగురువైన ' గర్గుని' అవహేళన చేయటం వలన సర్వనాశనం అయిపోయింది. నిండు సభలో పవిత్రురాలైన ద్రౌపదిని అవమాన పరచడం వలన కౌరవ వంశం మొత్తం నామరూపాలు లేకుండా పోయింది. పతివ్రత అయిన సీతను చెరబట్టటం వలన రావణాసురుడు తన వంశంతో పాటు సర్వనాశనం అయినాడు. దుర్యోధనుడు, రావణాసురుడు పెద్దల మాటలను పెడ చెవిన పెట్టడం వలన సర్వనాశనం అయిపోయినారు. కనుక ప్రతి ఒక్కరూ పెద్దల మాటలను గౌరవించాలి, ఆచరించాలి.

"భవరోగాలన్నిటికి సరియైన మందు భగవన్నామమే. భగవన్నామాన్ని హృదయ పూర్వకంగా ఉచ్చరిస్తూ, పెద్దలను గౌరవిస్తూ, అందరి యందు దైవభావాన్ని పెంచుకొని, ఏకాత్మభావంతో జీవించినప్పుడే మీరు ఆదర్శమూర్తులుగా తయారవుతారు." అని అంటారు బాబా.

## విత్తచోరుడు - చిత్తచోరుడు

"భగవంతుడు ఎప్పుడూ చిత్తచోరుడే, విత్తచోరుడు కాదు." అని బాబా ఒక పర్యాయం చమత్కరిస్తూ విత్తచోరులు మీరే. విత్తచోరుల నుండి చిత్త చోరులుగా మారండని చెప్పారు. భగవంతుడు ఎన్నడూ విత్తాన్ని కోరడు అనగా లంచం కోరడు. లంచం కోరేది మనమే. భగవంతునికి అర్పించ వలసినది మన చిత్తమునే కాని విత్తమును కాదు. భగవంతునికి చిత్తమును అర్పించిన వానికి మన శ్శాంతి సంతృప్తి కలుగు తుంది. అంతే కాదు భగవదానుగ్రహం కూడా లభిస్తుంది. డబ్బుతో దాన గ్రహమును పొందలేము. ఒక్క ప్రేమ ద్వాకా మాత్రమే భగవంతుని మెప్పును పొందవచ్చును. కనుకనే భగవాన్ బాబా వారు Love all, Serve all (అందరిని ప్రేమించు, అందరిని సేవించు) అన్నారు.

## అన్నాన్వేషణ - ఆత్మాన్వేషణ

"దైవాన్ని వెదికే బుద్ధితో ధనాన్ని వెదుకుతున్నాడు. ఆత్మను వెదక వలసిన బుద్ధితో అన్నాని వెతుకుతున్నాడు. ఆత్మాన్వేషణ చేయకుండా అన్నాన్వేషణ చేయడం అజ్ఞానం కాదా? అని బాబా చెబుతూ మనం బ్రతుకుతున్నది బ్రహ్మకొరకు గాని, అన్నం కొరకు కాదు. ఆహారం దేహ సంరక్షణకే గాని, ఆత్మసంరక్షణకు కాదు. తినటానికి బ్రతకరాదు. బ్రతకటానికి తినాలి. Eat to Live, Not Live to Eatఅంటారు బాబా. ఈనాడు మానవుడు మానవ జన్మ విశిష్ఠతను గుర్తించుకో లేక, కేవలం పొట్ట నింపు కోవటాని కోసం తాపత్రయ పడుతున్నాడు. పశుపక్ష్యాదుల కన్నా హీనంగా, దీనంగా ప్రవర్తిస్తున్నాడు. సంచరిస్తున్నాడు. ఎన్నోజన్మల పుణ్యఫలం ఈ మానవజన్మ. అటువంటి ఉత్కృష్టమైన ఈ మానవజన్మను సార్థకం గావించుకోవాలంటే, నీతి నిజాయితీలనే సద్గుణములను అలవరచుకోవాలి, స్థాయిని పెంచుకోవాలి, ఆదర్శవంతమైన జీవితాన్ని గడపాలి. అప్పుడే ఈ మానవ జన్మ ధన్యమవుతుంది.

## దీర్ఘజీవితం - దివ్యజీవితం

"మానవుడు ఈనాడు ఆశించవలసినది దీర్ఘజీవితం కాదు, దివ్యజీవితాన్ని ఆశించాలి." అని బాబా చెబుతూ పొడిగించుకో వలసినది జీవితంకాదు, గుణాన్ని పొడిగించుకోవాలంటారు. పొడిగించుకొనే జీవితం కాలాధీనం, బలపరచుకో వలసినది గుణం. వ్యక్తి యొక్క క్రియాశీలత అంతా గుణముల పైననే ఆధారపడి ఉన్నది. ధనంకాదు ప్రధానం, గుణం ప్రధానం. గుణం కంటె మించిన బలం వేరొకటి లేదు. ధనపోషణ ముఖ్యము కాదు, గుణపోషణ ముఖ్యం. గుణహీనులు కావటం వలననే కావణుడు, దుర్యోధనుడు తమతో పాటు, తమ వంశములను కూడా సర్వనాశనం గావించుకున్నారు. ధన బలం, జనబలం - సర్వబలాలున్నప్పటికినీ, గుణబలం, దైవబలం కనుక లేక పోతే జీవత సమరంలో ఓడిపోవటం, ఖాయమంటారు బాబా.

కనుక కాకిలా చిరకాలం బ్రతకటం కంటే, హంసలా కొంతకాలం బ్రతికినా చాలు. మంచిని పెంచుతూ, పెంచిన మంచిని పదిమందికి పంచుతూ, పదిమంది చేత 'శభాష్' అని పించుకొనినదే దివ్య జీవితం.

## అతి భాష - మిత భాష

" అతి భాష మతిహాని, మిత భాష అతిహాయి " చెబుతూ బాబా నేటి అధ్యాపకులు, విద్యార్థులు మితభాషను, హిత భాషను అభ్యసించడం మంచిదంటారు. మనం మాట్లాడే మాటలు కఠినంగా ఉండరాదు. హేళనగా అంతకన్నా ఉండరాదు. మృదు మధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి అతిగా మాట్లాడే వారిని 'ఛాటర్ బాక్స్' లంటారు. అతిగా మాట్లాడటం వలన మనలో నున్న ఆత్మశక్తి, దివ్యశక్తి అనేక విధములుగా వ్యర్థమైపోతుంటుంది. అధికమాటల చేత జ్ఞాపక శక్తి కూడా క్షీణిస్తుంది. నరముల బలహీనత ఏర్పడుతుంది. అతి త్వరలో వృద్ధాప్యం కూడా వస్తుంది. అందువలననే మన పెద్దలు 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నారు.కనుక ఏవిషయంలోను అతిగా ప్రవర్తించరాదు.

భగవద్గీత యందు కూడ హితమును, మితమును బోధించబడింది. హితముగా మాట్లాడినా, మితముగా తినినా ఏ ప్రమాదం రాదు. అందువలననే బాబా "అతి తిండి మతి హాని, మిత తిండి అతిహాయి; అతిరాగము మతిరోగము, మిత రాగము అతిహాయి" అన్నారు.

## కీర్తనం - సంకీర్తనం

"కీర్తనం సాధకుని పవిత్రంగావిస్తుంది. విష్ణుకీర్తన విశ్వాన్నే తరింపజేస్తుంది. సంకీర్తన విశ్వశ్రేయస్సును కోరి చేసే సమిష్టి ప్రార్థన "అని బాబా చెబుతూ ఒక వ్యక్తి పాడేపాటను కీర్తనం అంటారు. కీర్తన వ్యక్తిగతమైన భగవత్ప్రార్థన. సంకీర్తన మనగా భగవంతుని లెస్సగా కీర్తించడం పదిమంది కూడి ఏక కంఠంతో హృదయమును కరిగించే విధంగా కీర్తన చేయటం, భగవంతుని కీర్తిని ప్రకటించటమంటారు బాబా.

"సమ్యక్ కీర్తనం సంకీర్తనం" అన్నారు పెద్దలు. కీర్తన పాడేటప్పుడు కేవలం పెదవుల నుండి, గొంతు నుండి వాక్యములు వెలువడ వచ్చును. సంకీర్తన అనేది హృదయము నుండి కరగి, కదలి, స్వేచ్ఛతో, ఆనందంతో, భయభ్రాంతులు లేకుండా కావించు దానినే 'సంకీర్తనం' అన్నారు. ఈ సంకీర్తన నాలుగు విధములు. 1.గుణసంకీర్తన 2. లీలాసంకీర్తన 3. భావసంకీర్తన 4. నామసంకీర్తన.

1. భగవంతుడు గుణాతీతుడని ఒకవైపు చెబుతూ, మరొకవైపు భగవంతునికి గుణగణములను కల్పించి కీర్తించడం 'గుణసంకీర్తన' అని అంటారు. ఇది ఒక విధంగా భక్తుని యొక్క భావోద్రేకమే కాని, ఇది సరియైనది కాదంటారు బాబా.

2. జగత్తు సృష్టియే ఒక లీల. సర్వమూ అతని లీలయే. సర్వులయందున్న లీలాతత్త్వము ఒక్కటి గానే వుంటున్నప్పుడు 'లీలాసంకీర్తన' అనేటటు వంటి దానికి ఒక ప్రత్యేకత ఇవ్వడమనేది భక్తుల భావోద్రేక తత్త్వమే. ఈ లీలా సంకీర్తన కూడ అంత సరియైనది కాదంటారు బాబా.

3. ఒక్కొక్క తలయందు ఒక్కొక్క భిన్నమైన భావములు ఏర్పడుతూ వుంటాయి. 'భావసంకీర్తన' అనేటటు వంటిది కూడా కల్పనే. మానవుని యొక్క భ్రాంతియే. ఇది కూడా సరియైనది కాదంటారు బాబా.

'నామ సంకీర్తన' చాలా ఆనందకర మైనటువంటిది. నామరూపములు ధరించిన దైవత్వానికి నామసంకీర్తన అనునటు వంటిది లీనముగావించు రాజమార్గము. అస్తి, భాతి, ప్రియములు శాశ్వతమైనవి. రూపనామములు మార్పు చెందేటటు వంటివి కనుకనే మార్పు చెందే ఈ మానవత్వమునకు,మార్పుచెందే నామమును ఉచ్ఛరించి, మార్పు చెందని దివ్యత్వమును, శాశ్వతత్త్వమును పొందటానికి మనం ప్రయత్నం చేయాలి. కనుకనే నామసంకీర్తన చాలా ఉత్తమమైనదన్నారు బాబా.

## శివం - శవం

"ఈ దేహం జీవుని మందిరం. మందిరాన్ని శుభ్రపరచటంలో లక్ష్యమేమిటి? ఈ మందిరంలో ప్రతిష్ఠితుడైన దేవుని పవిత్రభావంతో చూడాలి. లక్ష్యము నందు దైవత్వాన్ని ఉంచుకొనక, దేహానికి మాత్రమే మనం అనేక రకముల సెయింట్లు చేస్తుంటే ఏమి ప్రయోజనం? శవానికి అలంకరించి నట్లుంటుంది. లోపల శివం ఉన్నది. శివాన్ని లక్ష్యంలో పెట్టుకోవాలి. అంత వరకే ఇది జీవితం. శవాన్ని లక్ష్యంలో పెట్టుకుంటే అది జీవితం కాదు. మన లక్ష్యం శవం కాదు శివం " అంటారు బాబా. లోపల 'శివం' ఉన్న ఈ దేహం చాలా పవిత్రమైనది. కనుక మన ఆలోచనలు కూడా పవిత్రంగా వుండాలి. చేతలు, మాటలు అందరి చేత మెప్పును పొందబడేట్లుగా ఉండాలి. దురాలోచనలకు దూరంగా, సదాలోచనలకు సమీపంగా ఉండాలి. ఉన్నతమైన, ఆదర్శవంతమైన జీవితాన్ని గడపాలి. 'దేహమే దేవాలయం' అనే సత్యాన్ని విస్మరించరాదు.

## త్యాగరాజులు - భోగరాజులు

"త్యాగరాజులుగా తయారుకాండి! భోగరాజులు కాకండి! "అని బాబా ఒక పర్యాయం చెబుతూ త్యాగమే నా

భోగం. దానికి నేనే ఉదాహరణ. అందరినీ ప్రేమిస్తాను. దుష్టులను, దుర్మార్గులను కూడా ప్రేమిస్తాను. నన్ను దూషించిన వారిని మరింత ప్రేమిస్తాను. పరిహసించిన వారిని మరింత దరికి చేరుస్తాను. దాని వల్ల నాకెంతో ఆనందం కల్గుతుంది. కనుక నా జీవితమే నా సందేశ మంటారు బాబా. కనుక బాబా జీవితం మనకు ఆదర్శం కావాలి. బాబా మాట్లాడే ప్రతిమాటలలో ఆదర్శం కనిపిస్తుంది, ఆచరణ స్ఫురిస్తుంది. త్యాగమే ఆయన జీవిత పరమావధి. మేడమెట్లలో అత్యున్నత మైన ఆఖరిమెట్టు త్యాగం. సర్వోత్కృష్టమైన, అమిత ప్రియమైన వాటిని సహితం,నవ్వుతూ, నవ్వుతూ, ఏమాత్రం సంకోచించ కుండా ఇతరులకు యివ్వగలిగిన వానినే నిజమైన 'త్యాగి'అని అంటారు. దేనిని దానం చేయటం వలన, తనకు సర్వనాశనం తప్పదని తెల్సినప్పటికీ, ఏమాత్రం సంకోచించకుండా, తన అస్తిత్వానికే మూలాధారమైన ఈ భౌతిక శరీరమును సహితం, తృణప్రాయంగా నెంచి, భావించి, త్యజించడానికి ఎవడు సిద్ధమవుతాడో అట్టివాడే నిజమైన త్యాగి. కర్మఫలమును నిష్కామబుద్ధితో త్యజించుటయే త్యాగం. అట్టి త్యాగము వలననే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి వలన శాంతి ఉదయిస్తుంది. "త్యాగేనైకే అమృతత్వమానశుః". త్యాగం చేయుట వలన మోక్షం సిద్ధించును. అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. అన్ని రకముల ధనము కన్నా 'త్యాగధనము' చాలా గొప్పది. అట్టి త్యాగ ధనమును సంపాదించిన వాడే ధన్యుడు. అతడే ఇహపరలోకముల యందు శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను పొందగలుగుతాడు. కనుక ప్రతి ఒక్కరూ త్యాగనిరతిని అలవరచుకోవాలి.

## విలక్షణం - సలక్షణం

"ఈనాడు మనం సృష్టినంతనూ విలక్షణంగా చూడాలి. మన నడవడి, ప్రవర్తన సలక్షణంగా ఉండాలి." అని బాబా చెబుతూ మన చరిత్ర సలక్షణంగా ఉండాలి. ఎవ్వరూ వేలెత్తి చూపకుండాWhite Paper వలె స్వచ్ఛంగా వుండాలంటారు బాబా. మన లక్ష్యము విలక్షణమై ఉండాలి. కాని నేడు మానవులలో సలక్షణ, విలక్షణ గుణముల కంటే, అవలక్షణ గుణమే అధికంగా కనిపిస్తుందంటారు బాబా. దేహభ్రాంతి తప్ప, దైవ భ్రాంతి లోపించుటచే, ఈనాడు మానవుడు అనేక బాధలను, కష్టములను, దుఃఖములను మరియు అశాంతిని ఎదుర్కొంటున్నాడు. దీనినే'అవలక్షణం' అంటారు. మన హృదయం సలక్షణంగా ఉండాలి. మన చూపులు విలక్షణంగా ఉండాలి. అప్పుడు అవలక్షణం ఆమడ దూరంలో ఉంటుంది.

## భీతి, ప్రీతి, నీతి

" నిజంగా మనలో దైవ ప్రీతి ఏర్పడితే, వెంటనే పాపభీతి కలుగు తుంది. ఈ రెండూ వుంటే వెంటనే సంఘంలో నీతిని సాధించగలం. సంఘనీతి మానవ జాతికి జ్యోతి" అని అంటారు బాబా.

మనంచేసే చెడు పనుల వలన ఆ పాప ఫలితమును అనుభవించక తప్పదు. కనుక పాపభీతిని, దైవప్రీతిని పెంచుకుంటూ సంఘంలో నీతి అభివృద్ధి పరచుకోవాలంటారు బాబా. పాపభీతిలో అహింస, శాంతం లభిస్తాయి. దైవ ప్రీతి సత్యము, ప్రేమలను అభివృద్ధి పరస్తుంది. సంఘనీతి మన ధర్మం. నేటి రకరకాల విప్లవాలకు కారణం - పాపభీతి లేక పోవడం, దైవప్రీతి కోల్పోవడం, సంఘనీతి లేకపోవటమే. ఈ మూడు ప్రధానమైన విలువలను కోల్పోవటం వలన సంఘంలో అరాచకత్వం, అశాంతి ప్రబలుతున్నది. కనుక ప్రతి ఒక్కరూ దైవ ప్రీతిని పెంచుకొని, పాపభీతిని కలిగి, సంఘంలో నీతిని అభివృద్ధి పరచాలి. అప్పుడే సమాజం సర్వతోముఖాభివృద్ధిని గాంచుతుంది.

భగవాన్ బాబా వారి మాటలు బంగారపు మూటలు. బాబా పలుకులు వేదవాక్కులు. బాబా చెప్పేది సత్యం, ఆచరించడం మన ధర్మం. ఆచరించుటే వస్తుంది శాంతి. శాంతి తెస్తుంది మనశ్శాంతి. మనశ్శాంతియిస్తుంది ప్రశాంతి. ప్రశాంతి నిలయమే ప్రేమకు నిలయం. అదే పరమేశ్వరుని ఆలయం.

* *

# పరివర్తన సాధనే దత్తుడి స్వభావం

*శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ.*

ప్రపంచం మొత్తం మీద శాంతికోసం ఆరాటం ఎక్కువ అయినట్లు కనిపిస్తోంది. మరోపక్క అశాంతి మాత్రం పెనుభూతం లాగా పెరిగిపోతూనే వుంది.

దేశాలమధ్య యుద్ధాల రూపంలోనే గాక దేశ, దేశాలలోనూ ప్రజలలో నేర ప్రవృత్తియొక్క విజృంభణ రూపంలో, నైతిక విలువల పతనం రూపంలో, రాజకీయ సంక్షోభాల రూపంలో, మతకలహాల రూపంలో యీ అశాంతి మనకు సర్వత్రా దర్శనమిస్తూనే వున్నది.

ఈ విశాల భూమిమీద సత్పురుషులు లేకపోలేదు. వారు ఆయుధ నిరోధం కోసం-శాంతి ఒప్పందాల కోసం ప్రయత్నాలు చేస్తూనే వున్నారు. అయినా, వారికే తృప్తి కలగటం లేదు. అదలా వుంచినా - ఆ కృషి చేసే పెద్దలకు అంతరంగంలో శాంతి కరువై పోతుంది. తమ దగ్గర లేని శాంతిని వారు ఇతరులకు పంచియివ్వ లేక పోవటంలో పెద్ద వింత లేదు.

ఇవాళ అణ్వాయుధాలున్నాయి. నిన్న నాటుతుపాకులున్నాయి. మొన్న కత్తులున్నాయి. అటుమొన్న యేమున్నాయి ? మానవుల చేతులలో కర్రలు, రాళ్ళు మాత్రమే వున్నాయి. అయినా మహాయుద్ధాలు, మారణహోమాలు జరిగాయని చరిత్ర పుటమీద నెత్తురు మరకలు మనకు చెపుతున్నాయి. మానవుడు చంద్రమండల విహార యాత్రకు వెళ్ళినా-ఆ పాత పీనుగుల వాసనలు అతనిక్కి దూరం కావటం లేదు. కారణమేమిటి ?

శాంతి కామన ఇప్పుడూ వుంది. అప్పుడూ వుంది. అప్పుడు ఆయుధాలు లేవు. అయినా యుద్ధం ఆగలేదు. ఈ సమస్య పట్ల లోతయిన అవగాహన లేక మన శాంతి కృషి సఫలం కానేరదు.

ఈ విషయంలో మహాభారతం లోని ఒక చిన్నకథ మనకు గొప్ప సందేశం ఇవ్వగలదు. వినండి.

పాండవులు అరణ్యవాసం చేస్తున్న రోజులలో ఒక రోజున శ్రీకృష్ణుడు వాళ్ళను చూడటానికి వచ్చాడు. రాత్రి కాపలా కోసం ధర్మరాజు-అర్జున భీములు తలా ఒక రెండు గంటలు మెలకువగా వుంటూ వుండేవారు. ఆ రోజు శ్రీకృష్ణుడు తను కూడ కాసేపు కాపలా కాస్తానన్నాడు. మొదటి వంతు ధర్మరాజుది. ఆయన కాపలా కాస్తుండగా ఒక చిన్న భూతం ఆ ప్రాంతాలలో సంచరించ సాగింది. ధర్మరాజు దాన్ని

*జయ గురు దత్త*

**అవధూత దత్త పీఠాధిపతి**

*పరమ పూజ్య జగద్గురు*

**శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి**

## అనుగ్రహ సందేశము

*శ్రీవాణిది సాంస్కృతిక వాణి. సంస్కారమంటే అధ్యాత్మ విద్యయే! ఆవిద్య పూర్వం మన దేశంలో సైన్సుగా, కళలుగా, తత్వశాస్త్రంగా, విస్తరించింది. ఈనాడు ప్రపంచంలో ఈమూడు విజ్ఞాన విభాగాలూ వేటికవి పెడమొగంగా నడుస్తున్నాయి. వాటిని సమన్వయ పరచటం ఈనాడు మనకున్న ప్రముఖ ఆవశ్యకతలలో ఒకటి. శ్రీవాణి పత్రిక పదేళ్ళుగా ఆ కృషి చేస్తోంది. సమర్థవంతంగా చేస్తోంది. ఇది ఒక మనిషి నడిపే పత్రిక. కాని తనే ఒక సంస్థగా సత్కార్యంచేస్తోంది. ఇది యింకా పెరగాలి. ఇంకా పని చేయాలి. ఆ శక్తి యుక్తులన్నీ, ఆదిగురుమూర్తి, శ్రీదత్త జగద్గురుమూర్తి, ఈ పత్రికకు అందించు గాక-*

గద్దించి దూరంగా పొమ్మన్నాడు. అది మరింత దగ్గరై - పెద్దదైంది. ధర్మరాజు దానితో పెనుగులాడసాగాడు. ఆయన పెనుగు లాడుతున్న కొద్ది అది ఆకారంలోనూ, బలంలోనూ పెరిగిపోతుంది.

ఇంతలో అర్జునుడు నిద్రలేచి అన్నను విశ్రమించమని - తాను పోరుకు దిగినాడు. ఆ భూతం ఇంకా పెరిగి పోయింది. ఇంతలో భీముడు నిద్రలేచి - తమ్ముడిని విశ్రమించమని తను యుద్ధం సాగించాడు. ఆ భూతం ఆకాశం అంత పెరిగి పోయింది. భీముడికి అలసట రాసాగింది. ఇంతలో శ్రీకృష్ణుడు లేచి - భీముడికి ధైర్యం చెప్పి నిద్రపొమ్మన్నాడు.

వచ్చింది. చిత్రం! ఆ భూతం లేదు. కృష్ణుడు నవ్వుతూ కూర్చుని వున్నాడు. ముగ్గురూ అడిగారు- "బావా ఆ మహాభూతాన్ని ఎలాగెల్చావయ్యా" అని. శ్రీకృష్ణుడు నవ్వి మెల్లగా చెప్పసాగాడు- "అయ్యా! అది భూతం కాదు. అది మనలో వున్న క్రోధం. శత్రువులను సంహరించాలనే పట్టుదల. అది మీకు ఆ రూపంలో కనిపించింది. యుద్ధం చేసిన కొద్ది బలం పెరిగి పోవటమే క్రోధాసురుడి లక్షణం. కనుక మీరు దాన్ని గెలవ లేక పోయారు.

ఆ భూతం నన్ను కూడా యుద్ధానికి కవ్వించింది. అయినా నేను కదల లేదు. నా నవ్వును చూసిన కొద్దీ ఆ భూతానికి ఉన్న బలం తగ్గిపోయి, దాని రూపమే లేకుండా హరించుకు పోయింది.

క్రోధాన్ని జయించటానికి కావలసింది పట్టుదల కాదు. ద్వేషం వల్లా, పంతంవల్ల శాంతిని సాధించలేము. ఆయుధాలను అస్త్రాలను విసర్జించినంత మాత్రన శాంతి రాదు. ఏ ఆయధాలు లేని జంతువులు చేతులతో, వేళ్ళతో కొట్టు కోవటం లేదా ? ముందుగా హృదయంలో నెమ్మది అనే పరివర్తన రావాలి. అప్పుడే మనం క్రోధాన్ని జయించగలం. శాంతిని సాధించగలం."

ఈ శ్రీకృష్ణ సందేశం యీనాటికి గూడా అన్వయిస్తూంది. దీనికి వేరే వ్యాఖ్యానాలక్కర లేదు. దత్తాత్రేయ చరిత్రలో గూడా యీ తత్త్వమే కనిపిస్తుంది. దత్తస్వామి నిరంతరం తన భక్తులలో పరివర్తనకే ప్రయత్నించాడు. సంహారానికి కాదు. పరివర్తన సాధనే దత్తుడి స్వభావం. *

## మంగళ హారతులు

*రారండోయ్ ! రారండోయ్ !*
*పాఠకులారా ! రారండోయ్ !*
*శ్రీవాణి వచ్చింది దశదిశలు తిరిగింది*
*వార్తలెన్నో తెచ్చింది జన కరదీపికయై వెలిగింది*
*దశ వసంతాలు నిండాయట*
*దశాబ్దోత్సవాలకు విచ్చేయండి*
*నిండు మనస్సుతో చేరండి*
*దండిగ ఆశీస్సు లందించండి*
*కొమరగిరి కారాగార లేఖలు*
*కృష్ణమోహనుని అనుభవ సత్యాలు*
*అందుకోండి ఆ ఆణిముత్యాలు*
*రసజ్ఞుల పాలిటి వరాలు*
*పుష్యంలో ఉదయించింది*
*పౌష్యలక్ష్మితో కలిసింది*
*రంగవల్లులు దిద్దింది*
*సంక్రాంతి ముంగిట నిలిచింది*
*మచిలీపట్నం నుండి వచ్చింది*
*పల్లె పదాలను పాడింది*
*అవార్డు లెన్నో పొందింది*
*ప్రత్యేక సంచికగ వెలసింది*
*అభినందన తోరణాలతో*
*కీర్తి తిలకం దిద్దుకుని*
*స్ఫూర్తి నిచ్చే శ్రీవాణికి*
*మంగళ హారతు లివ్వండి*

**లోలభట్టు శ్రీనివాసరాజు**

శ్లో. ఆశాపాశ విముక్తియుక్త మమలం సంతోషమాన్యం మనః
సేవాయాస వివర్జితం విహరణం మాయావిహీనం వచః
చండీశార్చన మాత్మశుద్ధి జననీ గంగేవ సత్సంగతిః
సోఽ యం సంతరణే పరః పరికరః సంసారవారాం నిధేః

పురాణేతిహాసాలు, ఉపనిషద్వేదాంతాలు, అలాగే మహాకవుల కావ్యప్రబంధాలు చివరికి చిన్న పిల్లలకు చెప్పే కథాసాహిత్యం సహితం సంసారాన్ని ఒక మహాసముద్రంగా అభివర్ణించాయి. ఇవన్నీ యింతగా ఉదాహరణాలతో సహా చెపితే నిజం కాకుండా యెందుకుంటుంది చెప్పండి. మహానుభావులయిన పెద్దలు తమ అనుభవాలనే మనకు సూక్తులుగా ప్రబోధిస్తారు. శాస్త్రాలన్నీ అనుభవాలే. వాటి [illegible]

ఇంతకూ సంసారం సముద్రమంత విశాలమైందనీ, లోతైందనీ, భయంకరమైందనీ అర్థమౌతున్నది.

మామూలు నదులు ఎంత పెద్దవైనా పడవలమీదో ఓడలమీదో దాటవచ్చు. కానీ సముద్రం అలా కాదే. దీనికి ఆవలి గట్టుంటూ వుంటేగా దాటటానికి? అనంతంగా చుట్టూ వ్యాపించి వుందాయె ఈ జలరాశి సముద్రం! పెద్దకొండలు, భయంకర జలజంతువులూ, అనేకం భూమిమీద వున్నవన్నీ సముద్రంలోనూ వున్నాయి. మన సంసారం కూడా అన్ని విధాలా ఈ భయంకర సముద్రంలాంటిదే. ఏ విషయంలోనూ తీసిపోదు. ఈ సంసారాన్ని తరించటానికే యే వేదాంతం చెప్పినా !

ఎలా ఈ సంసార సముద్రం తరించటం అంటే ఏదో సాధనం వుండాలిగా మరి ? అలాంటి సాధనమేదో ఈ శ్లోకంలో వివరించి చెప్పబడింది.

మొట్టమొదట మనస్సును పరిశుద్ధం చేసుకోవాలి. అంటే - నిత్యం మనస్సు సంతోషంతో నిండి వుండాలి. అలా వుండాలంటే ఎలాంటి మాలిన్యం మనసులో వుండరాదు. అసలు మనస్సును కట్టిపడేసేది ఆశ. అది ఒకటి కాదు. అదొక పుట్ట. ఇనుప సంకెళ్ళులా మనస్సును బంధించి పడేస్తుంది. కనుక ముందు ఈ ఆశాపాశాల నుంచి మనస్సును బయట పడేసుకోవాలి. అప్పుడది వినిర్మలమౌతుంది.

అలాగే యితరులకు సేవ చేయాలనే మనఃప్రవృత్తి వుండాలి. అయితే పరులకు సేవ చేసి చాలా శ్రమపడుతున్నాననే భావం యేమాత్రం వుండకూడదు. అంటే సేవ చేయటం మన సహజ ధర్మం అన్నట్లు మనిషియొక్క ప్రవృత్తి వుండాలని అర్థం. ఇక మనం మాట్లాడే ప్రతి మాటలో కాపట్యం వుండకూడదు. సత్యవాక్కు కావాలి. మాయామర్మం లేని వాక్కులే పలకాలి. దాన్నే వాక్శుద్ధి అంటారు. దీనికి తోడు పరమేశ్వరుని యందు నిశ్చల భక్తి భావం వుండాలి. అంటే కొంతమంది లోకంలో మంచి మనసుతో వుంటారు కాని నాస్తికులవుతారు. అలా కాకూడదని భావం. మనస్సు నిర్మలమైనంత మాత్రాన చాలదు. అది పరమేశ్వరుని మందిరం కావాలి.

మరోమాట, వీటన్నిటితోపాటు సత్సాంగత్యం ముఖ్యంగా అలవర్చుకోవాలి. సత్పురుషులంటే - కొందరు నాస్తికులు కూడా సంఘంలో సజ్జనులనిపించుకొంటారు. వాళ్ళు కాదు. నాస్తికులు కూడా పరోపకారబుద్ధితోనే ప్రవర్తిస్తూంటారు కాని మనం అనుకున్న జనన మరణ సహితమైన సంసారాన్ని దాటగలశక్తి ఈ నాస్తికులకే మాత్రం వుండదు. అంటే వారికి మోక్షప్రాప్తి కలగదు. అందుకనే నిర్మలమైన మనస్సు భగవన్మందిరం కావాలి. నిత్యసత్యమైన భగవంతుని తెలుసుకొనే జ్ఞానులే సజ్జనులంటే. అలాంటి మహనీయులయిన సజ్జన సాంగత్యం చాలా అవసరం. ఇది గంగలాగా ఆత్మశుద్ధిని కలిగిస్తుంది. దీని సారాంశం మన కర్థమయిందేమిటంటే...

ఆశలు లేని నిత్య సంతోషం గల నిర్మల మనస్సు ఇతరులకు సేవ చేయాలనే ప్రవృత్తి, మాయామర్మం లేని మాట, పరమేశ్వరారాధన, గంగలాగా ఆత్మశుద్ధిని కలిగించే సత్సాంగత్యం. ఇవి సంసార సముద్రాన్ని దాటించే ఉత్తమ సామగ్రి అని.

*

# " మనుష్యుల మనస్సులను కూడా మంచిగ తీర్చిదిద్దగల శిల్పి శ్రీ సాయిబాబా "

-సర్ ఐజాక్ టైగ్రెట్

నాకు అప్పుడప్పుడు ప్రయాణాలలో ఉన్నపుడు సహితము, సత్యసాయిబాబావారు కొన్ని దూరదేశాలలో కూడా దర్శనమిస్తుండేవారు. మెంఫిసులోని 'టెన్నిసీ' నా జన్మస్థలము. నేనొకసారి మోనిట్రెల్ దేశం వెళ్ళినపుడు ఒక సుందరాంగి ప్రేమలో చిక్కాను. ఆ క్షణిక సుఖం తరువాత ఈ చెడ్డపని ఎందుకు చేసానా అని చాలా విచారించి, బాధను మరచిపోవాలని తలచి విపరీతంగా వైన్ త్రాగాను. ఇది 1977 సం||లో జరిగింది. చాలా సంవత్సరాలు సరళజీవనం తరువాత నా ప్రవర్తన ఇలా దిగజారినందుకు విచారించాను. నాకు అప్పటికి 25 సం||ల వయస్సు. నేను నా 15 వ ఏటనుంచికూడా హిప్పీజుట్టుతోనే వుండేవాడిని. నాకు నల్లమందు వంటి మత్తుపదార్థ సేవ అప్పటికే అలవడింది. నేనీ త్రాగుడుకి అలవాటుపడినతరువాత 'క్వాలూడ్స్' అనే ప్రేమోద్రేకం కల్గించే మాత్రలు మ్రింగడంకూడా మొదలెట్టాను. ఇది ఒకరకం మత్తుమందు మాత్రలు. ఇవి నేను ఎక్కడికి వెడితే అక్కడే దొరికేవి. నేను 'మోనిట్రెల్' లో ఆరు, ఏడు రోజులున్నపుడు వీటిని నాకు రోజూ ఎవరో ఒకరు తీసికొనివచ్చి ఇస్తూండేవారు. వాటిని నేను స్వాహా చేసేవాడిని. అచటనుండి సెంట్ లూయిస్ లోని 'మిసోరీ' పట్టణం వెళ్ళాను. అక్కడకూడా నన్ను ఎవరో ఒకరు కలిసి ఈ మాత్రలందజేసేవారు. వాటిని నేను సేవించకుండా ఉండలేకపోయేవాడను. ఛీఛీ! నేను వెళ్ళి శ్రీ సత్యసాయిబాబావారి దర్శనం చేసుకోవాలి. నాకీ అలవాట్లేమిటి? అనుకొనేవాడిని. ఏడాది నుంచి నేను స్వామిని చూడలేదు కదా. అందుకే నాకీ పరిస్థితి ఇలావుంది అనుకుంటూ వుండేవాడిని. ఏది ఏమైనా ఈ పాడు అలవాట్లు నన్ను వదిలి, పరిశుద్ధ మనస్కుడనైతే కానీ స్వామిని దర్శించడం మంచిది కాదనుకొనేవాణ్ణి.

అపుడు నేను 'మెంఫిస్' లోని నా స్వగ్రామమైన 'టెన్నిసీ' నగరానికి వెళ్ళి మూడు వారాలు నిర్మలంగా గడిపి, తిరిగి 'ఏస్పెన్', 'కొలరెడో' ప్రదేశాలు దర్శించడానికి వెళ్ళాను. ఈ ప్రదేశాలలో నా ప్రవర్తన చాలా నీచంగా దిగజారిపోయింది. ఆ ప్రదేశాలలో నేను రోజుకి 15 నుండి 20 మత్తు మాత్రలను సేవిస్తూ ఉండేవాడిని. ఒక సినిమా నటి నాకొక ఘనమైన పార్టీని ఏర్పాటుచేసిన దినం వచ్చింది. ఆ ముందురోజు రాత్రి నేను ఏదో పెద్ద ప్రమాదం లేదా విపత్తు నాకు సంభవించబోతోందన్న ఆందోళనతో నిద్రనుండి ఉలిక్కిపడి మేల్కొన్నాను. ఇక ఈ మాత్రలు సేవించడం చాలా ప్రమాదం అని తలచి వాటిని మ్రింగడం పూర్తిగా విరమించాను. త్రాగడం కూడా మానివేసాను.

వెంటనే నా స్నేహితుడిని చేరి, నేనిక్కడనుంచి వెంటనే వెళ్ళిపోదలచుకున్నానని చెప్పాను. కానీ 'ఏస్పెన్' నగరంనుంచి బయటకు వెళ్లే నా విమాన ప్రయాణం వాతావరణం సరిగా లేనందున బాగా ఆలస్యమైంది. అట్టి ఆలస్యం వలన, 'డెన్‌వర్' 'కొలరెడో' లలో కాలిఫోర్నియా చేరడానికి దొరకవలసిన విమానాలు దొరకక ఆలస్యంగా కాలిఫోర్నియా చేరాను. కాలిఫోర్నియాలో 'మలిబూబీచ్' లో నాకో ఇల్లు ఉన్నది. నా

ప్రయాణాన్ని 'ఏస్పెన్' ఎయిర్‌పోర్టులో వివరించి, లాస్ ఏంజిల్సు' త్వరలో చేరేలా ఏర్పాట్లు చేసికొన్నాను.

మార్గమధ్యంలో ఒక హోటలు రూములో బస చేసియున్నపుడు రూములో టెలివిజన్ సెట్ ఆన్ చేసాను. అంతట్లో 'క్వాలూడ్' మాత్రలు మానివేసినందున నా శరీరంలో కల్గిన తీవ్రతరమైన మార్పు భయంకర రూపం దాల్చింది. ఆ మాత్రలు సేవించినవారు వాటిని సడెన్‌గా ఆపివేస్తే చాలా ప్రమాదానికి గురౌతారని నాకు అప్పటికి తెలియదు. నా శరీరంలోని ధాతువులన్నీ తీవ్రంగా కుంచించుకుపోయాయి. మూర్ఛ వచ్చేసింది. నా చూపు సన్నగిల్లింది. నోటినుంచి నురగలు వచ్చేసాయి. కళ్ళు తిరిగి పడిపోయాను. ఆ పరిస్థితిలో నా నోటిలోని నాలుక లోపలికి లాగేసింది. విపరీతమైన బాధతో నాలుక లోనికి తోడేసింది. నేను చచ్చిపోతున్నానని పించింది. నా నోట్లో చెయ్యి పెట్టుకొని, నాలుకను లోపలికి తోడెయ్యకుండా బయటకు లాగలేకపోయాను అంతట్లోనే నాకు వేరొక అనుభూతి కలిగింది. క్షణం ముందున్న భయాందోళనలు పోయి, నేనెప్పటికో తేలిపోతున్నట్లనిపించింది. నేను ఆకాశంలో నా తల పైన గల ఆకాశంలోకి నెమ్మదిగా ఎగిరిపోతున్నానా అనిపించింది. నేనొక విద్యుత్‌శక్తితో కదల్చబడుతున్నానా అనిపించింది. కానీ నా కళ్ళకు చూపులేనందువల్ల ఏమీ చూడలేకపోయాను అంతలో—

"ఈ శరీరంలో నీవు మరికొంతకాలం వుండదల్చుకున్నావా లేదా తేల్చుకో?" అని ఎవరో అన్నట్లనిపించింది. నేను వెంటనే 'సాయిబాబా నాకు సహాయం చెయ్యి' అని మనస్సులోనే అనుకున్నాను.

ఇలా అనుకొన్న కొంతసేపటికి ఎవరో ఒక వ్యక్తి నా శరీరంపై గాలిలో ఎగురుతూ, నా నోట్లో బొడ్డు వరకూ చెయ్యిని చొప్పించి నా నాలుకను పట్టుకొని బయటకు లాగినట్లు తెలిసింది. అతడు నా గుండెలపై రుద్ది నాకు శ్వాస కల్పిస్తున్నట్లుగా తోచింది. మరొకసారి అతడు నాలుక పట్టుకొని బయటకులాగి, నన్ను లేవదీసి నిలబెట్టినట్లైంది. నన్ను అతడు మంచంపై పడుకోబెట్టాడు. నాకు శ్వాస ఆడి తెలివి వచ్చేసరికి నా కళ్లు కనిపించాయి. నా శరీరంపై, గాలిలో ఒక పోర్టరు నిల్చియున్నట్లుగా మసక మసకగా కనిపించింది. అతడు కాషాయాంబరం రంగు లాల్చీ ధరించి, బంగారపు రెండు గుండీలు పెట్టుకొని, ఆఫ్రికన్ స్టయిలు జుట్టుతో వున్నాడు. ఆ వ్యక్తి వెంటనే ఫోను రిసీవరు ఎత్తి "ఈ నెంబరు గల రూములోవున్న వ్యక్తి చచ్చిపోతున్నాడు" అని గట్టిగ అమెరికను ఇంగ్లీషులో ఎవరికో చెప్పాడు. ఆ తరువాత నేను అంబులెన్సులో హాస్పిటలుకు చేర్చబడినట్లుగా మాత్రమే నాకు గుర్తుంది. నా కడుపులోవున్న మత్తుపదార్థ ద్రావణాలన్నీ వెళ్ళగ్రక్కించాక నన్ను హాస్పిటలునుండి విడుదల చేసారు. ఆ తరువాత 8 గం॥లకు నాకు జ్ఞాపకశక్తి కలిగి జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే జ్ఞాపకం వచ్చి నన్ను శ్రీ సత్యసాయిబాబాయే రక్షించారేమోననిపించింది. సాయిబాబావారిచటికి ఒక మానవరూపంలో ముఖ్యంగా ఒక 'పోర్టరు'లా ఎలా రాగలరు? కనుక, ఆ హోటలులోవున్న పోర్టరే ఎవరో ఒకరు నన్ను రక్షించి వుంటారని తలచి నేను తిరిగి ఆ హోటలుచేరి హోటలు మేనేజరుతో ఇలా అన్నాను: "నా దగ్గర చాలా డాలర్ల ధనం వుంది. కొద్ది గంటల క్రితం నన్ను రక్షించి సహాయం చేసిన నల్లపోర్టరు (నల్లని శరీరచ్ఛాయగల వ్యక్తి)కి ఈ ధనం ఇవ్వాలనుకొంటున్నాను"_ అనగానే ఆ హోటలు యజమాని, "పనిచేసే స్టాఫు అందరూ హోటల్లోనే వున్నారు. ఇంకా వాళ్ళ దినచర్య, పని సమయం పూర్తి కాలేదు కనుక

ఎవరూ ఇంటికి వెళ్ళిపోలేదు మేము నల్లవారిని ఎవరినీ పెట్టము. ఇక్కడ పనిచేసే వారందరూ తెల్లవారే" అన్నాడు అపుడు నాకు 'నన్ను రక్షించి నది తప్పనిసరిగా శ్రీ సత్యసాయిబాబాయే అవుండొచ్చు' అనిపించింది.

ఆ మర్నాడు నేను తిరిగి విమానంలో 'కాలిఫోర్నియా' చేరి నా 'బీచ్ హౌస్' లో చనిపోతా నేమో నన్న భయంతో రెండురోజులు గడిపాను. సన్ను సాయిబాబా యిండియా రమ్మని పిలుస్తున్నట్లనిపించింది. కానీ ఈ నా దిగజారిపోయిన ప్రవర్తనతో, ఈ పరిస్థితిలో వెళ్ళడం కంటే కొద్ది రోజులైనా పవిత్ర సాధనలో గడిపి వెళ్ళి స్వామిని దర్శించడం మంచిదనిపించింది. నా ప్రవర్తన మెరుగుపడి, నేను చెప్పుకోదగ్గ మంచి భక్తుడనయ్యేవరకూ పుట్టపర్తి వెళ్ళకూడదనిపించింది.

ఈ నిర్ణయం తీసికొన్న తరువాత, నా మనోపరిస్థితిని కొంత కుదటబెట్టుకొని కొన్నాళ్ళైనా మంచి ప్రవర్తనతో సాధన చెయ్యాలనుకున్నాను రెండు రోజుల తరువాత నా స్నేహితుడొకతను వచ్చి ఈ సాయంత్రం అలా బయటకు వెడదామా ? అన్నాడు. మేమిద్దరం కలిసి బీచ్‌లో ఇద్దరు సుందరాంగులనుతీసుకొని, 'హాలివుడ్' లో విందు భోజనానికి వెళ్ళాము. నాతో వున్న సుందరాంగి 'క్వాలూడ్' మందుమాత్ర నాకందించింది. నేను దానిని స్వీకరించకుండా వుండలేకపోయాను. నా చావు తప్పి బ్రతికిన తరువాత నా మనస్సు ఎంతభక్తిలో స్థిరపడిందో చెప్పడానికి ఇంకేమి కావాలి ? ఆ రాత్రి త్రాగుడు త్రాగడం కూడా జరిగి నేను చాలా చిన్నబుచ్చుకున్నాను. నా ప్రవర్తనకు నేనే సిగ్గుపడ్డాను నాకింకా ఆ మాత్ర మైకంలో వుండి ఇంటికి కారు నడపడం మంచిది కాదను కొని బీచ్‌లోనే కారు పార్కు చేసి, కారులోనే కొంత సేపు పడుకోవటం మంచిదని, అలా చేస్తే మత్తుపూర్తిగ వదిలిన తరువాత జాగ్రత్తగా ఇల్లుచేరవచ్చుననిపించింది కారుని పార్కు చేసి ఆ రాత్రి కారులోనే పడుకున్నాను. తెల్లవారుఝామున 6 గం॥ లకు నిద్రవదిలింది. కారు స్టార్టుచేశాను. 'పోర్సిటార్గెట్' అనే పరిక్రొత్త కారది. దానిని నడుపుతూ, 'సన్‌సెట్ బొలివార్డ్' అనే ఘాట్ రోడ్ ప్రాంతంలో కారు చాలా వేగంగా నడుపుతూ, గం॥కు 70 మైళ్ళ వేగంతో లోయలో పడిపోయాను. కొండ శిఖరం నుంచి లోయలో క్రిందగల రోడ్డు వంకరలపై దొర్లుతూ క్రికెట్ స్పిన్ బంతిలా కారు తునాతునకలైపోతూండగా నా మత్తు వదిలింది.

## ఆశ్రిత మందార

పంచభక్ష్యంబులు భక్షించి ననుగాని
సంతృప్తి చెందని జన్మమాది
భక్తిసూత్రముతెల్ల వల్లెవేసినగాని
పరనింద మానని బ్రతుకు మాది
ముత్యాలరాసులు ముంగిట బోసినా
కొసరుకై చేచాపు గుణముమాది
అండగా బంగారు కొండపై నీవుండ
కల్ల పసిడి కేడ్చు ఘనత మాది
చూడముచ్చటైన సుగుణంబు అరుదైన
మమ్ము సంస్కరింప మనసు గలిగి
అవతరించినావ ఆశ్రితమందార
ప్రణతులందుకొనవ పర్తిదేవ !

- ఏకా రామచంద్రరావు

నా ఛాతీని గట్టిగా సాయిబాబావారి చేతులు చుట్టబెట్టి పట్టుకుని ఆ కారు నుండి బయట పడవేశాయి. నా కళ్ళ ముందే కారు భస్మమై క్షణంలో నామ రూపాలు లేకుండా మండిపోయింది. మూడు రోజుల లోపల రెండు సార్లు నన్ను బాబా రక్షించినందుకు నా శరీరం వణికిపోయింది. నేను తప్ప ఏమీ మిగలకుండా నా కారు మండి బూడిద అయింది. నేను ఇంటికి చేరిన వెంటనే - ఏమీ ఆలస్యం చెయ్యకుండా ఏ విమానం దొరికితే ఆ విమానంలో బయలుదేరి ఇండియా వచ్చి శ్రీ సత్యసాయిబాబావారిని దర్శించాను. కానీ స్వామి నాతో మాట్లాడలేదు. ఆయన మాట్లాడకపోయినా, సాయి సర్వజ్ఞుడని, సర్వవ్యాపి అని, నాకు తెలుసు. ఇంతకు ముందు కూడా స్వామితో నాకు చాలా అనుభవాలున్నాయి. అసలు నా జీవితంలో వ్యాపారం, సాయి భక్తి ఎలా ప్రవేశించాయో చెబుతాను వినండి.

1973 - 74 సం॥ ప్రాంతాలలో The Secret of the Planets (గ్రహముల రహస్యం) అనే పుస్తకాన్ని 'పీటర్ టామ్‌కిన్స్' అనే వ్యక్తి వ్రాసి ప్రచురించాడు. ఈ పుస్తకంలోని విషయంపై ఒక సినిమా తియ్యాలని నేనా రచయితని పుస్తకం తాలూకు హక్కులు అమ్మమని అడిగాను ఆ పుస్తకానికి బజారులో గిరాకీ లేదనీ, వెయ్యి కాపీలు కూడా గత నెలనుంచి అమ్ముడు పోలేదనీ, ఆ పుస్తక హక్కులకు ఆయన ధర చెప్పడానికి సందేహించాడు. ఎంతో కొంత ధనమైనా తీసికోమని నేను పట్టుబట్టగా అతడు 2500 డాలర్లు ఇస్తే చాలన్నాడు. అది నిజానికి చాలా హీనక్రయం. నేనా ధనం ఇచ్చి హక్కులు కొన్నాను. మరి నెల్లాళ్ళకు ఆ పుస్తకం బజారులో గిరాకీ పుంజుకుని 32 వారాలు మిక్కిలి ఎక్కువగా అమ్ముడుపోయే పుస్తకాలలో మొట్టమొదటి స్థానం ఆక్రమించింది. ఆ తరువాత 'ఫ్రాంక్ వెల్స్' అనే ఆయన వచ్చి 25 వేల డాలర్లు ఇస్తాను; పుస్తకం హక్కులు తనకు అమ్మివేయమన్నాడు. ఆ పుస్తకం కొని ఏమిచేస్తావని అడిగాను. ఆ పుస్తకంలోని విషయంపై సినిమా తీస్తానన్నాడు. నేనూ ఆ సినిమా తియ్యదలచుకొని హక్కులు అమ్మటకు నిరాకరించాను. సినిమా డైరెక్టరు; కథ వ్రాసిన వారితో నేను సుమారు ఏడాదిన్నర గడిపాను. ఆ కథలో వాళ్ళ కొంతమంది ఆధ్యాత్మిక ప్రాముఖ్యంగల వ్యక్తులను ఏర్పర్లుగ పెట్టారు. వారితో నాకు కొంత పరిచయం ఏర్పడింది. ఈ సినిమా ప్రొడ్యూసరుగా ఈ ఏడాదిన్నర సమయం లోనూ నేను చాలా డబ్బు వ్యయం చేసాను. ఇది గ్రహములకు సంబంధించిన కథ కనుక, ఈ సినిమాలో పాత్రలను పోషించే వ్యక్తులు చిత్రవిచిత్రమైన లీలలు చేస్తుంటారు. ఆ కథ అలా వున్నది. నిజజీవితంలో అట్టి శక్తులుగల వ్యక్తులను మా డైరెక్టరు నాకు పరిచయం చేసాడు.

నేనా వ్యక్తులను ఇంటర్వ్యూ చేసాను. 'మెక్సికో'లో ఒక వ్యక్తి ఉన్నాడు. అతడు పోలిరాయిడ్ కెమేరా ఫిల్ముని తన నుదుటిమీద పెట్టుకొని (కెమేరా లేకుండ) నీకే ఫొటో కావాలని ఎదుటి వ్యక్తి నడుగుతాడు. "మెక్సికో సిటీ అవుటర్ వ్యూ' అని అడుగగానే అతడు ఆ ఫిల్ము తీసి మనకిస్తాడు కెమేరా లేకుండానే ఆ ఫిల్ములో ఎదుటి వ్యక్తి అడిగిన బొమ్మ వస్తుంది. ఇటువంటి శక్తులుగల వ్యక్తులనెందరినో డైరెక్టరు నా సినిమాలో పాత్రధారులుగా ప్రవేశపెట్టడం ద్వారా, నాకు వారి ఇంటర్వ్యూలలో తేలిన విషయం ఏమనగా- ఇటువంటి అద్భుతశక్తిగల యోగులు చాలామంది భారత దేశంలో ఉన్నారని, అటువంటి వారివి ఏభై పేర్లు నేను సేకరించుకొని, భారత దేశం దర్శించాలనే ఆకాంక్షతో ఇండియా చేరాను.

నాతో కూడా నా సినిమా బృందం వచ్చింది. వారందరూ ఒక హోటలులోనూ నేనింకా ఖరీదైన పెద్ద మరో హోటలులోనూ బస చేసాము. అది ఔరంగాబాదు పట్టణము. ఆ హోటలు లాబీలో 'సాయిబాబా' వారి లైఫ్ సైజు ఫొటో వుంది. ఆ ప్రదేశంలో నేను తిరుగు తుండగ నాలోంచి అంతర్వాణి 'వచ్చావా బంగారూ? నీవు వస్తావని నాకు తెలుసు. నీకోసం ఎంతగానో ఎదురుచూస్తున్నాను' అని వినవచ్చింది. నాలోంచి విన వచ్చిన అంతర్వాణికి నేనాశ్చర్యం పొంది, ఆ ఫొటో ఎవరిదని హోటలువారి నడిగాను. అది సాయిబాబా వారిదనీ, ఆయన అవతార పురుషుడని హోటలు మేనేజరు వివరించాడు 'అవతార్' అంటే ఏమిటని ప్రశ్నించాను. ఆయన 'దైవం' అని వివరించాడు. అంతటితో నేను నా సినిమా ప్రయత్నం కట్టిపెట్టేసి, నా గ్రూపు వారందరినీ తరువాత కలుస్తానని చెప్పి వెంటనే విమానంలో బెంగుళూరు చేరాను.

అది మార్చి నెల 1974 సం॥ వైట్‌ఫీల్డ్‌లో బాబా వారిని దర్శించాను ప్రథమ దర్శనంలోనే స్వామి తిన్నగా నా దగ్గరకొచ్చి సుమారు, 5-6 గ్రాముల విభూతి, కొంచెం ఎక్కువ విభూతి సృష్టించి ఇచ్చారు. స్వామి వెనుదిరిగి వెళ్ళిపోతున్నారు. నేను ఆశ్చర్యంతో అలాగే నిలబడి వున్నాను. బాబా వెను దిరిగి, "తినెయ్యి! అది మనసుకు చాలా మంచిది" అన్నారు. వెంటనే ఆ విభూతి మొత్తం తినేశాను. నాకు గొంతులో ఉక్కిరిబిక్కిరయ్యింది. శ్వాస ఆడ లేదు. కళ్ళు తిరిగి పడిపోయాను. అంతకు ముందు సుమారు వెయ్యిమంది భక్తులున్నారు. కానీ నాకు స్పృహ వచ్చేసరికి నన్ను కనిపెట్టి చూస్తోన్న ఒక్క ఇంగ్లీషు వ్యక్తి తప్ప మరెవ్వరూ లేరు. దీని అర్థం ఏమిటో నాకు తెలియదు. "అవతార" మేమిటి? సర్వ వ్యాపకత్వ మేమిటి? సాయిబాబా ఎవరు? అనే సందేహా లతో సతమతమవుతూనే అక్కడినుండి బయలు దేరాను. విమానంలో మహాబలిపురం చేరాను. అక్కడొక మూడురోజులుండి, నా మనసులో మారు మ్రోగుతున్న సాయిని గూర్చిన సందేహాలతో ఇంగ్లండు వెళ్ళిపోదలచి మద్రాసు నుంచి ఢిల్లీ విమానమెక్కాను.

నాకా విమానంలో ఖాళీ సీట్లు గల వరుసలో సీటు ఇచ్చారు. కానీ నేనచట కూర్చోలేక, వెనుక వరుసలో ఒక ఖద్దరు బట్టలు కట్టుకొని, ఖద్దరు టోపీ పెట్టుకొని కూర్చున్న 90 ఏళ్ల వయసుగల వ్యక్తి ప్రక్కకిచేరాను. ఆయన బాగా తగ్గుతున్నాడు. నా మనసులోని సందేహా లను ఆయన్ని అడగాలనిపించింది. బృందావనంలో కొనుక్కున్న సాయిబాబావారి చిన్నసైజు ఫొటో చేత్తో పట్టుకున్నాను.

నా ప్రక్కన గల ముసలాయన, నా చేతిలో గల ఫొటోను వంగి చూసి, 'ఓహో! సాయిబాబాయా! ఆయన గొప్ప గురువు!' అన్నారు. అని; నా గురు వుని కూడా నీకు చూపిస్తాను అంటూ ఒక చిన్న జిప్పు బ్యాగ్‌లోంచి పాతది అద్దం కట్టిన చిన్న ఫొటో ఒకటి తీశాడు. అది ఒక గ్రూపు ఫొటో. 'ఇదుగో ఈ ఫొటో లోని మధ్య వ్యక్తి నా గురువు రామకృష్ణ పరమహంస ఆయన ప్రక్కన నిలబడిన వ్యక్తి నా తండ్రి' అన్నాడు. 'రామకృష్ణ పరమహంస అంటే ఎవరు?' అని ప్రశ్నించాను ఆయన అవతార పురుషుడని వివరించాడు. ఆయన మాటలు కొన్ని నా సందేహాలకు జవాబునిచ్చాయి. నేను హాయిగా సీట్లో వెనక్కి జార్ల పడి, ఆయన మాటలు వింటూవున్నాను. అంతలో ఆయన ధ్యానం చేస్తూ నడుము నిటారుగా నిలబెట్టి కళ్ళు మూసుకొన్నాడు. అలా కొంతసేపు జరిగాక ఆయన తటాలున నా భుజంపై తట్టి 'నీకోవస్తువివ్వాలి'

అంటూ తన జిప్పు బ్యాగ్ నుంచి నుంచి ఒక పాత వక్కపొడి భరిణ వంటిది తీశాడు. నేను చాలా ఆశ్చర్యంగా ఆయన చర్యను గమనిస్తున్నాను. బహుశా ఆయన ఆ భరిణను పాతికేళ్ళుగా ఎప్పుడూ తెరవలేదేమో అనిపించింది. అందులో వున్న తమలపాకులు వంటివి ఎండిపోయి పొట్టుపొట్టు అవుతున్నాయి వాటి అడుగున పాత సిల్కు గుడ్డలో చుట్టిన 'విభూతి' పొట్లం ఉన్నది. ఆ విభూతి రామకృష్ణ పరమహంస చేతితో తాకి ఆశీర్వదించిన విభూతిట ఈ విభూతిని నా తండ్రి ఎప్పుడూ దగ్గర వుంచుకున్నాడు. ఆయన జీవితం చాలింపాక నేను దానిని దగ్గర వుంచుకొన్నాను దానిని నీకిపుడు ఇవ్వదలచుకున్నాను " అన్నాడాయన. అది సాయిబాబా వారు సృష్టించిన విభూతిలాగే వుంది. దానిని విడచి పెట్టడం ఆయనకు ఇష్టం లేనట్లే కనపడినా, నాకెంతో ప్రేమతో ఇస్తున్నట్లనిపించింది.

నేను కొంత విభూతి ఆ పాత సిల్కుగుడ్డ మూట లోంచి తీసి నుదుటపై పెట్టుకొని కొంత నోట్లో వేసికొన్నాను ఆయనకు చాలా కృతజ్ఞతలు చెప్పుకున్నాను. మా యిద్దరితోనూ కలిసి ఎవరో అదృశ్యశక్తి మామధ్య కూర్చున్న భావన; ప్రశాంతత నాలో కలిగాయి. ఆయన నేను చేత్తో తీసికోగా మిగిలిన విభూతి మూట గడుతుంటే, ముసలాయన కదా, ఆయన చేతులు వణికాయి. అలా వణకడంచే కొంత విభూతి త్రుళ్ళి కిందపడిపోతుందేమోనని, నేను ఒక లెటర్ పెడ్ కాగితమును ఆ పొట్లానికి క్రిందుగా పెట్టాను. అనుకున్నట్టే కొంత విభూతి క్రిందకు త్రుళ్ళింది. ఆ విభూతి క్రిందపడుతూ మధ్య గాలిలో ఎఱ్ఱని కుంకుమగా మారి కాగితముపై పడింది. అది చూసి మేమిద్దరమూ చాలా ఆశ్చర్యపడ్డాము. " ఓహో! ఈ లీల నీ గురువు చేసిన పని. మా గురువు లీలలు చేయడు. నీ గురువైన సాయిబాబాయే నీ మంచి కోరి ఇలా విభూతిని కుంకుమగా మార్చాడు. కనుక నీవు తప్పనిసరిగా ఈ విభూతి పొట్లాన్ని ఎల్లప్పుడూ నీ జీవితకాలం అంతా నీతోకూడా వుంచుకోవాలి '' అంటూ ఆయన ఆ పొట్లం నాకిచ్చాడు ఆ కుంకుమగా మారిన విభూతి పొట్లాన్ని నేను నా మనీపర్సులో పెట్టుకున్నాను.

## విదురనీతి

తపోబలం తాపసానాం
బ్రహ్మ బ్రహ్మవిదాం బలమ్
హింసా బలమ సాధూనాం
క్షమా గుణవతాం బలమ్

తాపసులకు తపస్సే బలము, బ్రహ్మవేత్తలకు వేదమే బలము, దుష్టులకు బలము హింస, గుణవంతులకు ఓర్పు బలము.

1974 వ సం॥ నుంచీ ఆ పొట్లాన్ని నేను పర్సులో నా 'పెన్సిన్ డ్రైవింగ్ లైసెన్సు'తో కలిపి ఎప్పుడూ పర్సులో వుంచుకుంటూ రాత్రిళ్ళు తీసి పూజ గదిలో పెడుతూ తిరిగి ఉదయమే జేబులో పెట్టుకుంటూ వుండే వాడిని. ఆ రోజుల్లో సాధారణంగా నేను ఇంగ్లండులో నివసిస్తూ వుండేవాడిని. నా వ్యాపారం అక్కడే సాగుతుండేది. లండన్‌కి సుమారు 25 మైళ్ళ దూరంలో వున్న 'ఏస్కాట్' నగరంలో కొన్నాళ్ళు నివసించాను. సాయిబాబావారి దయ వలన నా 'హార్డ్‌రాక్' కేఫ్ అండ్ రెస్టారెంటు హైడ్‌పార్కు కార్నరులో చాలా జయప్రదంగా నడుస్తూండేది, నేను ఏస్కాట్ నుంచి రోజూ నా రెస్టారెంట్ కి (యూరప్) వచ్చి వెడుతుండేవాడిని.

(సర్ ఐజాక్ బ్రైగేట్ తన అనుభవాలను వివరిస్తూ "యునైటెడ్ కింగ్‌డం" అనే విదేశీ పత్రికలో ఒక వ్యాసం వ్రాసాడు. దానిని శ్రీ N. B S రామారావు అనువదించారు.) ( ఇంకా వుంది )

# సున్నిత మనస్కుడు, నాజూకు భావకుడు కొడాలి

— కంచి వాసుదేవరావు

" రాతి గుండెలు గలిగిన రాచభటుల
కర్కశ ఘాతముల మేను కందిపోయిన "

స్వాతంత్ర్య సమరయోధుడు ఒంటరిగా జైలుగదిలో కూర్చుని కిటికీలోంచి కన్పిస్తున్న చందమామను చూచి స్పందించి కవిత్వాన్ని చెప్పిన కొడాలి ఆంజనేయులు గారిని చూస్తే కవితా వ్యవసాయం చేయదలచి-అందులో గుర్తింపు పొందిన కొంత కృషి చేసి, ఆ తర్వాత రాజకీయాల్లోకి మళ్ళిన (దారి తప్పిన) భావకుడు కన్పిస్తాడు. కవిగా తెలుగు సాహిత్యానికి చేసే సేవలు కన్నా - మహాత్మాగాంధి నాయకత్వంలో విలక్షణమైన విశిష్టమైన పద్ధతులలో స్వాతంత్ర్య సమరం కోసం జరుగుతున్న పోరాటంలో ఒక సైనికుడిగా పాల్గొని దేశానికి చేసే సేవ మరింత గొప్పదని ఆయన భావించడం ఇందుకు కారణం కావచ్చు.

మహాత్మా గాంధీ భారతీయ రాజకీయరంగంలో ప్రవేశించడానికిముందు 'పాలిటిక్సు ఈజ్ ది లాస్ట్ రిసోర్టు ఆఫ్ స్కౌండ్రల్' అనే ఇంగ్లీష్ సూక్తి-ప్రాచుర్యంలో వున్నప్పటికీ ఒపీనియన్సు ఛేంజిచేస్తేకాని పొలిటీషియన్ కానేరడు. అని గురజాడ గిరీశంచేత చెప్పించినప్పటికీ 1966 తర్వాత రాజకీయాలు అవినీతిమయమైన ధనార్జన వృత్తిగా మారినప్పటికీ, గాంధీజీ రాజకీయాలతో మొట్ట మొదటసారి నైతిక విలువలను ప్రతిష్ఠించటంలో వాటికి గౌరవనీయత ఏర్పడింది. ఆనాడు - రాజకీయాలూ స్వాతంత్ర్య సమరం క్షీర నీర న్యాయంగా కలిసిపోయాయి. రాజకీయాలలో అవకాశవాదం కుటిలత్వం స్థానే నైతికత, రుజు ప్రవర్తన, త్యాగనిరతి ప్రవేశించి ధర్మ యుద్ధ ఆందోళన రూపం దాల్చినందువలన - ఆంజనేయులుగారి వంటి సున్నిత మనస్కులు భావకులు రాజకీయాల్లోకి 'దారిమళ్ళి' వుండవచ్చుననిపిస్తుంది. ఇంతకన్న ముఖ్యకారణం ఆనాటి బందరు వాతావరణ ప్రభావం ఆయన కవి కావడానికి, జాతీయవాది కావడానికి కారణం.

## సత్యాంజనేయ కవులు

బందరులో చల్లపల్లి వెంకటశాస్త్రిగారి కవితాస్పర్శ వేది సోకిన ఆనాటి బాలురెందరో ఆ తర్వాత మహాకవు లయ్యారు. విశ్వనాథ సత్యనారాయణ, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, వేలూరి శివరామ శాస్త్రి వంటివారు అట్టి స్పర్శవేది సోకినవారే. వీరందరికీ ఆంజనేయులుగారు సహాధ్యాయి కాకపోయినా సమకాలికుడు. వీరందరిలో విశ్వనాథకు మరింత సన్నిహితుడు. తిరుపతి వేంకట కవుల ప్రభావం పడిన ఈ ఇద్దరూ సత్యాంజనేయులు పేరుతో తమ కవితా వ్యాసంగానికి శ్రీకారం [చు]ట్టారు. ఇద్దరూ బందరు బుట్టయ్యపేటలోని సీతారామస్వామి దేవాలయంలో కూర్చుని జంటగా పద్యరచన చేసేవారు. ఆ తర్వాత ఇద్దరి దారులు వేరయినా ఆనాటి స్నేహం చివరివరకు కొనసాగింది. విశ్వనాథ బందరు వచ్చినపుడల్లా ఆంజనేయులుగారిని కలుసుకోకుండా ఉండేవారు కాదట.

ఆ తర్వాత ఆనాటి కవులందరి మీద పడినట్లే భావ కవిత్వ ప్రభావం పడింది. ఐతే ఆనాటి భావకవుల మాదిరి స్వప్నసుందరి, ఊహాసుందరికోసం పరితపించలేదు. ఆయన భావక దృష్టికి 'మొగలిరేకుల మృదుల

కపోలయుగము కరకు పెండల వేడిమి కందువారిన' 'సంసార సుఖములను పరిత్యజించి, వ్యర్థ ప్రయాస జీవితాన్ని గడుపుతున్న సన్యాసి ముఖం' 'అడవి తొలకరి పూవులతోట్లు దొరలిన అడవిపిల్ల 'ముగుద చూపులు' 'మాసిన చీరతో పొగడ ప్రామనుల రెమ్మల నీడ దీర్ఘ నిశ్వాసములో నిగడుస్తున్న బాధ 'పగడపు మేలి కెంపులకు బైపడు దాగుడుమూతలాడుతే నగవు గులాబి పూసరమున్న విరిమల్లి రాలినట్లు' వున్న తెలుగింటి పెండ్లి కూతురు 'అటవీ స్థలిన్ నును దృగాంకుర ముగ్ధిని కొండవాగులను దీయని సీరుగ్రోలి పత్ర తీగల నీడ విశ్రమించి' వుండగా బోయవాడు వేసిన నిశిత శరానికి గాయపడ్డ లేడి, మొదలైన అనేక దృశ్యాలు గోచరించి, సుందర కవితారూప చిత్రాలుగా సాక్షాత్కరించాయి ఆంజనేయులుగారి కవితా వ్యాసంగం మరింత సాగివుంటే, ఆధునికాంధ్ర సాహిత్యం గొప్పగా చెప్పుకోదగ్గ కవితాఖండికలు వెలువడి వుండేవి.

## బందరు ప్రభావం

ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వంలో రాజకీయ సామాజిక ఆర్థిక చైతన్యాన్ని కలిగిస్తున్న కృష్ణాపత్రికి అయ్యంకి వెంకటరమణయ్యగారి సంపాదకత్వంలో—ఆంధ్రభారతి కౌత శ్రీరామశాస్త్రిగారి సంపాదకత్వంలో నారదపత్రికలు—కోపల్లెహనుమంతరావుగారు స్థాపించినఆనాటిజాతీయోద్యమానికిస్ఫూర్తికేంద్రమయిన ఆంధ్ర జాతీయ కళాశాల ఆనాటి బందరుకు విశిష్ట కీర్తి ప్రతిష్టలు చేకూరుస్తూ ఆంధ్ర దేశాన్ని ప్రభావితంచేస్తూ వుండేవి. అడవి బాపిరాజు, కోలవెన్ను రామకోటేశ్వర రావు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, మల్లాది రామకృష్ణ శాస్త్రి మొదలయిన జాతీయ నాయకులు, సంపాదకులు, కవులు ఆనాటి బందరులో వుండేవారు. వీరందరి ప్రభావం ఆంజనేయులుగారి మీద వుంది. మహాత్మాగాంధి దేశరాజకీయాలలో ప్రవేశించే నాటికి ఆంజనేయులుగారు కల్తీలేని జాతీయవాదిగా రూపొందారు.

బంగారుగుడ్లని పెట్టే బాతు వంటి రెవిన్యూ ఉద్యోగాన్ని వదలుకుని నిశిత కంటక పరివృతమైన స్వేచ్ఛా మార్గాన్నే ఆయన ఎంచుకున్నారు. నిజానికి ఆనాడు ఆంధ్రదేశంలోని మరి ఏ వూరులోలేని దేశభక్తులు—కాంగ్రెస్ వాదులు బందరులో వుండేవారు డా॥ పట్టాభి, గొట్టిపాటి బ్రహ్మయ్య, చెరకువాడ నరసింహం, గురజాడ రాఘవశర్మ, కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు, దామరాజు పట్టాభిరామారావు, వేమూరి దుర్గానాగేశ్వర రావు, డా॥ పోతరాజు శోభనాచలపతిరావు, డా॥ రాళ్లపల్లి అచ్యుతరామయ్య- మొదలైన ప్రాతఃస్మరణీయులు ఎందరో వుండేవారు. వారిలో ఆంజనేయులుగారొకరు. వీరందరూ మహాత్మాగాంధి బోధలపట్ల విశ్వాసం విషయంలోకాని— కాంగ్రెస్‌పట్ల అంకితభావంలో కాని, త్యాగదీక్షలో కాని, నాయకత్వ లక్షణాలలో కాని ఎవరికీ తీసిపోరు. వీరెవరూ పదవులకోసం తాపత్రయపడిన వారు కాదు. ఎన్నికలలో పోటీచేసి పదవులూ, అధికారం చేజిక్కించుకోవాలన్న తాపత్రయం వీరికి ఉండేదికాదు. ఆంజనేయులుగారి రాజకీయానుభవం అర్హతలకు తగ్గట్టుగా పదవులు లభించలేదు. ఐనా ఆయన అసంతృప్తి చెందలేదు విధేయుడైన కార్యకర్తగా ఆయన చివరివరకు తన బాధ్యతలను నిర్వర్తించారు. అనేకసార్లు జైలుకు వెళ్ళారు.

## పట్టాభి గ్రంథాల అనువాదకుడు

దేశ స్వాతంత్ర్య సమరంలో పాల్గొంటూనే కొంత సాహిత్య కృషి చేశారు. 'సాహితి' అనే సాహిత్య పత్రికను ఆంజనేయులుగారు కొంతకాలం నిర్వహించారు. తన గురువుగారైన పట్టాభిగారు ఇంగ్లీషులో

రాసిన కాంగ్రేస్ చరిత్ర బృహద్గ్రంథాన్ని ఆంజనేయులు గారు తెలుగులోకి అనువదించారు. పట్టాభిగారు రచించిన 'గాంధీయిజం' అనే పుస్తకాన్ని కూడా అనువదించారు.

ఆంజనేయులుగారి చూచినవారి నెవరినయినా ఆకట్టుకునేది. ఆయన నిరాడంబరత- పలకరింపులోని ఆప్యాయత, బందరు వీధులలో మిత్రులతో తిరుగుతూ చమత్కారాలు వెదజల్లుతూ వాతావరణాన్ని ఉల్లాసభరితం చేసేవారు అందరినీ ఆప్యాయంగా పలుకరించేవారు

## ముద్దుకృష్ణ మదింపు

ఆంజనేయులుగారిని గురించి 'వైతాళికులు' ముద్దుకృష్ణ గారు పరిచయంచేస్తూ నాజూకుగా ఊహిస్తాడు మృదువైన పొందికతో జాగ్రత్తగా వ్యక్తపరుస్తాడు భావాన్ని.

ఈయన 'పెండ్లికూతురు'లో కట్టిన బొమ్మలు తెలుగువారి కన్నులకు సుపరిచితాలు. ఐనప్పటికీ ఈయన చెప్పిన విధానాన్ని బట్టి ఎక్కువ రుచివంతలయ్యాయి. శైలిలో చక్కదనం ఆయన ప్రత్యేకత.

రచనలో నాజూకుతనం, సున్నితత్వం ఆంజనేయులు గారి ప్రత్యేకత నిజమే అయినట్టే. వ్యక్తిగా నాజూకు మనిషి, సున్నిత మనస్తత్వం గలవాడు ఒక్కొక్కసారి అనిపిస్తుంది ఆంజనేయులు వంటి సున్నితహృదయులు జీవించివుంటే ఈనాటి మొరటుబారిన కుటిల భ్రష్ట రాజకీయ సంస్కృతిని చూచి ఎలా స్పందించేవారా అని ! నిజానికి ఈ దుర్దినాలను చూడకుండా వెళ్ళిపోయినవారు అదృష్టవంతులు.

## ప్రేమ — ఇచ్ఛాపురపు రామచంద్రం

ప్రేమ అనేది చిత్రమయిన పదం అందరికీ అతి యిష్టమయిన భావం. ఐతే దీనినర్థం చేసుకోగలవారు మాత్రం కొందరే ! తల్లీ పిల్లల మధ్య ఉండేది ప్రేమే. యువతీ యువకుల మధ్య ఉండేది ప్రేమే స్నేహితుల మధ్య ఉండేది ప్రేమే దైవానికీ భక్తులకీ మధ్య ఉండేది ప్రేమే. వాత్సల్యం.... అనురాగం.... స్నేహం.... భక్తి.... వీటన్నిటికీకూడా ప్రత్యామ్నాయంగా వాడబడుతున్న 'ప్రేమ' పదానికి చక్కని అర్థం సూచించినది జిడ్డు కృష్ణమూర్తిగారు. వారు చేసిన ఉపన్యాసాలలో రాసిన గ్రంథాలలో ప్రేమ గురించి వారు మహత్తరంగా విశదీకరించారు

ఒక పురుషుడికీ స్త్రీకి మధ్య ఉండే ప్రేమ సంపూర్ణం కాదు ఆ ప్రేమ పరిధి సంకుచితం దానిలో స్వార్థం ఉంటుంది. ఒక గృహ యజమాని తన భార్యాబిడ్డలకై పాటుపడుతూ ప్రదర్శించేదీ సంపూర్ణ ప్రేమ కాదు. ఎందుకంటే అదీ సంకుచితమే నిజమయినదీ సువిశాలమయినదీ ప్రేమ- సన్యాసం ! సన్యాసమంటే మనలో చాలామందిమి అనుకునేటట్లు భార్యాబిడ్డలనీ ప్రపంచాన్నీ దూరం చేసుకుని ఒంటరిగా ఉండడంకాదు. యావత్ ప్రపంచాన్ని తన గృహమే అని భావించుకుంటూ ప్రతి మనిషినీ తన వారిగానే భావిస్తూ- అందర్నీ మనస్ఫూర్తిగా ప్రేమించగలగడం ! వారికోసం తాపత్రయపడడం. ఇదీ సన్యాసం. ఇదీ ప్రేమ. సన్యాసమంటే- తన ప్రేమని ఒక వ్యక్తికో కుటుంబానికో పరిమితం చేయడంకాక ప్రపంచానికే వ్యాపింపజేసుకుంటూ హృదయాన్ని విశాలతరం గావించుకోవడం! ఎంత అద్భుతమయిన నిర్వచనమిది. విశ్వజనీనమయిన ప్రేమ కంటే విశుద్ధమయినదీ విశేషమయినదీ మరేముంటుంది.

ప్రేమ నచ్చిన ప్రేమ వచ్చును. ప్రేమలో అనిర్వచనీయమూ అద్భుతమూ ఐన ఆనందం లభిస్తుంది. అందుకే అన్నారు- 'ప్రేమించు ప్రేమకై' మనిషి మనిషిని ప్రేమించడం నేర్చుకోగలిగితే- ప్రపంచమే స్వర్గం కాగలదు

మనిషి-మనస్సు : 6

# 'మనసులు మారాలి'

-పోతూరి ప్రసన్నం

రోగం, బాధ, బంధం, దుఃఖం, మరణం అనే వన్నీ మనస్సు ద్వారా అనుభవించబడేవే !

ఆరోగ్యం, ఆనందం, స్వేచ్ఛ, సంతోషం, అమరత్వం అనేవన్నీ కూడా మనస్సు ద్వారా అనుభవించ బడేవే.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" మనస్సే బంధకారణం, మనస్సే మోక్షకారణం అంటారు దీనివల్ల తెలిసేదేమిటి ? మన బ్రతుకూ, మన స్థితీ, మన భవిష్యత్ గతీ అన్నీ మన మనస్సు పైన ఆధార పడినటువంటివే.

## MIND - CURE

ఇటువంటి ఒక అవగాహన పైన ఆధారపడినటు వంటిదే 'Mind-Cure' (మనస్సు ద్వారా చికిత్స) అనే ఉద్యమం విలియం జేమ్స్ వ్రాసిన 'Varieties of Religious Experiencies' అనే మహాగ్రంథంలో మనస్సు ద్వారా చికిత్స అనే అంశంపై ఎంతో విశ్లేషణ, వివరణ లభిస్తుంది.

అమెరికాలోనూ, యూరప్‌లోనూ Mind- Cure వంటి ఉద్యమం క్రొత్తది కావచ్చు, అనగా అంతకు పూర్వం ప్రచారంలో లేనిది కావచ్చు, లేదా సామాన్యు లకు కూడా అందుబాటులో లేనిది కావచ్చు. కానీ అది భారతీయ సంస్కృతికి క్రొత్తది ఏమాత్రమూ కాదు. దురదృష్టవశాత్తు ఈనాడు మనం పేరుకు మాత్రమే భారతీయులం. ఆచరణలో ఏమి తెలియనివారమే కాబట్టి ఈనాటి మన తరానికి ఒకరీతిగా Mind - Cure ఉద్యమం క్రొత్తదే అవుతుంది. ఇట్టి పరిస్థితులలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు చేసే దివ్యప్రబోధాల ద్వారా, వారి దివ్య కృపద్వారా ప్రతి సాయిభక్తుడూ అనుభవించే పరమాద్భుతమైన ఒక దివ్యమైన, నవ్య మైన, భవ్యమైన శక్తి అయింది ఈ Mind - Cure వెనుకగల ప్రేరణశక్తి.

కాబట్టి ఈ 'మైండ్-క్యూర్' వ్యాసాలలో అటు పాశ్చాత్య పండితుల ప్రాతిపదికలూ, వారి అనుభవాలూ, ఇటువైపు భారతీయ దృష్టిలో దానికిగల పరమోత్కృష్ట మైన ప్రయోజనం, ఈనాటి భగవాన్ బాబావారి ద్వారా భక్తుల నిత్యజీవితాల్లో దానికి సంబంధించిన అనుభవాలూ- అనే మూడు దృక్పథాలలో పరిశీలించటం జరుగుతుంది.

వాల్ట్ విట్ మన్ అనే మహాకవి ఈ 'మైండ్-క్యూర్' ఉద్యమ ప్రచారకులలో అగ్రగణ్యులు. ప్రఖ్యాత తత్త్వవేత్తలు, రచయితలు అయిన ఎమర్సన్, బెర్క్లీ వంటి వారి రచనలూ, హిందూధర్మంలోని వేదాంత తత్త్వం, ఇంకా క్రైస్తవ, యిస్లాం భక్తుల అతీంద్రి యానుభూతులూ, ఈ ఉద్యమానికి ఎంతో ప్రేరణ, వ్యాప్తి కలిగించే శక్తులయినై. ఇది పుస్తకాలు చదివి నంతమాత్రాన అలవడేది కాదనీ, మనిషి యొక్క మనస్సు దివ్యోత్తేజంతో ఉద్దీపితమయినప్పుడు కలిగే దివ్యానుభూతి అనీ, దీనిని ప్రతి వ్యక్తీ అలవరచుకో వచ్చుననీ ఉద్యమ ప్రచారకులు అన్నారు. ఇటువంటి మానసికమైన ఉత్తేజాన్ని పొందటంచేత మనకుగల సూక్ష్మ నాడీమండలానికి (Neurotic) చెందిన క్లేశ ములు, బాధలూ ఎన్నో నశించిపోతాయని నిరూపించ బడింది.

నేత్రదృష్టి పోయినవారికి మరల నేత్రదృష్టి కలగ టం, కాళ్ళు స్వాధీనంలో లేనివారు నడవగలగటం,

దీర్ఘవ్యాధులతో బాధపడేవారు ఆరోగ్యాన్ని పొందటం, ఒకవిధమైన నూతన జీవితంలో ప్రవేశించటంవంటి అమోఘమైన ఫలితాలు ఈ 'Mind-Cure' ఉద్యమం ద్వారా నిరూపించబడ్డాయి.

Gospel of relaxation
Don't worry movement
Natural religion
Faith cure

మొదలైన పేర్లతోకూడా ఈ Mind-Cure ఉద్యమాన్ని వ్యవహరించారు.

"మొదట్లో వైద్యనిపుణులుకూడా ఈ మైండ్-క్యూర్ ఫలితాలను నమ్మలేదు. కానీ తర్వాత నమ్మవలసి వచ్చింది. కళ్లారా ఈ సత్ఫలితాలను చూచిన తర్వాత ఎవరు కాదంటారు?", అన్నారు విలియంజేమ్స్. శారీరక, మానసికమైన రోగాలనుంచి మనిషిని బయట పడవేసి, ఆనందాన్ని, శక్తినీ కలిగించే లక్షణం కూడా మనస్సులోనే వున్నదనే సత్యాన్ని వైద్య నిపుణులు కూడా అంగీకరించారు.

## మనస్సు పనిచేసే తీరులోనే మార్పు రావాలి

" Practical applications of the general principles of the broadest mental science will tend to prevent disease. We do find sufficient evidence to convince us that the proper reform in mental attitude would relieve many a sufferer of ills that the ordinary physician cannot touch, would even delay the approach of death.

" Adherence to a truer philosophy of life will keep many a man well "; అని వ్రాసారు విలియంజేమ్స్.

విశాల దృష్టితో కూడిన మనోవిజ్ఞాన సూత్రాలను మనం అనుసరించగలిగితే, అది మనలో రోగ నిరోధక శక్తిని పెంచుతుంది. మనయొక్క మానసిక దృక్పధంలో సవ్యమైన మార్పును తీసుకురాగలిగినప్పుడు, డాక్టర్లు కూడా నయం చేయటానికి లొంగని వ్యాధులు నివారింపబడతాయి. అటువంటి మానసిక దృక్పధం రానున్న మరణాన్ని కూడా కొంతకాలం దూరానికి నెట్టి వేస్తుంది, అంటారు విలియం జేమ్స్ ! అందుకు అనేక మైన ఆధారాలు వారి వద్ద వున్నాయి.

ఈ సందర్భంలో మనం తీసుకురావలసిన మానసిక దృక్పధంలోని మార్పు ఒక విధంగా తాత్త్విక ప్రాధాన్యత కలిగినట్టిదే ! ప్రతి మనిషిలోనూ రెండు విధములైన ప్రకృతులు వున్నాయి. రెండు విధములైన ఆలోచనల పరిధులున్నాయి. ఒకటి చాలా బాహ్యమైనది, లోతులేని ఆలోచనలు, పైపై జీవితానికి చెందిన ఆలోచనలు కలిగినట్టివి. మరొకటి విశిష్టమైన ఆలోచనా పరిధికి చెందినది, లోతైన ఆలోచనలతో కూడినట్టిది. ప్రతి మనిషీ ఏదో ఒక పరిధిలో ఆలోచించుతూవుంటాడు స్థూలమైనవీ, శారీరక వాంఛలకే పరిమితమైనవీ, యింద్రియాలను తృప్తి పరచటం కొరకే కలిగేవీ, అహంకారంతో, సంకుచితత్త్వంతో, సంకోచాలతో, నిమ్నమైన స్థాయిలో వుండేవన్నీ క్రమంగా మనల్ని దుఃఖంలో రోగంలోనూ ముంచేవే ! ఉన్నతమైన ఆలోచనలు, దివ్యమైన ఉత్తేజంతో కూడిన ఆలోచనలు నిస్వార్థమైన వివరాల దృష్టితో కూడిన ఆలోచనలూ మనిషిని శారీరక, మానసికమైన రుగ్మతల నుంచి దూరంగా వుంచుతాయి ! అని వివరిస్తారు విలియంజేమ్స్.

## భారతీయ సంస్కృతి చెప్పేది యిదే

భారతీయ సంస్కృతి, జీవిత విధానాలు నిర్దేశించింది కూడా యిదే ! సత్వగుణ సంపన్నుడు సుఖపడతాడు. ప్రకాశిస్తాడు. ఉన్నతికి వెళ్తాడు. జ్ఞానవంతుడవుతాడు. రజోగుణవంతుడు రోగంతో దుఃఖిస్తాడు. ఉన్నచోటనే

వుంటాడు. తమోగుణవంతుడు అధోగతికి పోతాడు అంటుంది భగవద్గీత.

చరక మహర్షి కూడా తమ ఆరోగ్య సంహితలో యిదే వివరిస్తారు.

* ఈ దిగువ చెప్పిన వివరణలు చరక సంహితలోనివే.

1) నీ సుఖం ఇతరుల సుఖంతో కూడి వుంటుంది. ఇతరులకు దుఃఖం కలిగిస్తూ నీ ఒక్కడివే సుఖపడవలె ననుకోవటం భ్రాంతి. ఈనాడు ఇతరులను హింసించటం ద్వారా, కష్టపెట్టటం ద్వారా తాము సుఖపడగలమనే ధోరణి బాగా పెరిగిపోతుంది. మనిషికి పట్టిన పెద్ద రోగం యిదే !

2) కరుణ, సానుభూతి, ప్రేమ, సహనం, ఓర్పు వంటి గుణాలతో ఆరోగ్యం పెంపొందుతుంది. ఈనాడు వైరభావం పెచ్చుపెరిగిపోతోంది. 'న వైరం రోచయేత్' అంటారు మహర్షి. వైరభావంతో పాటు కసి, పగ, ద్వేషం, హింస, నిర్దయ వంటి దుర్గుణాలన్నీ మనల్ని అనారోగ్యంపాలు కావిస్తున్నాయి.

3) 'న అన్యత్ శ్రియం అభిలషేత్, న కుర్యాత్ పాపం' అంటారు మహర్షి ! ఇతరులధనాన్ని కోరటం, పాపచింతన చేయటం ద్వారా మనిషి ఆరోగ్యం చెడిపోతుం సదాచారం సత్ప్రవర్తన ఆయువును, కీర్తిని పోషిస్తుంది అలాగే దురాచారం ఆయువును క్షీణింపజేస్తుంది.

ఈ రీతిగా భారతీయ సంస్కృతిలో మన శారీరక మానసికమైన ఆరోగ్యాన్ని పరిరక్షించే సూత్రాలు అనేకం వున్నాయి. దైవోపాసన, సత్సంగ విద్యుక్త ధర్మ నిర్వహణ, ఆశ్రమ ధర్మ పోషణ వంటివన్నీ భారతీయ సంస్కృతిలో గల అమూల్యమైన లక్షణాలు. వాటి ద్వారా మనం ఆశించేది ఆరోగ్యవంతమైన వంద సంవత్సరాల యిహలోక జీవితాన్నే. 'జీవేమ శరదశ్శతం ...' అనేదే మహర్షుల ఆశీర్వచనం !

## సచ్చిదానంద సంధాయి సత్యసాయి

త్రుంచువారల క్లేశమ్ములే - నిజ
కేశపాశములుగా గేలుకొలిపి
అర్థుల యజ్ఞానమణగించు ఫలితమే
నుదురు చిన్నదిగాగ కుదరజేసి
దరిచేరువారి నాదరమున బ్రోచుటఁ
ఆకర్ణ పర్యంత మక్షులమరి
కాంచువారి కెపుడు పంచు మంచిదనమె
దరహాసచంద్రికోదయమునయ్యె
శాంతిసౌఖ్యమ్ము లిలలోన సంతరింప
సాధుకాషాయవస్త్రాల సాగికొను
సర్వశాస్త్ర సముద్రాల సారమయ్యె
సచ్చిదానంద సంధాయి సత్యసాయి,

- రాయప్రోలు సీతారామశర్మ

ప్రపంచంలో మంచీ-చెడూ, దైవ - అసురసంపద, అనేవి ఎప్పుడూ వుంటాయి. చెడుతోనూ, అసుర సంపత్తితోనూ మనం మన మనస్సులను నింపుకుంటే మనకు కలిగేది చెడు, దుఃఖమే. మంచితోనూ, దైవ సంపదతోనూ మన మనస్సులను నింపుకుంటే మనకు కలిగేది ఆరోగ్యం, శాంతి, ఆనందం.

" More and More people are recognising it to be bad form to speak of disagrea-

ble sensations, or to make much of the ordinary in conveniences and ailments of life ", అంటారు విలియంజేమ్స్.

మనకు అవిష్టమైన విషయాలనుగూర్చి, మన మనస్సు పట్టించుకోకూడదు. మనకు కలిగే అసౌకర్యాలను, బాధలను కొండంతలు చేసుకొని బ్రతకటం కూడా మనస్సుకు కలిగిన బలహీనతే ఆ బలహీనతే రోగాన్ని ఆకర్షిస్తుంది. శక్తివంతమైన మనస్సు రోగాన్ని దగ్గరకు రానీయదు.

## భగవాన్ బాబావారి ప్రేరణ

**" బాబా ! మీరు ఎంతోమంది దీర్ఘరోగులకు కూడా రోగాలను నయం చేస్తున్నారు'' అన్నారు** ఒకరు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారితో. డాక్టర్లకు సాధ్యంకాని రోగాలనూ, మృత్యువాతన పడవేసే రోగాలను కూడా భగవాన్ బాబావారు అసంఖ్యాకంగా నయం చేశారు. వారి దర్శన, స్పర్శన సంభాషణల్లోనే ఆ శక్తివున్నదని లోకానికి తెలుసు. కానీ బాబావారు యిలా అన్నారు : ''నేను వారి రోగాలను నయం చేయటంలేదు వారంతట వారే తమ రోగాలనుంచి బయటపడే శక్తిని వారికిస్తున్నాను '', అన్నారు బాబా. (See 'Loving God', by Sri N. Kasturi)

'మైండ్-క్యూర్'లో తెలుసుకోవలసిన ప్రధానమైన అంశం యిదే. పుస్తకాలను చదివినంతమాత్రాన ఈ 'మైండ్-క్యూర్' సంభవించదు. మనస్సు తాను వుంటున్న దుర్భరమైన అధోగతి స్థితినుంచి, ఎవరో చ్చి చేయి అందిచ్చి, పైకి లేవదీసిన రీతిగా, ఊర్ధ్వ స్థితికి చేరాలి మనంతట మనం మన ఆలోచనల తీరును మార్చుకోగల స్థితిలో ఈనాడు మనం బ్రతకటం లేదు. అలా మార్చుకోగలిగిన శక్తే మనలో వుంటే, మానసిక దుస్థితిలో ఎందుకు పడిపోయి, బాధలు పడుతున్నాం ? కాబట్టే ఈనాడు భగవాన్ బాబావారి దివ్య ప్రభావం ద్వారా మనలో అటువంటి మానసికశక్తి ప్రవేశిస్తోంది ఎన్నో లక్షలమంది బాబావారి సన్నిధిలో కానీ, బాబావారి పుస్తకాలు చదవటం ద్వారా, బాబావారి దివ్యమైన చిత్రం ముందు ప్రణమిల్లటం ద్వారా, బాబావారి విభూతిని ధరించటం ద్వారా కానీ ఎంతో మంచి ఆరోగ్యం, శాంతి, సంతోషం, అభ్యుదయాలను పొందుతున్నారు. ఇది బాబావారి అద్భుతలీల కావచ్చు కానీ ఈ అద్భుతలీల ద్వారా మనస్సులు పనిచేసే తీరులో పైన చెప్పిన మంచి మార్పులు కలుగుతున్నాయి. తద్వారా శాంతిసౌఖ్యాలు, ఆరోగ్యం ఆనందాలు కలుగుతున్నాయి అనటం నిర్వివాదకరమైన విషయం

ఒక ఉదాహరణ : శ్రీ హేవర్డ్ మర్ఫెట్ అనేవారు భగవాన్ బాబావారి భక్తులు, ప్రముఖ రచయిత. వారి రచనలు ఆంగ్లంలో వెలువడ్డాయి. వాటిని చదివిన వారు ఎందరో దేశ విదేశాల్లో భగవాన్ శ్రీ సత్యసాయి తత్త్వాన్ని గూర్చి సరియైన అవగాహన పొందుతున్నారు. అటువంటి శ్రీ హేవర్డ్ మర్ఫెట్‌గారు ఒక గ్రంథం బాబాగారిని గూర్చి రాశారు.

దానిని ఒక స్టెనోగ్రాఫర్‌గారికి డిక్టేషన్ ఇచ్చి ఆమె ద్వారా టైపు చేయించి పుస్తకం ప్రచురించే కార్యక్రమం చేపట్టారు. ఆ స్టెనోగ్రాఫర్ అమ్మగారికి కాన్సర్‌రోగం. డాక్టర్లు పరీక్షించి ఆపరేషన్ చేయవలెనని చెప్పారు. కానీ ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. ఆమె ఈ పవిత్రమైన పరిశ్రమలో నిమగ్నురాలై వుండగా ఆమె యొక్క కాన్సర్ రోగం మటుమాయమైపోయింది. ఈ ఆశ్చర్యకరమైన పరిణామాన్ని శ్రీ హేవర్డ్ మర్ఫెట్ బాబావారితో ప్రస్తావించారు.

'అవును, ఆమె ఇంతకుముందు ఒక విధమైన జీవితానికి అలవాటు పడింది. సొసైటీ, క్లబ్‌లు, విలాసాలు. కాన్సర్ రోగం వచ్చింది. కానీ ఆమె మనస్సు నీ పుస్తకాన్ని ప్రచురిస్తున్న కార్యక్రమ ప్రభావంచేత మారిపోయింది. ఆమె మనస్సు దివ్య

## దీపం

చుట్టూవున్న చీకటిని
చూపు కందనంత దూరానికి తరిమేసి
దేదీప్యమానంగా
దీపం వెలుగుతుంది!
దీపం ఆదర్శరూపం
అజ్ఞాన తమో శకలాలను తొలగించే
విజ్ఞాన కాంతిశిఖల శిఖరం!
మానవుని మనసు మబ్బు తెరలలో
విరిసిన సుందర ఇంద్రచాపం!
మనిషి దీపమై దీపిస్తే
మానవత విశ్వమై భాసిస్తుంది!!

- సి. కామేశ్వరరావు

పరిణామానికి లోనయింది. దాని చేతనే ఆమె కాన్సర్ రోగం కాస్తా మటుమాయమైపోయింది' అన్నారు భగవాన్ బాబా.

మనస్సులో సత్పరిణామం కలగటం రోగ నివారణకూ, చికిత్సకూ కూడా అవసరం అని చెప్పే Mind - cure సిద్ధాంత ప్రాతిపదికను ఈ అద్భుత సంఘటన నిరూపించుతోంది

అయితే ఈ సత్పరిణామం తాత్కాలికమైనదే. ఈ మానసికమైన మార్పు స్థిరమైనదే అయితే సత్ఫలితాలు కూడా స్థిరమైనవే అని తెలుసుకోవాలి. దానికి తగిన ఉదాహరణ కూడా లభించింది.

తర్వాత కొంత కాలానికి మరల కాన్సర్ రోగం వచ్చింది. శ్రీ హేవర్డ్ మార్ఫెట్ ఆశ్చర్యపడుతూ బాబావారిని అడిగారు. 'స్వామీ! నయం అయిపోయిన కాన్సర్ మరల ఆమెకు పట్టుకున్నదేమిటి?' అని అడిగారు.

'మరల ఆమె మనస్సు పాత అలవాట్లలో పడిపోయింది కదా!' అన్నారు బాబా. మరల ఆమె సొసైటీ జీవితం, సిగరెట్లు పీల్చటం, ప్రారంభించింది కనుకనే రోగం తిరగబెట్టింది.

మనస్సును ఒక దివ్య శక్తిగా గుర్తించి Positive Mental Attitude ను అలవరచుకొని బలహీనతలను, రోగాలనూ అంగీకరించని వ్యక్తులకే 'మైండ్ - క్యూర్' (మనస్సు ద్వారా చికిత్స) తప్పక సులభసాధ్యం అవుతోంది

'నేను పాపిని, నేను దురదృష్టవంతుణ్ణి, అభాగ్యుణ్ణి అనాథుణ్ణి' అంటూ కుమిలిపోవటం చేత మిగిలేది నిరాశ నిస్పృహ, అంధకారాలే.

'నేను దివ్యుణ్ణి, నేను మహా అదృష్టవంతుణ్ణి. మహా భాగ్యం నాదే. పరమాత్ముడు నాయందున్నాడు ....' అనేటువంటి నిత్య నిరంతర స్ఫురణ మనస్సును ఎంతో శక్తివంతం కావిస్తుంది. అటువంటి స్ఫురణ వుంటే సరిపోదు. మనం బ్రతికే నిత్యజీవిత విధానంలో కూడా అటువంటి పవిత్రత ప్రతిబింబించాలి.

పాశ్చాత్య లోకాన్ని ఈ రీతిగా ప్రభావపరచిన Mind - cure ఉద్యమంలో గల కొన్ని మౌలికమైన మానసిక దృక్పథాలను గూర్చి తెలుసుకుందాం ....

(ఇంకా వుంది)

# రవీంద్రుడు

-కవుల ఆంజనేయశర్మ

ఆది ఏప్రిల్ 13 వ తేది. పంజాబు రాష్ట్రంలోని జలియన్ వాలాబాగ్ ఒక ప్రాంతం. ప్రభుత్వం అక్కడి ప్రజలను నిర్దాక్షిణ్యంగా తుపాకులకు గురిచేసి, సైనిక శాసనం అమలుచేసింది. అత్యాచారం జరిగే చోటునుండి దేశంలోని ఇతర ప్రాంతాలకు వార్తలు అందకుండా నిషేధించింది. బ్రిటీషు ప్రభుత్వంవారి అవినీతి పెచ్చు పెరిగిపోయింది. ఈ పరిస్థితివల్ల దేశం అట్టుడికిపోయి, జాతీయభావాలతో ఉద్రిక్తమైపోయింది. సభలూ, సమావేశాలూ, భావ ప్రకటనా స్వాతంత్ర్యమూ అన్నింటిని ప్రభుత్వం నిషేధించింది. ప్రజాహృదయాలు అగ్నిగోళాలై అవమానంతో, ఆవేశంతో ఉడుకెత్తిపోయాయి.

భారత హృదయాలలోని దుఃఖాన్ని రవీంద్రుడు అర్థం చేసుకొన్నాడు. బ్రిటీషువారు చేసే చెడ్డపనులను నిర్భయంగా వ్యతిరేకించాలని, అందుకోసం కలకత్తాలో ఒక సమావేశాన్ని ఏర్పాటుచేయాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. శాసన భయంవల్ల ఆనాటి సమావేశానికి ప్రముఖ రాజకీయవేత్తలెవరు హాజరు కాలేదు. రవీంద్రుడు స్వయంగా అధ్యక్షత వహిస్తానని చెప్పినా, ఎవరూ కలిసిరాలేదు. అన్ని ప్రయత్నాలు విఫలమైనాయి. అత్యాచారానికి గురైన భారతీయుల ప్రతినిధిగా, వేలాది భారతీయుల హృదయాలలోని ఆవేదనను తన భావాలతో నింపి, ఆనాటి రాజప్రతినిధియైన ఛెమ్సుఫర్డు ప్రభువుకు ఒక లేఖ వ్రాశాడు.

బ్రిటీషు ప్రభుత్వం తనకు ఇచ్చిన 'సర్' బిరుదును కూడా తిరస్కరించి. సాటి భారతీయులకు జరిగిన అన్యాయాన్ని తీవ్రంగా నిరసించాడు ఛెమ్సుఫర్డుకు వ్రాసిన లేఖ రవీంద్రుని హృదయంలోంచి వచ్చిన అగ్నిధార. అక్రమాలను, అన్యాయాలను సహించలేని రవీంద్రుని హృదయవేదన ఆ లేఖలోని ప్రతి అక్షరంలోను కన్పించింది. ఈ స్థితిలో దేశానికి నేను చేయవలసిన కనీసమైన సేవ ఇది. రానున్న ఫలితాలను ఎదుర్కోడానికి పూర్తిగా సంసిద్ధుడను వేలాది ప్రజల హృదయాలలో భయంవల్ల అణగారిన వేదనను, తీవ్ర నిరసనను నాద్వారా అందిస్తున్నాను. ఈ పరిస్థితిలో మీరిచ్చిన గౌరవాలను స్వీకరించలేను. ప్రత్యేక గౌరవ చిహ్నాలన్నీ విడిచిపెట్టి, నా దేశీయుల సరసన నిలబడతాను. మానవమాత్రులెవరు సహించి ఎరుగని అవమానాలకు గురి అవుతున్న ప్రజల దుఃఖాన్ని నేను పంచుకుంటాను" అంటూ సింహగర్జన చేసిన రవీంద్రుడు భారత జాతికి ప్రవక్త అనే విషయం స్పష్టమవుతోంది.

---

## చేరరండమ్మ సాయిని చెల్లెలార !- ఎస్. బి. శ్రీధర్

చీకు చింతలతోడ చింతించు సోదరా !
సాయి శరణయటంచు సాగవేమి ?
సత్య ధర్మము ప్రేమ శాంతుల కాంక్షించు
సోదరీ ! సాయీశు చేరవేమి ?
సర్వమతముల పట్ల సద్భావ ప్రాప్తికై
సఖుడ ! సాయిని చేరసాగవేమి ?

మానవాకృతి తోడ మహినెల్ల రక్షింప
నవతరించిన సాయి నరయ రేమి ?
వెన్న పోలిన మనసున్న అన్నలార !
కుమ్మరించెడి ప్రేమతో తమ్ములార !
ఖ్యాతి బడసిన ఓ దివ్య మాతలార !
చేరరండమ్మ సాయి చెల్లెలార !

# సుప్రీం డాక్టర్ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

- మాదిరాజు రామచంద్రరావు

అది 1989 వ సంవత్సరం, డిసెంబరు నెల. ఖమ్మం పట్టణంలో ప్రభుత్వ వ్యవసాయశాఖ (Agri-cultural Dept ) లో ఉద్యోగిగా వున్న సాయిభక్తులు శ్రీ టి రామచంద్రరాజుగారు, వారి భార్య శ్రీమతి రాజేశ్వరిగారితో కలిసి లూనా (Luna) పై ఒక వివాహానికి వెళ్తుండగా ఎక్సిడెంట్ అయింది. ఆమె తలకు బలమైన దెబ్బతగిలింది, స్పృహ కోల్పోయింది- కొంత సేపటికి స్పృహ వచ్చింది గాని నెప్పి ఎక్కువగా వుంది ఖమ్మంలో నేవున్న మరో సాయిభక్తులైన డా॥ పి. రంగయ్య M S ఈమెను పరీక్షించి వైద్యం ఆరంభించారు ఆ డాక్టరుగారి సలహా మేరకు గుంటూరు వైద్య కళాశాలలో పనిచేస్తున్న ప్రొఫెసర్ ని గోపాల రావు, ఎమ్ డి, న్యూరాలజీ ప్రొఫెసరుగార్ని సంప్రదించారు ప్రొఫెసరుగారి సూచనల మేరకు ఖమ్మం లోని డా॥ రంగయ్యగారు వైద్యం కొనసాగిస్తున్నారు. కాని గుణం కన్పించలేదు నొప్పి తగ్గుతూ, పెరుగుతూ వుంది. తల బాధకు తోడు క్రమంగా మానసికరుగ్మత ఆరంభమైంది. అతిగా, అనవసరంగా నవ్వటం, అసందర్భంగా మాట్లాడటం చేయసాగారు తలకు తగిలిన బలమైన దెబ్బ కారణంగా ఈ పరిణామం సంభవించినట్లు వైద్యులు భావించారు. ఔషధసేవనం వల్ల శిరోవేదన కొద్దిగా ఉపశమించింది.

కాని సెప్టెంబరు 1990 నుంచి తిరిగి తల బాధ తీవ్రమైంది మానసిక కలవరం అధికమైంది ఎదుటి వారిని సరిగా గుర్తించలేక పోయేది. భోజనం చేయాలనే ధ్యాస వుండేది కాదు బలవంతంగా తినిపించవలసి వచ్చేది అర్థరాత్రి కూడా తలుపులు తీసుకొని రోడ్డుకు వెళ్లేవారు. ఎందుకు వెళ్తున్నావని ప్రశ్నిస్తే సమాధానం వుండేదిగాదు. భర్త ఆఫీసుకు వెళ్ళేటపుడు ఆమెను ఒక గదిలో వుంచి తాళం వేసుకొని వెళ్ళవలసిన స్థితి వచ్చింది. దెబ్బ తగిలిన తర్వాత స్వామి భక్తురాల ననే భావన కూడ ఆమెకు లేకుండాపోయింది. స్వామి విభూతి వాడమంటే వాడేదికాదు. ఎందుకో ఆమె తన తలను Motor Mechanic మాత్రమే బాగుచేయ గలడని ఆ స్థితిలో ఆమెకు విశ్వాసం. 'మీ లూనా చెడిపోతే మెకానిక్‌తో వెంటనే బాగుచేయిస్తారుగదా ! నా తల చెడిపోతే మెకానిక్‌ను పిలువరేమిటి ? ఈ రోజైనా మెకానిక్ దగ్గరకు వెళ్ళండి' అంటూ భర్తను అడుగుతుండేవారు. పైకి అల్లాగే అంటూ లోలోన ఈమె స్థితికి రాజుగారు వ్యధ చెందసాగారు. క్రమంగా ఆమె ఆరోగ్య స్థితి దిగజారసాగింది. భోజనం తినిపించటం కష్టం అయ్యే భర్తను గుర్తించలేని స్థితి. 1990 నవంబరు 23 వ తేదీన గుంటూరు వైద్య నిపుణుల సలహా కొరకు మరోసారి వెళ్ళారు సాయి భక్తులు, రాజుగారి కుటుంబానికి సన్నిహిత మిత్రులు. ప్రసాద రావు లెక్చరర్ (Lecturer) గారింట్లో బసచేశారు. 27 వ తేదీన డాక్టరుగారిని కలిశారు. Brain Scan చేయించాలనీ, అది జరగనిదే అసలు సమస్య ఏమిటో అర్థంగాకుండా వుందనీ, Scaning report చూసి న్యూరాలాజికల్ సమస్యా, సైకలాజికల్ సమస్యా నివారణకు లొంగదే స్థితిలో వుందా, ఆపరేషన్ అవసరమా వంటి కీలక అంశాలు నిర్ణయిస్తామని డాక్టరు అన్నారు. ఒక సంవత్సర కాలంగా ఆ డాక్టరే వైద్యం చేస్తున్నా ఆయన Scaning సిఫారసు చేయలేదు. రాజుగారు Suggest చేసినా అవసరం లేదని తిరస్కరించారు, సమస్య జటిలంగావటం వల్ల ఆయనే Scanning advice చేశారు Lab technicianతో మాట్లాడి 28వ

తేదీ ఉదయం Scan చేయించటానికి నిర్ణయించారు. సహజంగానే రాజుగారు ఆందోళన చెందసాగారు. Scan report ఎట్లాఉంటుందో!డాక్టరుగారు ఏమంటారో! అసలు నివారణ సాధ్యమౌతుందో కాదో అనుకుంటూ వేదన చెందుతున్నారు. మిత్రులు ప్రసాద్‌గారింట్లోనే ఆ రాత్రి విశ్రమించారు. స్వామి పుట్టినరోజు పండుగ ఉత్సవాల సందర్భంగా ప్రసాద్‌గారు సేవాకార్యక్రమాలలో నిమగ్నమై పుట్టపర్తిలోనే వున్నారు. ఆ రాత్రి ప్రసాద్‌గారి శ్రీమతి భోజనం వడ్డించినా రాజేశ్వరి (పేషెంటు) భోజనం చేసే స్థితిలో లేరు .... అట్లాగే పడుకున్నారు.

సరిగా రాత్రి 12-00 గంటలకు రాజేశ్వరిగార్కి-నిద్ర-మెలకువగాని స్థితిలో ప్రేమమూర్తి భగవాన్ బాబా దర్శనం అనుగ్రహించారు. అప్పటివరకు ఎవరినీ గుర్తించలేని ఆమె స్వామిని గుర్తించగలిగింది. మనోహరమైన అనేక అపురూప దృశ్యాలను స్వామి ఆమెకు సాక్షాత్కరింపజేశారు. అంతటా ప్రజ్వరిల్లుతున్న అగ్ని మధ్యలో శోభాయమానంగా, చిరునవ్వు చిందిస్తూ బాబా- ఆ తర్వాత తన చుట్టూ తాను పరిభ్రమించే భూగోళం- భూగోళ శిఖరాన బాబా దర్శనం- అనంతమైన ఆకాశం- మధ్యలో సర్వవ్యాప్తియైన బాబా- తెరలు తెరలుగా వీస్తున్న మలయమారుతం, మలయ పవనాల్లో తేలియాడుతూ బాబా, ఆ పిమ్మట అనంత జలరాశి, ఎగిసిపడే కెరటాలు, కెరటాల ఊయలపై భగవాన్ బాబా- బహుశా పంచభూతాలూ తానేనని, లేక అవి తన అధీనంలోనే వుంటాయనీ, సాధ్యాసాధ్యాలు ఆయనకు వుండవని రాజేశ్వరికీ, ఆమె ద్వారా మానవాళికి తెలియజెప్పడమేమో!

తరువాత ఒక యినుప మేకులాంటి వస్తువు స్వామి చేతిలో ఆమెకు కన్పించింది. ఆ మేకుతో ఆమె శిరస్సును స్వామి రెండుగా విభజించారు. మెదడులోని రక్తనాళాలను తలనుంచి బయటకు తీశారు. తన శరీరానికి సంబంధించి జరుగుతున్న ఈ విషయాలనన్నింటినీ బయటనుంచి మరొక వ్యక్తి చూడగల్గినట్లుగా ఆమె చూస్తున్నది. రక్తనాళాలను ఆమె చూస్తుండగానే సరి చేశారు. తిరిగి తల లోపల బ్రెయిను, నాళాలు అమర్చారు. స్వామి చేతులు రక్తంతో తడిసివున్నాయి. గది అంతా ఆమెకు క్లోరోఫామ్ వాసన వస్తున్నది. "నీ తలకు ఎందుకు దెబ్బతగిలిందో తెలుసా? పూర్వ జన్మతో నీవు ఇనుపకడ్డీతో ఒక వ్యక్తి తలపై బలంగా కొట్టావు. అతను చాలాకాలం బాధపడ్డాడు. దాని ఫలితమే నీకు ఈ దుస్థితి. స్వామి కృపవల్ల నేటితో నీకు ఆ బాధ నివారణ అయ్యింది. రేపు ఉదయం విభూతి పంపుతాను, అది తీసుకొని నీ తృప్తి కొరకు డాక్టరును సంప్రదించి యింటికి వెళ్ళండి" అని చెప్పి స్వామి అదృశ్యమైనారు. రాజేశ్వరిగారికి పూర్తిగా మెలకువ వచ్చింది మెలుకువగాదు పూర్తిగా స్పృహ వచ్చింది. తాను ఎవరి యింట్లో వున్నదీ మొదటిసారిగా ఆమెకు తెలిసింది. ప్రక్కన మంచంపై పడుకున్న భర్తను గుర్తించి ఆయన్ను నిద్రలేపింది. ఆమెకు చాలా కాలం తర్వాత ఆకలి బాధ తెల్సింది. భోజనం తినాలని వున్నదని భర్తను కోరింది. ప్రసాద్‌గారి భార్యకూడ లేచారు. జరిగిన విషయం సవివరంగా రాజేశ్వరిగారు అందరికీ వివరించింది, అందరినీ ఆమె గుర్తించగలుగుతున్నది. సందర్భోచితంగా మామూలు మనిషివలె ఆమె మాట్లాడుతున్నది. స్వామి తమను కరుణించారని అందరూ ఎంతో ఆనందించారు. కరుణామయుడైన భగవాన్‌కు మనసారా కృతజ్ఞతలు తెలుపుకున్నారు. మరునాడు ఉదయం ప్రసాద్‌గారి మిత్రుడు, సాయి భక్తుడు అయిన ఒకాయన గత సాయంత్రమే తాను

స్త్రీనుంచి వచ్చానని రెండు విభూతిపొట్లాలు ప్రసాదంగా ఇచ్చారు. అన్నమాట ప్రకారంగా స్వామి విభూతి పంపించారని అందరూ సంతోషించారు. ఇక Scaning చేయించటమా వద్దా? డాక్టరుకు చూపటమా వద్దా? అనే సమస్య వచ్చింది. రాజేశ్వరిగారు ససేమిరా డాక్టరు దగ్గరకు రానన్నారు. నా ఆరోగ్యం పూర్తిగా స్వామి బాగుచేశారు. ఇపుడు అనారోగ్య లక్షణమూలేదు. తల నెప్పిలేదు. ఇంటికి వెళ్దాం అన్నారు ఆమె అభీష్టం మేరకు డాక్టరును కలవకుండానే, Scan చేయించకుండానే ఖమ్మం తిరిగివచ్చారు. 4, 5 రోజుల వరకు ఆమెకు Post-operative symptoms కన్పించాయి. కడుపులో దేవుతున్నట్లుగా వుండటం, వాంతి అయ్యేలావుండటం, స్వల్పంగా టెంపరేచర్, నీరసంగా వుండటం, చేతులు కాళ్ళు గుంజటంవంటి లక్షణాలు వున్నాయి. క్రమంగా అవికూడ తగ్గిపోయాయి. వారం, పదిరోజుల అనంతరం తిరిగి స్వామి స్వప్నంలో సాక్షాత్కరించారు. 'నీ మెకానిక్ డాక్టరు వైద్యం ఎట్లా వుంది?' అంటూ చిరునవ్వుతో పలుకరించి అదృశ్యమైనారు. ఆనాటినుండి ఆమె క్రమంగా ఆరోగ్యవంతురాలైంది.

కొద్ది కాలంలో రాజేశ్వరిగార్కి మరొక విషమ సమస్య ఎదురైంది. ఆమె తండ్రిగారు జనార్ధనరాజుగారు ఆకస్మికంగా మరణించారు. తండ్రి పట్ల ఆమెకు ఎనలేని మమతానురాగాలు. ఆయన మరణవార్త విని ఇపుడిపుడే ఆరోగ్యం పొందుతున్న ఆమె తిరిగి మానసిక వత్తిడికి గురి అవుతారని, పరిణామములు ఎట్లా వుంటాయోననే భయంతో కుటుంబ సభ్యులు వెంటనే ఆమెకు ఆ దుర్వార్త తెలియనివ్వలేదు. కాని ఎంతకాలం దాచగలరు? మెల్లగా ఆ విషయం ఆమెకు తెలియజేశారు కుటుంబ సభ్యులు, బంధువులు భయపడినట్లుగానే ఆమె ఆ వార్త విని మానసికంగా క్రుంగిపోయింది. ఈ షాక్ నుంచి ఆమెను త్వరలో కోలుకొనేలా అనుగ్రహించమని తిరిగి స్వామిని కుటుంబ సభ్యులు ప్రార్థించసాగారు. ప్రేమమూర్తి అయిన బాబా వీరి ప్రార్థనను మన్నించారు. ఆమెకు తిరిగి మరొక వినూత్న స్వప్నదృశ్యం అనుగ్రహించారు. ఆమె ప్రశాంతినిలయ ఆవరణలో వున్నారు. స్వామి నవ్వుతూ భజన హాలు దగ్గర నుంచున్నారు. భజన హాలులో ఈమె నాన్నగారు కుర్చీలో ఆసీనులైనారు. ఈమె భజన మందిరం లోకి వెళ్ళింది. నాన్నగార్ని చూసి ఉప్పొంగిన ప్రేమాభిమానాలతో "నాన్నా!" అంటూ ఆయన వద్దకు వెళ్ళింది. కాని ఆయన మరొక వైపుకు వెళ్ళి తల త్రిప్పుకుంటున్నారు. ఆయన తల త్రిప్పుకున్న వైపుకువెళ్ళి మరలా నాన్నా! అంటూపలుకరించగా ఆయన తల ఇంకోవైపు త్రిప్పుకొని ఈమెను గమనించనట్లే, ఈమె అక్కడ లేనట్లే, శూన్యంలోకి చూస్తూ ఉన్నారు. ఆమె నివ్వెరపోయింది. ఏమైంది నాన్నకు? నేను అంతగా ప్రేమించేనాన్న, నన్ను పట్టించుకోవటంలేదు. పిలిచినా కంట నీరు పెట్టినా ఏమీ జరగనట్లే తామిద్దరకు ఏ బాంధవ్యం లేనట్లే, పరాయివాడిలా, అపరిచితుడులా తల త్రిప్పుకున్నారు. ఏమిటి కారణం? ఈ రక్త సంబంధమైన బంధుత్వాలు ఎంతవరకు శాశ్వతం? మమతానురాగాలు ఎంతవరకు నిశ్చలం? నిజానికి ఎవరికి ఎవరు బంధువులు? అనే మీమాంస ఆమెలో జనించింది. వైరాగ్యభావం పొడసూపింది. కొద్ది క్షణాల్లోనే జ్ఞానోదయం అయ్యింది నాన్నగార్ని తిరిగి పలుకరించే ప్రయత్నం చేయకుండానే సంతృప్తిగా భజన మందిరం నుండి బయటకు వచ్చింది కలచెదరి మెలకువ. స్వప్న దృశ్యాన్ని మరోసారి పునశ్చరణ చేసుకున్నది. ఆ క్షణం నుంచి ఆమెకు తండ్రిగారిని గురించిన వ్యథ మాయం అయ్యింది అంతా మరచిపోయి క్రమంగా మామూలు మనిషి అయింది.

రాజుగారి కుటుంబానికి సంబంధించి స్వామి అనుగ్రహించిన మరో లీలావైభవం, వీరి కుమారుడు సాయికి వయస్సు 12 సంవత్సరాలు. జ్వరం, పొత్తి కడుపులో నెప్పి ఆరంభమైనాయి. ఎన్ని మందులు వాడినా అవి తగ్గటం లేదు. మూత్రపిండాలకు సంబంధించిన సమస్యగా గుర్తించి ఖమ్మంలో వైద్యులు Treatment యిస్తున్నారు. కాని సుగుణం కన్పించలేదు 3, 4 నెలలు ఇట్లా ఖమ్మంలోనే వైద్యం జరిగింది పిల్లవాడు బాధ తట్టుకోలేకుండా వున్నాడు క్రమంగా నీరసిస్తున్నాడు. ఖమ్మండాక్టర్లసలహామేరకు గుంటూరు మెడికల్ కాలేజీలో పనిచేస్తున్న యూరాలజీ విభాగ అధినేత డా॥ చారిగారిని సంప్రదించారు ఖమ్మంలో తీసిన ఎక్స్‌రే, చేసిన బ్లడ్‌టెస్ట్, రిపోర్టు వాడిన మందుల వివరాలు ఆయనకు చూపించారు. కాని ఆయన తిరిగి గుంటూరులో అనేక పరీక్షలు జరిపించారు ఎక్స్‌రే తీయించారు. రిపోర్ట్సు వచ్చాయి కాని వాటిలో మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధి లక్షణాలు లేవు. కాని పేషెంటు పడుతున్న బాధ, చెబుతున్న లక్షణాలు ఖమ్మంలో వాడిన మందులూ అన్నీ Kidney Prob'em కు సంబంధించినవే. వాస్తవాలకు reports కు పొంతన లేకుండా వుంది. ఏమి మందులు వ్రాయాలో డాక్టరుగారికి పాలుపోలేదు. కనుక ఆయన మందులు వ్రాయ నిరాకరించారు ఇప్పటికే చాలా Powerful మందులు వాడారు. ఇంకా మందులు వాడితే శరీరానికి మంచికంటే చెడు జరిగే అవకాశం ఎక్కువ. ప్రస్తుతానికి యింటికి తీసుకొని వెళ్ళి, అన్ని మందులు ఆపివేసి పిల్లవాడిని విశ్రాంతిగా వుండనివ్వండి బాధ అట్లాగే కొనసాగితే 2 వారాల తర్వాత రండి. మరలా పరీక్షలు జరిపిద్దాం అన్నారు

తండ్రిగారైన రాజుగారికి ఏమి చేయాలో పాలుపోవటంలేదు. పిల్లవాడి బాధ చూసేట్లుగాలేదు. డాక్టరు వైద్యం వద్దంటున్నారు. కిం కర్తవ్యం ? ఏమి చేయటం ? ఆయనకు మనసులో ఆశాకిరణంగా ఒక ఆలోచన వచ్చింది ? ఇక ఈ డాక్టర్లను నమ్ముకొని లాభంలేదు. అసలు ఇది ఏ వ్యాధో వారికి అంతుబట్టటం లేదు. డాక్టర్లకు డాక్టరైన సుప్రీం డాక్టర్ భగవాన్ బాబా దగ్గరకు వెళ్దాం. పూర్తి బాధ్యత ఆయనకే వదలి వేద్దాం నీట ముంచినా పాలముంచినా ఆయనే చేయాలి అనె స్థిర నిర్ణయానికి వచ్చారు. మరునాడు ఉదయం ఖమ్మం వెళ్ళి పర్తి ప్రయాణానికి ఏర్పాట్లు చేసుకుందామనుకున్నారు ఆ రాత్రి ఖమ్మంలో వున్న పిల్లవాడి తల్లి రాజేశ్వరిగారికి స్వామి స్వప్న దర్శనం యిచ్చారు. స్వప్నంలో ఈ పిల్లవాడిని స్వామి పరీక్షించి, పొట్టమీద బలంగా నొక్కగా కొన్ని చిన్న చిన్న రాళ్ళు స్వామి చేతిలోకి వచ్చాయి ఆ రాళ్ళను ఆమె చేతిలో వుంచుతూ 'పిల్లవాడి కడుపులో ఇన్ని రాళ్ళు వుంటే బాధపడడూ ?' అన్నారు. ఉదయాన్నే గుంటూరునుంచి రాజుగారు, పిల్లవాడు ఖమ్మంనుంచి వచ్చారు. ఆమె స్వప్నవృత్తాంతం విని స్వామి అనుగ్రహించారని అంతా సంతోషించారు. నిజ గానే ఆనాటి నుండి పిల్లవాడికి జ్వరం, కడుపులో నొప్పి పూర్తిగా తగ్గిపోయి సంపూర్ణ ఆరోగ్యవంతుడైనాడు ఈ కుటుంబం వారిని అనుగ్రహించినట్లుగానే స్వామి అనేకమంది భక్తులకు సంకల్పమాత్రంచేత దీర్ఘ, మొండి, ప్రమాదకర వ్యాధుల నివారణ చేస్తున్నారు. రాజుగారు అన్నట్లు డాక్టర్లకు డాక్టర్, సుప్రీం డాక్టర్ భగవాన్ బాబా. ◯

" కోవా దరిద్రో హి విశాల తృష్ణః శ్రీమాంశ్చ కో యస్య సమస్త దోషః "

' ఈ ప్రపంచమున దరిద్రుడెవడు ? మిక్కుటమగు ఆశ కలవాడే. ఈ ప్రపంచమున శ్రీమంతుడెవడు ? పరమ సంతుషి కలవాడే. అనగా సంతుష్టి కలవాడే ధనవంతుడు, అసంతుష్టి కలవాడే దరిద్రుడు - శంకరాచార్య

# సుందరకాండ సొగసులు-8

డా॥ రాపర్ల జనార్దనరావు

క్రౌంచ మిధున పక్షుల విరహవేదనతో ద్రవించిన హృదయమున ఉద్భవించిన వాల్మీకిమహర్షి మధురం మధురాక్షరమైన 'రామకధానాదం' లోకానికి అందజేసినాడు. వాల్మీకి, కోకిలవలె కవితాశాఖల నుండి కూయసాగినాడు రామచరితామృత సాగరాన్ని, అమృత బిందువులవలె త్రాగమనినాడు. క్రౌంచ పక్షుల విరహ వేదనను సుందరకాండలోని సీతావిరహవేదనలో జొప్పించినాడు. విరహవేదనవలన కలిగిన పరితాపాన్ని పరితాపోపశమనాన్ని కల్గించుటకు లోకానందము సీతారాముల హృదయశాంతికి మహా భక్తుడగు పారిజాత తరుమూలమున, కృతమస్తకాంజలితోడ, రఘునాధుని కీర్తన వినినప్పుడెల్ల పులకితాంగుడైన, భాష్పవారి పరిపూర్ణలోచనుడగు అంజనానందనుడైన అంజనేయుని, రామాయణగాధలోని ప్రముఖ వ్యక్తిగ ప్రవేశింప జేసినాడు.

సముద్రములను లంఘింపచేయువానిని శ్రీరాముని దూతయగు వానిని, వాతాత్మజుని, మహావేగుని, లంకా భయంకరునిగ సృష్టింపజేసి, ప్రాణత్యాగము చేయబూనిన సీతాదేవికి తన రామ సందేశము వలన పరితాపోపశమనం చేయుట సుందరకాండలోని ప్రధాన విషయం శ్రీరాముని ముద్రికనిచ్చి, సీతాదేవి చూడామణిని తీసికొనివెళ్ళుటలోని ఒక జీవిత రహస్యమును ప్రాచేతసుడు సుందరకాండ ద్వారా మన కందించినాడు

ఆధ్యాత్మిక దృష్టితోడ పరిశీలించిన సీతాదేవి ప్రకృతి శ్రీరామచంద్రుడు పురుషుడు. ఎడబాసిన ప్రకృతి పురుషుల కలయిక, ఇచటగల ఇతివృత్తము. అటులనే పరమాత్మ శ్రీ రామచంద్రుడు, జీవాత్మ సీతాదేవి జీవాత్మ పరమాత్మల అనుసంధానమే సుందరకాండ లక్ష్యము. పరితాపోశమనం కలుగజేసి లోకానందమునకు త్రోవలు తీయించిన సుందరకాండ యందు ('వాల్మీకేర్మని సింహస్య') మహాతపస్వివన్నుడైన మునిసింహమగు వాల్మీకి రామాయణ కావ్యమందు ముఖ్యముగా సుందరకాండయందు అనేక బీజాక్షర యుక్తములగు శ్లోకముల ద్వారా, సుందరకాండ పారాయణవలన వ్యక్తులకు లోకమున కలిగెడు ఆటంకములన్నియు ఆంజనేయుడు సముద్రమును లంఘించినటుల అతిక్రమింపగలరు అనెడి సందేశమును అందచేసినాడు. మానవుల జీవితములు దీని పారాయణవలన సుగమములు కాగలవు

## సుందరకాండ పారాయణము

'కూజంతం రామరామేతి' అనెడి స్తుతి శ్లోకముతోడి ఆదికవి వాల్మీకిమహర్షిని స్తుతించిన పిదప 'గోష్పదీకృత వారాశిం' 'అంజనానందనం వీరం' మొదలగువాని ద్వారా ఆంజనేయుని స్తుతించుట, పిదప అవకాశమును బట్టి ఒకటి రెండు పేజీలు, లేదా ఒక సర్గగాని పఠించట అర్థము గ్రహించుట ముఖ్యము.

రామాయణమందలి శ్లోకములకు 'ఏకైకమక్షరం ప్రోక్తం, మహాపాతకనాశనం' ఒక్కొక్క అక్షరమును ఉచ్ఛరించినను మహాపాతకములు నశించగలవని తెలుపబడినది

## ప్రధాన శ్లోకములు

వాల్మీకిమహర్షి బీజాక్షరములుగల కొలది శ్లోకములు ఆ సందర్భమును బట్టి ఎంతయు ప్రాధాన్యత కలిగిన వానిని, మన జీవితములందు కలిగెడి బాధలు, భీతి

సంశయములందు పఠించిన, సత్ఫలితములు కలుగ జేసెడివానిని మనకు అందించియున్నాడు.

1) నమోస్తు రామాయ సలక్ష్మణాయ ।
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో ।
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః
సుందరకాండ 13-59,60

సీతాదేవిని వెదకి వెదకి నిరుత్సాహపడి, చివరకు ప్రాణత్యాగము చేసికొనుటకు సంకల్పించిన ఆంజనేయుడు అశోకవనమును చూచి ఇచట సీతాదేవి తప్పక ఉండి తీరవలయునని ఉత్సహించి, మరల సీతాన్వేషణమును 'లక్ష్మణునితో గూడిన రామునికి నమస్కారము జనకాత్మజ యగు సీతాదేవికి నమస్కారము. రుద్రునకు, ఇంద్రునకు, యమునకు, వాయుదేవునకు నమస్కారము' అనెడు స్తోత్రమును పఠించి తన దూతకార్యమును సిద్ధింపచేసికొనగల్గెను. కావున ఈ శ్లోకము పఠించిన వారికి బాధలు సంశయములు తొలగి జీవిత నిరాటంకముగ కొనసాగునని ప్రతీతి.

2) జయత్యతి బలోరామో ।
లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతు సుగ్రీవో ।
రాఘవేణాభి పాలితః (సుం.కాం. 42-33)

అశోకవన ధ్వంసము గావించిన హనుమంతుడు రావణాసురుని సైన్యముతోడి తలపడినపుడు తొలి సారిగా ఈ దివ్య తారకమంత్రమైన శ్లోకమును పఠించును. రామ లక్ష్మణ సుగ్రీవులను స్తుతించి ఈ శ్లోకము పఠించిన విజయము తప్పక కల్గునని

సుందరకాండ పారాయణము ఐహికాముష్మిక ప్రదము.

# నీరాజనం

హిమము సుమముల రీతి వర్షించు వేళ
యినుడు గగనము నందు జన్మించు వేళ
శివుని తనువును వీడి సాగినది కాంతి
ధరణి జన్మించె శ్రీ నరేంద్ర చక్రవర్తి !

దివ్య పరిమళ పవనము వీచుటకును
పువ్వు తానయి రామకృష్ణుండు నిలచె;
సర్వ మానవకోటి క్షేమంబు కోరు
భక్త కాముకు లమరె భృంగముల వలెను !

సింహగర్జన విన్నట్టి నిఖిల జగతి
నిద్ర మేల్కాంచి కాంచె నీ దివ్యమూర్తి;
కాంచనాంబరధారి, గాంధర్వ గాన
ధీర సంవిద్వివేక సందేశ వేష !

భయము లేకుంట, నాత్మ విశ్వాసముంట
గమ్యసాధన చేకూరునంత దనుక
విశ్రమించక దీక్షతో నిలచి పోరు
మన్న మన సామి పలుకులు మంత్రరాశి !

స్వామి యొసగిన ధైర్యంబు మనసు నిల్పి,
సామి సందేశ పాలన సల్పి మనము
విశ్వ తారాపథ మున దేశకీర్తి
దివ్యకాంతుల శోభించనీయ వలయు !

- శ్రీ సంతోష్

# ఓ కౌన్ థి?

భండారు పర్వతాలరావు

అల్జీరియాలోని తువారెగ్ తెగవారు తాము రాజ వంశీకులమని చెప్పుకుంటారు. తిన్‌హినాన్ అనే పేరు గల మహారాణి వారసులమని ఒక కథ వారిలో తర తరాలుగా ప్రచారంలో వుంది. అంతేకాదు, ఆ రాణీగారి సమాధి అబలెస్సా అనే పల్లెలో వుందని తమకు తమ తాత తండ్రులు చెప్పారని కూడ వాళ్లు అంటూవుంటారు. ఈ కథను చాలామంది ఈ చెవితో విని ఆ చెవితో వది లేసినా ఫ్రెంచి పురాతత్త్వ శాస్త్రజ్ఞుల బృందం మాత్రం అలా చేయలేదు. అసలీ అబలెస్సా ఎక్కడ వుందని వారు పరిశోధన ప్రారంభించారు. చివరకు తమన్రసెట్ అనే పట్నానికి నైరుతిదిశలో 100 కి. మీ. దూరంలో ఆ పేరుగల పల్లె ఒకటి నిజంగానే వుందని తేలింది.

ఇకనేం ! వాళ్ళు ఆ వూరికి వెళ్ళి వాకబు చేశారు. అక్కడ సమాధి ఏదీ వున్నట్లు తెలియలేదు కాని వూరికి చివర్న ఒక పెద్ద మట్టి దిబ్బ వుంది, అది ఆరడుగుల పైగా ఎత్తుండి, దాదాపు ఎనభై అడుగుల వ్యాసం కలిగి వుంది. వెంటనే ఆ శాస్త్రజ్ఞులు అక్కడ తవ్వకాలు మొదలెటారు.

కొద్ది రోజులలోనే అందులో ఒక ప్రాచీన నిర్మాణం బయటపడింది. గదులు గదులుగా కట్టిన నిర్మాణం అది. చిత్రమేమంటే అవన్నీ కప్పు వేయ కుండా కట్టిన గదులే. అలాంటి నిర్మాణానికి అల్జీరియా వాస్తు రీతికి ఏ సంబంధమూ లేదు, ముఖ్యంగా ఆ నిర్మాణ పైఖరిలో ఇస్లామిక్ వాస్తురీతి అంతకన్నా లేదు.

ఆ గదులన్నీ ఖాళీగా వున్నాయి గాని ఒక గదిలో మాత్రం పెద్ద పెద్ద బండరాళ్ళతో మూయబడిన సమాధి ఒకటి వుంది. అందులో గల అస్థిపంజరాన్నీ చెందినదిగా గుర్తించారు. అయితే ఆమె ఎవరో గాని అల్జీరియా వాసి కాదు. అయితే ఈజిప్టు దేశానికి చెందిన దయి వుండాలి. లేక ఎవరో విదేశీయులు కావాలి. చాలా పొడుగాటి మనిషి. దాదాపు అయిదడుగుల పది అంగుళాల ఎత్తుంది. కుడి చేతికి ఏడు బంగారుగాజులు ఎడమ చేతికి ఏడు వెండిగాజులూ వేసుకుంది. ఆమె పక్కన ఒక చెక్కపాత్రలో బంగారు నాణాలుఉన్నాయి. అవి రోమన్ నాణాల మాదిరిగా కనిపించాయి. మరొక గదిలో ఒక చిన్న శిలావిగ్రహం లభించింది. అదొక స్త్రీ దేవతదని భావిస్తున్నారు. ఆ విగ్రహం పాత శిలా యుగం నాటిదని శాస్త్రజ్ఞుల వూహ.

ఆ నిర్మాణాన్ని చూస్తే అదొక సమాధికోసం కట్టి నట్లులేదు. ఒక చిన్నసైజు కోటలాగా వుంది. చుట్టూ యింకా 14 రాతి గదులున్నాయి అవన్నీ ఎప్పటి నిర్మాణాలో తెలియదు కాని క్రీస్తు పూర్వం వని మాత్రం తేలింది.

ఇంతకూ ఆమె రాణి తిన్‌హినాన్‌గారేనా ? ఆ నిర్మా ణాన్ని ఎందుకు, ఎవరు, ఎప్పుడు నిర్మించారు ? ఆమె ఒక చేతికి బంగారు గాజులు, మరో చేతికి వెండి గాజులు ఎందుకు వేసుకొంది? పక్కన రోమన్ నాణాలు ఎందుకు? అంత పొడుగైన స్త్రీ ఏ జాతికి చెందింది ? ఆ దేవతా విగ్రహం ఎవరిది ? ఏ మతానికి చెందింది ? ఇవన్నీ అంతుబట్టని విషయాలే.

)O(O(

# కొమరగిరి కారాగారలేఖలు

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 3-1-1977

మరా శ్రీ. నాన్నగారికి - సప్రేమ నమస్కారములు.

నేను కులాసా తమరు వ్రాసిన ఉత్తరం అందినది. ముక్కోటి ఉత్సవాలను నిర్వహిస్తున్నందులకు చాలా సంతోషం. పిల్లలకు వ్రాస్తున్న ఉత్తరాలు చదువుతున్నారనుకుంటాను 'విద్య' యొక్క గొప్పతనాన్ని గురించి 7 ఉత్తరాలు, జ్ఞానవిజ్ఞానములను గురించి 8 ఉత్తరాలు వ్రాసాను 'ఆత్మజ్ఞానము'ను గురించి ఈ ఉత్తరంలో వివరిస్తాను. చి॥ గౌరి వ్రాసిన ఉత్తరం అందినది. పిలకా గణపతి బాగా చదువుతున్నాడని భావిస్తున్నాను. పిల్లలందరికీ నా ముద్దులు.

"జ్ఞానానాం జ్ఞానముత్తమం" జ్ఞానములలోకెల్ల 'ఆత్మజ్ఞానం' ఉత్తమమైనది ఈ ప్రపంచంలో అనేక జ్ఞానములున్నాయి. భౌతికశాస్త్ర విజ్ఞానం (Science), మరియు సంగీత, సాహిత్య, శిల్ప, గణిత జ్ఞానములెన్నో ఉన్నాయి. ఎన్ని జ్ఞానములను సంపాదించినప్పటికినీ 'ఆత్మజ్ఞానము'ను సంపాదించని వానికి శాంతిలేదు, సుఖమూ ఉండదు. ప్రపంచదృష్టిలో కీర్తిప్రతిష్టలు సంపాదించుకొనినప్పటికినీ, 'ఆత్మజ్ఞానం' లేనివారు భగవంతునకు ప్రీతిపాత్రులు కాలేరు. "నహి నహి రక్షతిడుకృఞ్ కరణే". లౌకికవిద్యలు జనన మరణములనుండి రక్షింపజాలవు దైవవిద్య, ఆధ్యాత్మిక విద్యలవల్లనే మానవునికి 'మోక్షం' సంప్రాప్తమవుతుంది. ఏ జ్ఞానము వలన మనుజుడు అనేకత్వంలో ఏకత్వమును, మృత్యువులో అమృతత్వమును గాంచగల్గునో, అదియే అన్ని జ్ఞానములలో శ్రేష్ఠమైనది. అదియే సాత్వికజ్ఞానము, అదియే ఆధ్యాత్మిక విద్య. భగవానుని దృష్టిలో ఆధ్యాత్మిక జ్ఞానమే సర్వశ్రేష్ఠమైనది. ఆత్మజ్ఞానం అన్నా, పరమాత్మజ్ఞానం అన్నా ఆధ్యాత్మికజ్ఞానం అన్నా అంతా ఒకటే. ఆత్మను, పరమాత్మను చక్కగా తెలుసుకొనుటకు దోహదంచేసే విజ్ఞానం అది అసలు అట్టి విజ్ఞానం ఎలా లభిస్తుంది ?

"యస్మిన్ జ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" దేనిని తెలిసికొనినచో, సమస్తమును తెలుసుకొనబడినదగునో, అట్టి పరమాత్మను ఎరిగినవాడగును అదియే 'ఆత్మజ్ఞానము'. అతడే ప్రపంచంలో 'సర్వజ్ఞుడు'గా పేరు ప్రఖ్యాతులను పొందుతాడు. ప్రపంచంలో ఎన్ని భౌతికవిద్యలు సంపాదించినను, ఎంతటి పాండిత్యమును బడసినను, ఎన్ని కళలు సముపార్జించినను, మనుజుడు 'సర్వవేత్త' కాలేడు, 'సర్వజ్ఞుడు' అంతకన్నా కాలేడు. కారణం ? లౌకికవిద్యలు పరిపూర్ణశాంతిని కలుగజేయజాలవు. జన్మరాహిత్యమును కలుగజేయవు.

"తరతి శోకమాత్మవిత్" ఆత్మజ్ఞాని ఒక్కడు మాత్రమే శోకమును దాటగలడు. కనుక ప్రతి ఒక్కరూ పరమాత్మను ఆశ్రయించవలసినదే, ఆత్మజ్ఞానమును పొందితీరవలసినదే అప్పుడే అతనికి సమస్త విద్యలు కరతలామలకములగును. ఎందువలన అనగా ఈ సమస్త బ్రహ్మాండములు, ఈ చరాచర సృష్టి యావత్తూ, సమస్త శాస్త్రములు విద్యలూ, కళలూ- అన్నియూ భగవానుని యందే యిమిడివున్నాయి కనుక అట్టి పరమాత్మను బాగుగా తెలిసికొనినవాడినే "జ్ఞాని, సర్వవేత్త సర్వజ్ఞుడు" అని అంటారు. అట్టి ఆత్మజ్ఞానికే మోక్షం సంప్రాప్తిస్తుంది. అట్టి ఆత్మజ్ఞానం 'చిత్తశుద్ధి' వలననే కలుగుతుంది. అట్టి చిత్తశుద్ధి పుణ్యకార్యములు, పవిత్ర కార్యములు (దానం, పరోపకారం, భూతదయ, మానవసేవ, దైవభక్తి, సత్ కథా

కాలక్షేపం, భగవద్గీత, రామాయణ, భారత భాగవతముల అధ్యయనం) నిష్కామబుద్ధితో ఆచరించడం వల్లనూ, ఎట్టి ఫలాపేక్ష లేకుండా, ఈశ్వరార్పణబుద్ధితో కర్మలనాచరించడంవల్ల కల్గుతుంది. అట్టి నిర్మల హృదయమున "జ్ఞానభాస్కరుడు" ఉదయిస్తాడు. అట్టి జ్ఞానోదయం వలన నరుడు నారాయణుడు అవుతాడు, జీవుడు శివుడవుతాడు, మానవుడు మాధవుడవుతాడు, పురుషుడు పురుషోత్తముడు అవుతాడు, పశువు పశుపతి అవుతాడు. అట్టి పరమోత్కృష్టమైన స్థాయికి చేరుకొనవలెననిన మొదటిది పురుష ప్రయత్నం, రెండవది దైవసహాయం అత్యవసరం. భక్తిశ్రద్ధలు కావాలి; ఏకాగ్రత, పట్టుదల ఉండాలి. మనుజుడు తన అల్పశక్తిని చూచుకొని గర్వించరాదు. దైవమునందు విశ్వాసముండాలి. నిష్కామబుద్ధితో కర్మలనాచరించిన యెడల సత్ఫలితాలు చేకూరుతాయి. జ్ఞానోదయమవుతుంది. అజ్ఞానం పటాపంచలై పోతుంది. నిజ ఆత్మ స్వరూపమును సాక్షాత్కరించుకొనగలుగుతాడు. అదియే 'మోక్షం', అదియే 'జన్మరాహిత్యం'. అదియే జీవుని అంతిమ లక్ష్యం. జ్ఞానమే జీవుల చరమలక్ష్యం. అట్టి జ్ఞానియే కృతార్థుడు. అట్టి మహనీయుడు, ఎన్నడూ, ఎప్పుడూ, ఎవరికీ భయపడడు. అట్టి జ్ఞానము కలుగనంతవరకు జీవుని సంశయములు బాధించుచునే ఉండును. అట్టి ప్రత్యక్షజ్ఞానం కలిగిన వెంటనే అవిద్య, అంధకారం తొలగిపోయి, సందేహములు మటుమాయమగును. అందువలననే ఆత్మజ్ఞానమునకు మించిన జ్ఞానము మరొకటి లేదన్నారు మహానుభావులు. కనుక ప్రతి ఒక్కరూ అట్టి మహత్తరమైన 'ఆత్మజ్ఞానము' ను సంపాదించితీరవలెను.

మిగతా విషయములు తరువాత వివరిస్తాను.

ఇక ఉంటా....

ఇట్లు
'మీ అబ్బాయి'

# రహస్యం

తెరుచుకున్న కలల వాకిలి ముందు
గోరువెచ్చని బంగారు పచ్చదనం
మిలమిల మెరిస్తే,
చిగురులోని వగరు మింగిన గొంతు
తీయని 'భూపాలం' ఆలపించింది !
ముడుచుకున్న రెక్కల్లోని నిద్ర బద్ధకం
ఒళ్ళు విరుచుకుని ఆవలిస్తే,
నల్లటి కుబుసం విడిచిన తొలిపొద్దు
గడపగడపముందు మంచు తెరలముగ్గులుపరిచింది
ప్రతి ఉదయం ;
మానవాళిని ముగ్ధుల చేసి
మైమరపిస్తున్న ఈ దృశ్యం
ఎన్ని యుగాల జీవిత పుటలు చిరిగినా
తన తీరు తెన్నులు మాత్రం ఏమరని
ఆ దినకరుని క్రమశిక్షణా "రహస్యం"

- భారతీకృష్ణ

With Best Compliments from

# J. NARASIMHA RAO & SON



Phone : **8722**

BHARAT PETROLEUM DEALERS

Trunk Road
KHAMMAM - 507 001

# రామకృష్ణ పరమహంస

- డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

భారతీయ తత్త్వాన్ని జీర్ణించుకున్న మహాయోగి శ్రీ రామకృష్ణ పరమహంస. పాశ్చాత్య సంస్కృతి, నాగరికతలపై మోజు పెంచుకొని మన జాతి గొప్పతనాన్ని మరచిపోయి - మనం వెనక్కు నడుస్తున్న వేళ చీకటిని పోగొట్టే చిరు దివ్వెలా, భాగ్యోదయానికి దారి చూపే మార్గదర్శిలా - వెలుగొందిన మహా పురుషుడు శ్రీ రామకృష్ణుడు. అన్ని మతాలూ ఒకటే ! ప్రతి మతమూ దేవుని చూపించడానికే ! దేవుడంటే జీవుడే ! జీవునిలోని మంచితనమే. అదే ప్రేమ ఈ తత్త్వాన్ని అందరికీ అందించినవాడే శ్రీ రామకృష్ణుడు.

క్రీస్తుశకం 1836 వ సంవత్సరం ఫిబ్రవరి 18 వ తారీఖున శ్రీరామభక్తులైన కుడీరాయుడు, చంద్రమణీ దేవికి శ్రీమన్నారాయణుని కృప వలన రామకృష్ణుడు జన్మించాడు. అతని తల్లిదండ్రులు పెట్టిన పేరు గదాధరుడు. పసిబిడ్డగా ఉన్నప్పుడు అతడు తేలికగానే ఉండి హఠాత్తుగా బరువెక్కుతూ ఉండడం తల్లికి ఆశ్చర్యంగా వుండేది. చిన్నప్పటి నుంచీ రామకృష్ణుడు ఏకాంతంలోనే గడిపేవాడు రామాయణము, భారతము భాగవతము మొదలైన గ్రంథాలలోని కథలను ఎంతో చక్కగా చెప్పేవాడు. శ్మశానానికి వెళ్ళి ఒంటరిగా కూర్చుని ధ్యానం చేసి కొన్ని గంటల తరువాత వచ్చేడివాడు. ప్రకృతి అందాలను చూస్తూ పరవశించిపోయేవాడు. భగవంతుని సంకీర్తనలు పాడేటప్పుడు ఒళ్ళు మరచిపోయేవాడు. అతని పరిస్థితి ఎవరికి అర్థమయ్యేది కాదు.

## సర్వం కాళీమాతే

రామకృష్ణునికి చిన్నతనమున తండ్రి లేని లోటు కలిగినది. పెద్ద అన్న రామకుమారుడు జన్మస్థలమైన కామర్పుకూరు (వంగదేశంలో వుంది) నుంచి రామకృష్ణుని తీసుకొని దక్షిణేశ్వరం వెళ్ళాడు. రాణీ రసమణి అనే జమీందారిణి కట్టించిన కాళీ ఆలయంలో రామకృష్ణునికి విడదీయరాని అనుబంధం ఏర్పడినది. కాళీమాతతోనే రేయింబవళ్లు గడిపేవాడు. బయటివారికి అతడొక పిచ్చివాడుగా కనిపించేవాడు. ఈ విషయం తల్లిదాకా వెళ్ళింది. పెళ్ళి చేస్తే బాగుపడతాడేమోనని పెద్దలు అనుకున్నారు కాని ఆ వెర్రివానికి పిల్లనిచ్చేదెవరు ? రామకృష్ణుడే తనకు కాబోయే భార్య శారదామణి యని ఆమె తండ్రి రామచంద్ర ముఖోపాధ్యాయ అని, వారిది జయరాం బటి అనే గ్రామమని చెప్పాడు. అంతే ! అక్షరాలా అలాగే జరిగింది. సంసారి అన్నమాటే కాని రామకృష్ణుని జీవితమంతా దేవీ పాదాలపైనే వుంది. శారదామణికి భర్తే దైవము.

రామకృష్ణుడు దక్షిణేశ్వరానికి మళ్ళీ చేరుకున్నాడు. భైరవీ బ్రాహ్మణి అనే యోగిని రామకృష్ణునికి తాంత్రిక విద్యను నేర్పించింది. తోటపురి అనే యోగీశ్వరుడు వేదాంత నిష్ఠాభ్యాసమును రామకృష్ణునికి నేర్పించాడు. ఎన్నో సంవత్సరాలు ఏకాగ్రతతో సాధిస్తే తప్ప లభ్యం కాని అమూల్యమైన ఆ విద్యలు రామకృష్ణునికి ఒక నెలలోపే అబ్బడం గొప్ప విషయంగా చెప్పుకోవాలి. శారదామణి భర్త దగ్గరకివచ్చి, అతనికి సపర్యలు చేయడం మొదలు పెట్టింది.

రామకృష్ణుడు ఆమెలో జగన్మాతను చూడటం అలవాటు చేసుకున్నాడు. ఇలాంటి దాంపత్యం సృష్టిలో అసంభవ మనిపిస్తుంది.

ఎన్నో మహిమలు చూపిన రామకృష్ణునికి శిష్యకోటి అనంతంగా ఉంది. వారిలో జాతిశక్తిని దశదిశలా వెదజల్లిన వివేకానందస్వామి అతిముఖ్యుడు. ఎన్నో విధాల గురువును పరీక్షించాకే వివేకానందుడు తృప్తి పడ్డాడు. కాళికాదేవి రామకృష్ణునికి స్ఫూర్తినిస్తే రామకృష్ణుడే తనకు స్ఫూర్తినిచ్చాడని వివేకానందుడే స్వయంగా చెప్పాడు. రామకృష్ణుడు తన శక్తినంతా ధారపోసి వివేకానందునికి ఎనలేని ఆత్మస్థయిర్యాన్ని కల్పించి ఆ శక్తితో లోకానికి మేలు చేయమని ప్రబోధించాడు. మీ శక్తిని ఉపయోగించుకొని ఆరోగ్యాన్ని కాపాడుకోరాదా అని శిష్యులు అంటే నా కన్నా గొప్పది నా జాతి. ఆ జాతి శక్తిని కాపాడడానికే నా శక్తిని ఉపయోగించాలి అని రామకృష్ణుడు కాక మరెవరు అనగలరు ? ఆయన భౌతికంగా లేకపోయినా ఆయన అదృశ్యం ఎల్లవేళలా స్ఫూర్తిని కలిగిస్తుంది.

## అపూర్వ గురుశిష్య సమాగమం

ప్రపంచంలో ఎక్కడా తారసపడని అపూర్వ గురు శిష్య సమాగమం భరతఖండంలోనే తారసపడింది. పరమ యోగిపుంగవుడు శ్రీ రామకృష్ణుడు. అద్వైత షోడశ కళాశశి ఆ మహానుభావుడు. వివేకానందుడు తత్త్వవిచారకుడు నిరంతర పరిశోధకుడు. వ్యక్తిగత తత్త్వానుభూతిలో సముద్ధరింపబడి సంసారంలో సన్యాసాన్ని, అనురాగంలో వైరాగ్యాన్ని అనుభవించే సర్వ మత సమన్వయ సమసమాజదీప్తి రామకృష్ణ పరమహంస

జాతి సంక్షేమం, విశ్వ చైతన్యం గుండెల దొరలాడే రాజయోగి వివేకానందస్వామి. గురువు సంసారి గృహస్థాశ్రమంలో ఉంటూనే ఆధ్యాత్మిక తత్పరతను పెంచుకోవాలని అతని అభిమతం. శిష్యుడు సన్యాసి. ఆధ్యాత్మిక తత్పరత నుంచి సామాజిక తృష్ణను సృష్టించుకోవాలని అతని జిజ్ఞాస.

ఎక్కడివారో, ఎవరు ఎవరికి ఏమవుతారో, తెలియదు కాని, ఎందుకో కలిసారు. దేవుడెక్కడ ? దేవుని చూపించగలరా ? అని శిష్యుడడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పిన రామకృష్ణుడు మహా మేధావి. అసలు దేవుడెందుకు? 'దేవుడంటే ఏమిటి ? అని గురువు ప్రశ్నిస్తే శిష్యునికి సమాధానం తెలిసిరాలేదు. సమాజానికి హితం చేకూర్చని ఆధ్యాత్మిక చింతనలు, పురాణ ప్రవచనాలు ఎందుకు? ఎందుకు? అని శిష్యుని ఆరాటం. మానవుడు మొదట దైవకృపచేత తన్ను తాను సంస్కరించుకొని,వ్యవస్థను సంస్కరించేందుకు తగిన శక్తిని తెచ్చుకొని, ఇతరులకు మేలు చేయాలని గురూపదేశం. రామకృష్ణుని శక్తంతా మహాకాళియే ! అతని అర్ధాంగి శారదాదేవి శక్తంతా రామకృష్ణుడే ! గురునిచేత, గురు పత్నిచేత సంస్కరింపబడ్డ వివేకానందుని శక్తి ఆ మహా మహుల ఆశీర్వాద బలమే. గురుశక్తి అజ్ఞాతంగా నాలో చేరుకొని నిరంతరం నా లక్ష్యాన్ని గుర్తుచేస్తూ నా జీవితానికి సార్థకత నిస్తోందని వివేకానందుడే ఎన్నో మార్లు అన్నాడు అంతటి సంస్కారం గురు కృపే! గురు కృప నిస్సందేహంగా దైవకృపే! అపారమైన ఆ కృపే భగవంతుని ప్రతిరూపమని శిష్యుడు గ్రహించ గలిగాడు. అందుకే వ్యక్తిగత జీవనంకన్నా సమాజ జీవనమే ముఖ్యమైనదని స్పష్టంచేసి, మనిషికన్నా మనిషి జాతి మిన్న యని ప్రకటించి జాతి శక్తిని నిత్యం జాగృత పరుస్తూ చైతన్య స్రవంతిని సృష్టించాలని, అదే ప్రతి మనిషి కర్తవ్యం కావాలని వివేకానందుడు బోధించగలిగాడు.

## దేవుడు ఒక్కడే !

ఒక చెరువుకు నాలుగువైపులా ఏ గట్టు మీదనుంచి

దిగి ఎక్కడ నీరు తీసుకున్నా ఆ నీరు ఒకే విధంగా ఉన్నట్లు ఏ మతం తీసుకున్నా దేవుని ప్రతిరూపం ఒకటేనని రామకృష్ణుని సందేశం. అన్ని మతాల సారమూ పరమాత్మ ప్రతిబింబమైన మానవత్వమేనని దాని తాత్పర్యమని తెలుసుకోవచ్చు. వివేకానందునికి ఏ మతమూ లేదు. ఆత్మగతమైన సంస్కారసిద్ధిని పొందే ఏ పథమైనా అతని మతమే! ఒక అనాథ కన్నీళ్ళను తుడిచేది మతం. ఒక గ్రుడ్డివానికి వెలుగు చూపించేది మతం. సమాజహితాన్ని అభిలషించే ఏ వాదమైనా మతం అన్న అభిమతం వివేకానందునిది. సంఘటితశక్తిని సాధించగలగడం, తద్వారా సమ సమాజాన్ని నిర్మించగలగడం. తద్వారా పది కాలాల పాటు మన జాతి విద్వత్తును కాపాడుకోగలగడం— ఇవి వివేకానందుని ఆదర్శాలు. ఇవి రామకృష్ణుని భావ చిత్రణలే! ప్రపంచ ప్రఖ్యాతి పొందిన చికాగో వివేకానందోపన్యాసంలోని మూలతత్త్వం ఇదే. క్రీ. శ 1898 మే మాసంలో అన్ని మతాలవారూ జరుపుకొన్న సమావేశంలో పాల్గొనడానికి ఉపేక్షింపబడి, ఎంతో కష్టసాధ్యంమీద ప్రవేశాన్ని సాధించి "సిస్టర్స్ అండ్ బ్రదర్స్ ఆఫ్ అమెరికా" అన్న ప్రియాతిప్రియ మైన సంబోధనతో అందరిలోనూ స్పందన రేకెత్తింప జేసిన రామకృష్ణుని ప్రియశిష్యుని అసలు సిద్ధాంతం మానవత్వమే! ఇది భారతీయ తత్త్వమే!

## శ్రీరామకృష్ణ వివేకానంద తత్త్వం

ఆ గురుశిష్యుల మేలు కలయిక అయిదు సంవత్స రాల పాటు మాత్రమే కొనసాగింది. అయితే ఏమి? కాళీమాత ఉరవడి రామకృష్ణుని ఎదసవ్వడియై వివేకా నందుని అంతరాత్మను మేల్కొలిపినది. తల్లి శారదాదేవి అనుగ్రహంతో రామకృష్ణుని వారసత్వాన్ని వివేకా నందుడు కొనితెచ్చుకున్నాడు. దేశవ్యాప్తంగా పర్యటన జరిపి ప్రతి మనిషిలోనూ జీవితంపట్ల, జీవన విధానం పట్ల, జాతిపట్ల, దేశసౌభాగ్యంపట్ల స్ఫూర్తివంతమైన అవగాహన వచ్చేలా అహర్నిశలు శ్రమించిన వివేకా నందుని ఏకైక ఆయుధం మనోధైర్యం! ఆత్మస్థైర్యం! కలకత్తా సమీపంలో ఉన్న బేలూరు వద్ద రామకృష్ణుని మఠాన్ని క్రీ. శ. 1901 లో ఏర్పరచి గురుసూక్తులకు పంచప్రాణాలను పోసి సమసమాజం కోసం రేయింబవళ్లు పరిశ్రమించిన కర్మశీలి వివేకానందుడు. జాతిశక్తిని ద్విగుణీకృతంచేసే సింహసమానులైన యువకులు మేల్కొవాలని, దేశభవిష్యత్ కోసం వారు కంకణం కట్టుకోవాలని పదేపదే ప్రబోధించేవారు.

"వందేమాతరం" సృష్టికర్త అయిన బంకించంద్ర చటర్జీకి ఒక సందర్భంలో రామకృష్ణుడు ఇలా తెలియ జెప్పాడు—

" ఒకటి తెలిస్తే సర్వమూ మీకు తెలిసినట్లే. ఆ ఒకటి తరువాత ఏభై సున్నాలుంటే అది పెద్ద మొత్త మౌతుంది. అసలు ఒకటే లేకపోతే ఎన్ని సున్నాలు వుంచినా ఏమి ప్రయోజనం?" అని అంటే ముందు ఆత్మసంస్కారాన్ని సిద్ధింపజేసుకుంటే తప్ప జీవన ఆశయము తెలిసిరాదని, ఆ ఆశయం తెలిసిన పిదపే సమాజానికి హితం చేకూర్చవలెనన్న యింగితజ్ఞానం బోధపడుతుందని ఆయన చెబుతున్నట్లు అర్థమౌతుంది. అసలు 'నేను' అంటే ఏమిటో 'నేను' అంటే ఎందుకో తెలియకపోతే ఎన్నో 'నేను'లు నిండుకొన్న ఈ సమాజం ఎట్లు అర్థమవుతుందని ఆయన ప్రశ్న. ఈ మీమాంసనుంచి ఆయన ఆత్మజ్ఞానంవల్ల బయటపడినాడు. మిడిమిడి జ్ఞానంతో కొట్టుకులాడుతున్న పసివాడు, వివేకానందుని చేరదీసి సంస్కరించి మహోపకార మొనర్చినాడు. తాను సంస్కరించబడడం గొప్ప విషయమే. కాని సంస్కరించబడ్డాక మరో మనిషిని

సంస్కరించడం మరింత గొప్ప విషయం. అది అత్యుత్తమ మానుషధర్మం! ఆత్మసంస్కరణమైనా, సంఘసంస్కరణమైనా జాతిశక్తిని జాజ్వల్యమానంగా ప్రకాశింపజేయుట కొఱకేనని భారతీయ ధర్మం స్పష్టం చేస్తున్నదన్న విషయాన్ని మరచిపోకూడదు.

" ప్రభాత మలయమారుతంవలె స్వేచ్ఛామయమై, అప్పుడప్పుడే విరిసిన పూవులాగా సమకోమలమై మంచు బిందువులాగా స్వచ్ఛమై అలరారే బాల్యం ఆజన్మాంతం ఎవరిపట్ల శోభిల్లుతుందో అతడే ధన్యాత్ముడు " అన్న రామకృష్ణుని మాట అక్షరసత్యం. "సింహవిక్రములైనప్పటికీ చిరునగవుతో, అహింసతో, ఆత్మవిశ్వాసంతో కార్యాన్ని సాధించగల సామాన్య మానవులే చరితార్థ సాధకులు " అన్న వివేకానందుని మాట తిరుగులేని యదార్థం. ఆ గురుశిష్యుల బోధనలు సర్వకాల సర్వావస్థలయందూ ఆమోదాలు. అవి అత్యంత సరళాలు. అందరికీ సమ్మతాలు, ధీరగంభీరాలు శాంత సుందరాలు.

### లోకకళ్యాణమే ఆశయం

విశ్వమానవ సౌభాగ్యం వారి అభీష్టం. స్త్రీపురుష భేదభావం సంస్కార లోపమని వారి వాదం. సమాజానికి చెరపుచేసే ఏ సంప్రదాయమైనా అనాచారమే అవుతుందని, మతం పేరుతోనే ఇంకే విధంగానో దానిని కొనసాగించడం మూఢాచారమవుతుందనివారి అభిప్రాయం. భగవంతుని దృష్టిలో ఎల్ల మానవులు ఎలా సమానులౌతున్నారో, అటువంటి దృష్టితోనే ప్రతి మానవుడు తన తోటి మానవులను చూడగలిగినప్పుడు సౌభాగ్యపూరితమైన సమాజం రూపకల్పన చేసుకొంటుందన్న పరికల్పన ప్రత్యక్షం కావాలని ఆశించడము తప్పుకాదు. ఆశించిన లక్ష్యాన్ని చేరుకోవడానికి ప్రతి మనిషి ప్రతి క్షణం శ్రమించాలి.

శ్రమ యేవ జయతే ! కష్టే ఫలి ! ఇవి భారతీయ ఆదర్శ సూత్రాలు. వీటి మార్గదర్శకులు ఎందరో ! వారిలో శ్రీ రామకృష్ణ, వివేకానందులు కూడా ఉన్నారు. వారి జన్మ ధన్యం ! వారిని ఆదర్శంగా తీసుకొని సమాజ సంస్కరణకు కంకణం కట్టుకొనే ప్రతి మనిషి జన్మ ధన్యాతి ధన్యం ! !

ఆ గురు శిష్యులకు శ్రద్ధాంజలులు !



# చైనాలో బుద్ధుడు

చైనాలో స్వర్ణంతో బుద్ధ భగవానుని విగ్రహమును రూపొందించాలని సంకల్పించారు. ఈ విగ్రహం ఎత్తు 2.8 మీటర్లు ఉంటుందిట. దీనిని తయారుచేయటానికి 160 కిలోగ్రాముల బంగారం, 10 కిలోగ్రాముల ప్లాటినమ్, 60 కిలోగ్రాముల వెండిని ఉపయోగిస్తారుట. ఈ విగ్రహంపై వజ్రాలు, రత్నాలు, పచ్చలు తాపడం చేస్తారుట. జిన్‌పింగ్ జ్యూయలరీ కంపెనీవారు మరికొన్ని ఇతర సంస్థలతో కలిసి విగ్రహనిర్మాణం చేస్తున్నారు. వచ్చే సంవత్సరం ఈ బుద్ధ విగ్రహమును ఏ నగరంలో ప్రతిష్ఠిస్తారో ఇంకా తెలియదు. భారత్‌లో జన్మించిన బుద్ధుడు చైనాలో గౌరవించబడటం విశేషం కదా !

# అసూయ

-సోమంచి రామం

'పరుల కలిమికి పొర్లి ఏడ్చే పాపికెక్కడ సుఖం కద్దోయ్? ' అంటూ మహా కవి గురజాడ అప్పారావు గారు ఆలపించారు.

తనకు లేని సంపద యితరులకు ఉన్న దే యన్న ఈర్ష్యతో నిత్యం శోకించే పాపాత్మునికి జీవితంలో సుఖమనేదే ఉండదు. అలాంటి పాపికి జన్మంతా దుఃఖ మయమే! అందుకని దుఃఖభాజనమయిన ఈర్ష్యను మానవుడు విసర్జించాలి.

మానవుని చిత్తశాంతిని చిత్తుచేసి చిత్తక్షోభకు గురి చేసే దుర్గుణాలలో అసూయ ఒకటి. అసూయాగ్ని శరీరాన్ని నిలువునా దహించి వేస్తున్న మానవునికి మానసిక శాంతి యన్నది మృగతృష్ణవంటిదే! అసూయ ముందు పుట్టి ఆడది వెనుక పుట్టిందని అనుభవజ్ఞులు అంటారు. అంటే అసూయయన్నది ఆడవారిలో అధిక మని వారి భావన అసలు అసూయ యన్నది అవ లక్షణమే అయినప్పుడు, దానికి ఆడ, మగ బేధము లెందుకు ? దుర్గుణమన్నది ఎవరివద్ద యున్నను నిందార్హమే.

ఈర్ష్య, ఈసు అన్నవి అసూయకు నామాంతరాలే ! అసూయతో పుట్టేది ద్వేషం ద్వేషం కోపాన్ని రగి లిస్తుంది. కోపం క్రమ క్రమంగా దురాగ్రహంగా మారుతుంది.

'ఈసున బుట్టి, డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చె ప్రాణ విభు కట్టెదుటన్ లలితాంగి .... '

అంటూ నంది తిమ్మన శ్రీకృష్ణ సతి సత్యభామను చక్కగా వర్ణిస్తారు తమ పారిజాతాపహరణ కావ్యంలో. నారదుడు యిచ్చిన చిన్న పారిజాత పుష్పాన్ని శ్రీకృష్ణుడు రుక్మిణీదేవికి యిచ్చాడన్న ఈర్ష్యతో, స్వాతిశయానికి ప్రతీకమైన సత్యభామ, భర్తపై కినుక వహిస్తుంది. అలకపాన్పు చేరిన అర్ధాంగి సత్యను శ్రీకృష్ణుడు అనునయించబోతాడు. ఆగ్రహావేశములో ఉచితానుచితములెఱుంగక ఆ సత్యభామ తన వామ పాదంతో భర్తను తోసివైచింది. అసూయ యెంతటి ఆకృత్యాన్నైనను చేయిస్తుంది. అందుచేత అసూయను అందరు త్యజించవలసిందే.

ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిత్యశంకితుడు.... అంటూ కొంతమందిని దుఃఖభాగులుగా పేర్కొంటారు పంచతంత్రములో. ఈర్ష్య నుంచే వికృతమైన కోరిక పుట్టుంది. ఆ కోరిక తీరకపోతే దుఃఖం జనిస్తుంది. జీవితం దుఃఖమయమవుతుంది. అందుకనే ఈర్ష్యాళువును దుఃఖభాగుడన్నారు.

'అన్యుల కల్మిఁగన్గొని అసూయామగ్నుడౌ
వానికాపద సేకూరు నవశ్యము' .

అంటూ హెచ్చరించారు పాపరాజు.

'ఇరుగు పొరుగు వారికెనయు సంపద జూచి
తమకు లేదటన్న ధర్మమేమి ? ....

అంటాడు మన ప్రజాకవి వేమన్న.

పాండవ నిర్మిత మయసభను ప్రవేశించిన దుర్యోధనుడు, అందలి చిత్రవిచిత్ర విన్యాసాలకు, ప్రదర్శనలకు ముగ్ధుడవుతాడు. మయసభా సౌందర్యానికి ఈర్ష్యోన్మత్తుడౌతాడు ఆ ఈర్ష్యాతిశయంతోనే, అందలి మాయాజాలాన్ని గ్రహించలేక, జలాశయంలోబడి భంగపాటు చెందుతాడు ఆ దృశ్యాన్ని అవలోకించిన పాండవ పత్ని ద్రౌపది కిసుక్కున పరిహాసంగా నవ్వు

తుంది. ఆ పరిహాసము ఆతనిని మరింత కృంగ దీస్తుంది ! అగ్గిపై గుగ్గిలంలా భగ్గున మండిపోతుంది అతని హృదయం ! పరాభవ ప్రతీకారవాంఛయే మహా భారత సంగ్రామానికి నాందియై నిలుస్తుంది ! తత్ఫలితమే కురుక్షేత్ర మహాసంగ్రామము, కౌరవవంశక్షయము. ఈర్ష్యయన్నది యెంత దుర్మార్గమైనదో యీ ఉదంతమే చెప్తుంది !

భమిడిపాటివారి 'ఎప్పుడూ ఇంతే'- నాటికలో ఈర్ష్య అంటే ఎలా ఉంటుందో హాస్యధోరణిలో చక్కగ చెప్తారు. శివసాక్షాత్కారం కోసం ధ్యానం చేస్తున్న పర్వతాలకు అతి సులభంగానే శివవేషధారి ప్రత్యక్షమవుతాడు. 'ఏమిటి నీ కోరిక ?' అన్నట్లు సౌంజ్ఞ చేస్తాడు. "అయ్యా ! నా గురించి నాకేం దిగులులేదు ఆ అక్షయం గారున్నాడేం వాడు నిక్షేపంగా ఉన్నాడు. వాడు సుబ్బరంగా కుదిమట్టంలోకి తిరుక్షౌరం అయిపోయి పొట్టి సన్యాసి పీనుగు అయిపోయేలా నాకు వరం దయ చేయించాలి మహాప్రభు !" అంటూ సాష్టాంగపడుతాడు పర్వతాలు.

పాండవులు ఎప్పటికప్పుడు ప్రమాదాలనుంచి బయట పడగల్గుతున్నారు. అంతకంతకు వారు బలపడుతున్నారు. దీనికి తోడు ద్రౌపది స్వయంవర సభలో తనకు జరిగిన అవమానాన్ని దుర్యోధనుడు సహించలేకపోతున్నాడు. చక్కదనాలచుక్క ద్రౌపది తనకు దక్కలేదన్న చింత, ప్రత్యర్థులు పాండవుల వశమైందన్న మరొక చింత అతనిలో అసూయాద్వేషాలను పెంచుతాయి.

అలాగే నేటి మానవుడు రెండు చింతలతో వంత చెందుతున్నాడు. ఒకటి తనకు లేదన్న దుఃఖం, రెండవది ఎదుటివానికున్నదన్న ఈర్ష్య ! ఈ రెండవదే అసూయ. ఈ ఈర్ష్యాగుణాన్ని త్యజించిన మానవునికి భగవానుడే సన్నిహితుడు కాగలడు. అప్పుడే ఆ మనిషి మనీషి అవుతాడు



# ప్రతి ఒక్కరూ.... !

మనసు నిలకడకోసం
ప్రార్థన –
మనసు పలకడంకోసం
కవిత్వం –
ఉద్రిక్తమైన మనసు సడలింపు కోసం
సంగీతం -
ఉల్లం రంజిల్లడం కోసం
నర్తనం –

కళాతృష్ణ కలికితనంకోసం
చిత్రకళ –
ఆత్మోన్నతి కోసం
అనుష్ఠానం –
సాంస్కృతిక సంబంధం కోసం
సాహిత్యాభిలాష –
మానవత పుష్పించడం కోసం
సాంఘిక సేవ –

- యస్. యస్. రెడ్డి

With best
compliments
* from *

Phone : 4838817

**M/s. R. K. Film Associates**

# Gharana Bullodu

Starring :

- NAGARJUNA,
- RAMYA KRISHNA
- AAMANI
- BRAHMANANDAM
- KOTA SRINIVASA RAO Etc

PRODUCER :

*K. Krishna Mohana Rao*

DIRECTOR :

*K. Raghavendra Rao,* B.A.,

# మీసాలా - గెడ్డాలా

-చింతపల్లి అన్నపూర్ణ

'మీసమె పస మగ మూతికి' అనే సామెత వలన తెలుస్తోంది మీసాలకూ గెడ్డాలకూ ఉన్న ప్రాముఖ్యం నిజానికి మీసాలలో గెడ్డాలలో ఎన్ని వింతలూ, విశేషాలూ !

తిరుపతి వేంకటేశ్వర కవులలో ఒకరు అయిన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారికి పెద్ద మీసం ఉండేదిట. ఒకసారి ఒకరు ఆయన్ని 'శాస్త్రిగారూ ! మీరు వైదీకులు గదా ! మీసము పెంచినారేమండీ ? ' అని అడిగాడు సరదాగా. అందుకు ఆయన 'దోషం అని పెంచినాము- ఈ మీసము రెండు భాషలలో మేమే కవీంద్రులము అని తెల్పటానికి. మమ్మల్ని ఎవరు అయినా కవిత్వంలో ఓడిస్తే యీ మీసము తీసి వారి పాదముల దగ్గర శిరము ఉంచి మ్రొక్కుతాము' అనే అర్థం వచ్చే పద్యం ఆశువుగా, గుండెలు అవిసేలా చెప్పారు.

ఇక మీసాలకూ, గెడ్డాలకూ షోకులు చేసేవాళ్ళు ఎంతమందో ! 'మింగ మెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగ నూనె' అని సామెత కదా ! బెర్నార్డ్ షా రాసిన 'సెయింట్ జోన్' నాటకంలో ఒక బ్లూ బియర్డ్ కనిపిస్తాడు అట్లాగే లియోటాల్‌స్టాయ్ రాసిన కథలో రెడ్ బియర్డ్ కనిపిస్తాడు

ఇక ఆటగాళ్ళల్లో మీసాలూ, గెడ్డాలూ ఉన్నవాళ్ల ఎంతమందో ! ప్రఖ్యాత ఇంగ్లండ్ క్రికెట్ ఆటగాడు డాక్టర్ W. G. గ్రేస్‌కు మూరెడు పొడవుగల గెడ్డం వుండేదిట. ఒకసారి ఆస్ట్రేలియన్ ఫాస్టు బౌలరు గ్రెగరీ వేసిన బంతి గ్రేస్ గెడ్డంలో యిరుక్కుపోయిందిట. బాడీలైన్ బౌలింగ్‌కి అదే నాంది అని చెప్తారు. ఒకనాటి క్రికెట్ ఆటగాడు గుండప్ప విశ్వనాథ్ గెడ్డం పెంచేవాడుట గెడ్డం పెంచితే తనకు కలిసివస్తుంది అని అతని నమ్మకం. క్రికెటర్లు అయిన వి. వి యన్ రిచర్డ్స్, మైక్‌గాటింగ్ అందరూ గెడ్డాలు పెంచినవాళ్లేకదా!

ఇక నటులలో గెడ్డం, మీసం వున్నవాళ్ళు ఎంతమందో ! ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు క్లార్క్ గేబిల్ మీసాలు ప్రసిద్ధిగదా ! ఛార్లీఛాప్లిన్ మీసాలు ప్రసిద్ధి గదా! ఒకసారి హాలీవుడ్ నటుడు గ్రెగరీ పెక్‌కు గెడ్డం పెంచాలి అని సంకల్పం కలిగింది. కానీ నిర్మాతలు ఒప్పుకోలేదు. గెడ్డం మూలంగా అతని బాక్సాఫీసు స్థాయి పడిపోతుంది అని వారి భయం.

ఇక దేశ నాయకులలో మీసాలూ, గెడ్డాలూ ఉన్న వారు ఎంతమందో ! ఎడాల్ఫ్ హిట్లర్ మీసాలు ప్రసిద్ధి గదా ! క్యూబా నాయకుడు ఫిడెల్ కాస్ట్రో గెడ్డం ప్రసిద్ధి గదా !

ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు జాన్ బారిమోర్ ఉన్నత స్థితిలో వుండగా ఒకసారి షూటింగ్‌లో పాల్గొంటున్నాడు. బారిమోర్ 'ఎగస్ట్రాలలో ఒకడు అచ్చు తనలాగే వున్నట్లు కనిపెట్టాడు ఈ సంగతి దర్శకుడు చెవిన వేసాడు. ఆ ఎగస్ట్రాతో వెళ్ళిపొమ్మని నిర్దాక్షిణ్యంగా చెప్పాడు. బిక్కమొహంతో ఆ ఎక్స్‌ట్రా వెళ్ళిపోతుంటే బారిమోర్ జాలిపడి 'మేకప్‌మేన్ దగ్గరకువెళ్లి గెడ్డం అతికించుకురమ్మ'ని ఆ ఎక్స్‌ట్రాకు చెప్పాడు. ఆ ఎక్స్‌ట్రా మేకప్‌మన్ దగ్గరకు వెళ్ళి గెడ్డం అతికించుకుని షూటింగ్‌లో పాల్గొన్నాడు. అప్పటినుండి ఎప్పుడూ గెడ్డపు వేషాలు ధరించి ఆ ఎక్స్‌ట్రా రెండు వందల పైచిలుకు చిత్రాలలో నటించాడు అతని పేరు ఎడాల్ఫ్ మెంజూ.

అబ్రహాం లింకన్ ప్రతి ఫొటోలోనూ గెడ్డంతోనే కనిపిస్తాడు. నిజానికి లింకన్ గెడ్డం పెంచిన తరువాత ఎక్కువ రోజులు బ్రతకలేదు.

అబ్రహం లింకన్ అధ్యక్షుడుగా పోటీచేస్తున్నప్పుడు గెడ్డం లేకుండా ఆయన ఫొటో పేపరులో పడింది. అప్పుడు న్యూయార్క్కు చెందిన గ్రేస్ బెడెల్ అనే బాలిక లింకన్‌కు ఉత్తరం రాస్తూ 'నాకు నలుగురు అన్నయ్యలు వున్నారు. అందులో కొంతమంది మీకే వోటు వేస్తారు అనుకోండి. మీరు గనుక గెడ్డం పెంచితే మా అన్నయ్యలు నలుగురూ మీకే వోటు వేసేట్లు చూస్తాను' అని రాసింది. ఆ ఉత్తరం చదివి ముగ్ధుడైపోయిన లింకన్ అప్పటి నుండి గెడ్డం పెంచటం ఆరంభించాడు. తరువాత లింకన్ ఒకసారి న్యూయార్క్‌లో గ్రేస్ బెడిల్‌ను కలిసి మాట్లాడాడు కూడానూ.

రోమన్ చక్రవర్తి కాలిగూలా (37-41 A D) బంగారు తీగలతో చేసిన గెడ్డాలు ధరించేవాడు. అతని గెడ్డం రోమన్ దేవత జూపిటర్ విగ్రహంలోని గెడ్డాలతో పోలివుండేది. ప్రజలకు తను ఒక అవతార పురుషుడిగా కనిపించాలి అని కాలిగూడా అట్లాగ చేసేవాడు.

ప్రఖ్యాత గూఢచారి జేమ్స్ బాండ్ రోజుకు రెండుసార్లు గెడ్డం గీసుకుంటాడుట.

జపాన్‌లో ఐసావోత్సూచియా అనే క్షురకర్త ఒక గంటలో 223 మంది గెడ్డం గీసి రికార్డు స్థాపించాడు.

అమెరికాలో లాంగీ బీచ్ హార్బరులో 'క్వీన్స్' అనే ఓడ వున్నది. అది వాల్ట్‌డిస్నీ కంపెనీ వారిది. ఆ ఓడ యాత్రికులకు చాలా ఆకర్షణగా వుంటోంది. ఆ ఓడ యాజమాన్యంవారు ఆ ఓడలో పనిచేసేవారు అందరూ మీసాలు, గెడ్డాలు, తీసివేయాలి' అని ఆంక్ష పెట్టారు. జాన్ మాగ్నెస్ అనే ఉద్యోగి మాత్రం మీసం తీసివేయటానికి ఒప్పుకోలేదు. ఉద్యోగానికి రాజీనామా చేసి బైటకు వచ్చాడు.

రష్యాలో జార్జి చక్రవర్తుల కాలంలో గెడ్డాల మీద పన్ను (Tax) వుండేది. ఎవరు అయినా గెడ్డం పెంచిన వాళ్లు పన్ను కట్టకపోతే ప్రభుత్వంవారు కత్తెరతో గెడ్డాలను కత్తిరించేవారు. ఇంగ్లండులో 1 వ ఎలిజబెత్ రాణి పరిపాలనలో గెడ్డాల మీద పన్నులు వేసేవారు.

ఆఫ్రికాలోని చిన్న రాజ్యం అయిన మొగాబు యొక్క రాజు అయిన ఫతౌలి రషీద్ అలకామా తన రాజ్యంలో ఎవరూ 'గెడ్డాలు పెంచుకోరాదు' అని శాసించాడు. రాజవైద్యులు గెడ్డాలవల్ల అనేక అంటువ్యాధులు ప్రబలుతాయి అని చెప్పారుట, గెడ్డం పెంచుకుంటే ఆ రాజ్యంలో కళ్ళు తిరిగేటంత పన్ను చెల్లించాలిట.

అంతలా నాజూకుగా వున్న అమ్మాయికి యింతలేసి మీసాలు వున్నాయట 'అది ఏమిటి?' అని ఎవరో అడిగితే 'నాకు మా నాన్న పోలిక వచ్చింది' అన్నదిట సిగ్గుపడిపోతూ.

అన్నీ జోన్స్ ఇలియట్ అనే మహిళకి వయస్సు రాగానే మీసాలూ, గడ్డాలూ రాసాగాయి. యుక్త వయస్సు రాగానే అన్నీకి 14 అంగుళాల పైగా గెడ్డం ఉండేది. మీసాలూ, గెడ్డాలూ వున్న అన్నీ బార్నెమ్ బెయిలీ సర్కస్ కంపెనీలో చేరింది. ఆ సర్కస్‌లో మీసాలూ, గడ్డాలూ వున్న అన్నీయే ప్రధాన ఆకర్షణగా వుండేది. 18 వ శతాబ్దంలో జర్మనీలో రోజయిన్ మార్గరెట్ ముల్లర్ అనే మహిళ వుండేది. ఆమెకు కూడా మీసాలూ, గెడ్డాలూ వుండేవి ఆమె కూడా ఒక సర్కస్ కంపెనీలో చేరి అందులో ప్రధాన ఆకర్షణగా మారింది.

అమెరికాలోని వర్జీనియా రాష్ట్రంలోని ప్రైసన్స్ కార్నర్ అనే నగరంలో రిట్జ్ కార్లటన్ హోటలులో

పనిచేసే లిసియా(Lysia)జాయ్‌కి సన్నని మీసంవున్నది. ఆ మీసం వలన ఆమె ఉనికి ఖాతాదార్లకు యిబ్బంది కలిగిస్తోంది అని యాజమాన్యంవారు ఆమెను ఉద్యోగం నుండి తొలగించారు. 'మీసాలను డై చేయించుకుంటాను లేదా షేవింగ్ చేసుకుంటాను' అని లిసియా హామీని హోటల్‌వారు వినిపించుకోలేదు. దానితో లిసియా హోటల్ వారిపై కోర్టులో దావాను వేసింది.

స్వీడన్‌లో గడియారాలను తయారుచేసే బిర్‌జెర్ పెల్లాస్‌కి ప్రపంచం మొత్తంమీద పొడవు అయిన మీసాలు వున్నాయి. వీటి పొడవు 233.6 సెంటీమీటర్లు. అతను పని చేసేటప్పుడు మీసం అడ్డం రాకుండా దాన్ని దగ్గరగా చుట్టివేసుకుంటాడుట.

ఒక జపనీస్ జనరల్‌వి చాలా పొడవు అయినమీసాలు 1933 లో ఆయన మరణించిన తరువాత ఆయన మీసాలు

# దివ్యత్వంలోకి

మందిరం వివాదాలు వద్దు
మసీదుల విషాదాలు వద్దు
ఈనాడు లోకానికి కావల్సింది
"ఈశ్వర్ అల్లా తేరేనామ్"
శాంతికి భంగం కలిగిన ఈవేళ
"సబ్‌కో సన్మతి దే భగవాన్
జాతి చేతస్సులో
చైతన్యపుంజం దీపించాలి
మానవాళి రక్తనాళాల్లో
మానవత ప్రవహించాలి
కాలం గుండెలకి తగిలిన
గాయాల్ని మాన్పాలి
కాలం సుందరోషస్సుకు
తలుపుల్ని తీయాలి
కాలం నైరాశ్యాన్ని తొలగించాలి
కాలం ఆశాగీతాన్ని ఆలపించాలి
ఆధ్యాత్మిక సౌందర్యం
అంతటా నిండాలి
సంస్కార విభూతి
సర్వత్రా పండాలి
మనిషిని మేల్కొల్పే "గీత"
మనసు మనసులో ప్రమోగాలి
మానవుడు మాధవత్వంలోకి నడిచే
భాగవతుడు కావాలి
ఈ మనిషి జన్మ
సార్థకం కావాలి
ఎన్నాళ్ళకైనా
ఈ మనిషే దేవుడు కావాలి
మనకీవేళ
మందిరం వివాదాలు వద్దు
మసీదుల విషాదాలు వద్దు
మనిషి దేవుడు కావాలి
ఆ దివ్యత్వంలోకి
మనం సాగిపోవాలి
మనం సాగిపోవాలి.

— తిరునగరి

# కృష్ణాజిల్లా సహకార కేంద్ర బ్యాంకు లి.,

**నెం. 1422, మచిలీపట్నం**

కృష్ణాజిల్లాలో రైతాంగం, చేనేత పనివారు, ఉద్యోగులు, బలహీన వర్గములవారు పరపతి పొందుతున్న బృహత్తర సహకార సంస్థ.

1. డిపాజిట్లపై యితర బ్యాంకులకన్న 1/2% అధిక వడ్డీని పొందండి.
2. డిపాజిట్లపై ఇన్సూరెన్సు రక్షణ కల్పించబడినది. ఇన్సూరెన్సు కార్పొరేషన్ వారి పరిమితులకు లోబడి
3. రిటైర్ అయిన ఉద్యోగులకు, రిటైర్ కాబోయేవారికి, వ్యవసాయదారులకు, వ్యాపారస్థులకు, మరియు ఇతరులకు ఎన్నో ఆకర్షణీయమైన పథకాలు కలవు.

**మరియు ఆడిట్ క్లాసిఫికేషన్‌లో 'ఎ' క్లాసు పొందిన బ్యాంకు**

## రేపటి కోసం నేడు పొదుపు చేయండి!

సేవింగ్స్ అకౌంటుపై 5 1/2%, కరెంటు అకౌంటుపై 1/2% వడ్డీ లభించును.

**డిపాజిట్లపై అమలులో వున్న వడ్డీ రేట్లు :**

| | | |
|---|---|---|
| ఎ) | 46 రోజుల నుండి 179 రోజుల వరకు | 9% |
| బి) | 180 రోజుల నుండి 1 సం॥ము లోపు | 9 1/2% |
| సి) | 1 సం॥ నుండి 2 సం॥ లోపు | 10 1/4% |
| డి) | 2 సంవత్సరములు అంతకు పైబడి | 10 1/2% |

* కృష్ణాజిల్లాలో 54 బ్రాంచీలు కలవు. *

వివరములకు సమీపమునందుగల మా బ్రాంచి మేనేజరును సంప్రదించండి.

పిన్నమనేని వెంకటేశ్వరరావు
బి. యస్. సి.
ప్రెశిడెంట్

గారపాటి గంగారావు
డి.సి.ఆర్.యస్., ఐ.డి.ఎ.సి.ఎ (జపాన్)
జనరల్ మేనేజరు



చెడిపోకుండా వాటిని ఒక మ్యూజియంలో భద్రపరచారు. ఆస్ట్రేలియాలోని స్పెయిన్ నగరానికి చెందిన ఒక మాజీ మేయరుగారికి 'ఎనిమిది అడుగుల తొమ్మిది అంగుళాల పొడవు గల గెడ్డం వుండేది. ఆయన మరణించిన తరువాత దాన్ని ఆయననుండి వేరు చేసి, ఒక మ్యూజియంలో భద్రపరిచారు బ్రూనయ్ సుల్తాను గారు దాని గురించి విని, 50 లక్షల రూపాయలతో దాన్ని కొని, తన దేశానికి రప్పించుకున్నాడు

ఇక మీసాలలో ఎన్ని రకాలో, తుపాకీ మీసాలు హాలీవుడ్ నటుడు డాన్నీ కేయీలి ఈ రకం మీసాలు, సీతాకోక చిలుక మీసాలు, ఎడాల్ఫ్ హిట్లర్ వియీ రకం మీసాలు గుబురు మీసాలు వీటిమీద నిమ్మకాయలను నిలబెట్టవచ్చు. స్వర్గీయ బాబూ రాజేంద్రప్రసాద్ వి ఈ రకం మీసాలు.

నిజానికి మీసాలూ గెడ్డాలూ వెలిబుచ్చే భావాలు ఎన్నెన్నో ! బెర్నార్డ్ షా గెడ్డంలో తలబిరుసుతనమూ, పొగరుమోతుతనమూ కనబడగా, రవీంద్రనాథ్ టాగూర్ గెడ్డంలో శాంతమూ, గాంభీర్యమూ కనబడతాయి. ఫీడిల్ కాస్ట్రో గెడ్డంలో కార్యదీక్షా, కాఠిన్యమూ కనబడగా, అరవిందఘోష్ గెడ్డంలో వైరాగ్యమూ, తత్త్వచింతనా కనబడతాయి. వెంకట శాస్త్రిగారి మీసాలలో పాండిత్యమూ, దర్పమూ కనపడగా, మార్క్ ట్వైన్ మీసాలలో కారుణ్యమూ, హాస్యమూ కనబడతాయి. హిట్లర్ మీసాలలో కాఠిన్యమూ, కరుకుతనమూ కనబడగా, బాబూ రాజేంద్రప్రసాద్‌గారి మీసాలలో గాంభీర్యమూ, కార్యదీక్ష కనబడతాయి

అసలు మీసాలు వున్నవాళ్ళకు జలుబు కూడా తొందరగా చేయదుట నున్నగా క్షవరం చేయించుకున్న వారు ఊపిరితిత్తుల వ్యాధులతో బాధపడతారుట. పెద్ద పెద్ద మీసాలు వున్నవారికి అవే వడపోత సాధనంగా వుపయోగ పడతాయిట.

చూసేరా, మీసాలూ, గెడ్డాలలో ఎన్ని వింతలూ, విశేషాలో.



# ధర్మరక్షణ

కలిలోని కల్మషము కడతేర్చగా గాక !
కాలు పెట్టడు కద ! ఘనుడు సాయి !
మతి లోని మలినము ! మట్టుబెట్టగగాక !
మహిలోకి వచ్చునే మాన్య సాయి !
హృదయమందలి కుళ్ళు విదళించుటకుగాక
జనులముందుకు రాడు సత్యసాయి !
భవబంధముల తీర్చి భక్తి కూర్పగ గాక
అరుదెంచునే సాయి అవనియందు !

సాయి లోకాధి నాథుండు ! సద్గురుండు
కలదు కారణం బిల సాయి కదిలిరాగ !
అదియె ధర్మరక్షణమని హృదయమందు !
తెలియవలయును సుజనులు తెలివి కలిగి!

- రాయవరపు రవి

# చదువు – విద్య

-డా॥ కె. యస్. రత్నాకర్

"తరచి చదువు చదవ తర్కవాదమెగాని
పూర్ణ జ్ఞానమెపుడు పొందలేడు
చదువులన్నియు చదివి చావంగ నేటికి
చావులేని చదువు చదువవలయు"

అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

ఈనాటి చదువులన్నీ విద్యలవుతున్నాయా? అనేది పెద్ద ప్రశ్న. ఎందుకంటే విద్యకి ధ్యేయం 'సావిద్యయా విముక్తయే' దేనినుంచి విముక్తి? ఏది ముక్తి? దుఃఖమునుండి విడుదల....విద్యాధికుడైన మానవుడు 'పక్షిలాగా ఆకాశంలో ఎగురగలుగుతున్నాడు. చేపలాగా నీటిలో ఈదగలుగుతున్నాడు. కాని మనిషిలాగా బ్రతకడంలేదు' అందువలననే దుఃఖం. పశుస్వేచ్ఛని, పక్షి స్వేచ్ఛని అనుభవిస్తున్నాడు కాని నిజమైన మానవ స్వాతంత్ర్యాన్ని కోరుకోవడంలేదు.

ఏది ప్రకాశము (విత్) కలుగజేస్తుందో అది విద్య. జీవితాన్ని ప్రకాశవంతము చేయవలసిన విద్య నిరాశా నిస్పృహలతో శశిలేని నిశిని చేసింది ఈనాడు. కారణం 'అవిద్య' అవడం. 'అనిత్యాశుచి దుఃఖ అనాత్మసు నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా' (యోగదర్శనం) అనిత్యమగు దేహ సంసారములను నిత్యముగాను, అశౌచములగు ఇంద్రియములను శుచిగాను, దుఃఖ జన్యములయిన విషయ సేవలను సుఖములగాను, ఆత్మ విరుద్ధములన్ని ఆత్మగాను గ్రహించడం అవిద్య అనబడుతుంది అంటుంది దర్శనవాక్యం. అంతేకాదు మనం శాస్త్రీయం అనుకునే విద్యలన్నీ శ్రేష్ఠముకావి అపర విద్యలంటుంది ముండకోపనిషత్తు 'అపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోదర్వాణ వేదః, శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దోజ్యోతిషమితి' (ముండక). ఎందువలన అంటే ఈ విద్యలన్నీ జీవనోపాధికిగాని జీవిత పరమావధికి పనికిరావని స్వామి శ్రీ సత్యసాయి అంటారు. జీవనోపాధి ఎంత ముఖ్యమని అంటామో అంతకన్నా జీవితపరమావధి ముఖ్యం భగవాన్ బాబా 'Education is for life not for living' అంటారు. దేహాన్ని దేవాలయం చేసేది నిజమైన విద్య, దేహాన్ని మోహంలో నింపేది నేటి విద్య. స్వామి 'మోహక్షయమే మోక్షం' అంటారు. ఈ మోహక్షయాన్ని పొందాలంటే అసలు విద్యని ఆశ్రయించాలి. విద్య నిత్యసత్యమైన జ్ఞానాన్ని బోధించాలి. ఆనందమే జీవిత పరమావధి కాబట్టి.... అది జ్ఞానం వల్లనే సాధ్యం 'నాస్తి కామసమో వ్యాధి, నాస్తి మోహ సమోరిపుః నాస్తి క్రోధసమో, వహ్ని, నాస్తి జ్ఞానతం సుఖం'. ప్రస్తుత విద్యలన్నీ కామ క్రోధ మోహ జన్యమై వుండటంచేత వ్యాధులు వైరులు ఎక్కువై సుఖం లేకుండా పోతోంది. వైయక్తిక, సామాజిక పురోభివృద్ధి లక్ష్యంగా వున్నదే అసలు విద్య.

ఏనాడైతే మానవ వికాస విషయాలు లౌకిక విషయాలలో అంతర్భాగమై వుంటాయో ఆనాడే వ్యక్తి సంఘజీవి (Person) అవుతాడు అంటాడు 'Concious social Participation makes an individual to grew into personality' జూలియన్ హక్లీ.

"సద్గుణంబులు సద్బుద్ధి సత్యనిరతి
వ్యక్తి క్రమశిక్షణ కర్తవ్య పాలనములు
నేర్పునదె విద్య విద్యార్థి నేర్వవలయు
పశుగుణంబు వీడి పశుపతి కావలె
సత్యమయిన బాట సాయిమాట"

అంటారు భగవాన్ బాబా. అందరికి అర్థమయ్యేరీతిలో 'Duty, Devotion, Discipline' అంటారు.

ఈ ఆధునిక సమకాలీన సమాజంలో 'విజ్ఞానము లౌకికముగా అభివృద్ధి గావింపచేసినది సత్యమే, కాని పారలౌకికము, నిస్వార్థము, దివ్యత్వము, ఆత్మ తత్త్వములకు ప్రమాణం లేకుండా చేస్తున్నది అంటారు బాబా. భగవాన్ మానవుడు గొప్ప విద్యావంతుడగుట కంటే గుణవంతుడు కావడం అత్యవసరం.

" గొప్ప చదువులుండి గుణములేకున్నను
విలువ యేమి వాని ఫలితమదేమి ?
పంట పండని భూమి పది యెకరములులేల
కొంచెమైన చాలు మంచి భూమి " అంటారు

విద్య సంస్కారమును కలుగజేస్తుంది, సంస్కారము సామాజిక, దేశ సంస్కృతిని విశదపరుస్తుంది. ఈ గుణములంటే స్థూలంగా ఏమిటి ? ' విద్యార్థులు ఈనాడు విద్యతోపాటు దేశముయొక్క విశ్వాసములు దేశ కళ్యాణమును దృష్టియందుంచుకోవాలి ' అని వివరిస్తారు శ్రీ సత్యసాయి. 'సర్వేజనా సుఖినోభవంతు' 'లోకాస్సమస్తా సుఖినో భవంతు' అని త్రికరణశుద్ధిగా ప్రార్థించాలి అంటారు భగవాన్. అప్పుడు విద్యాధికుడైన ప్రతి వ్యక్తి స్వామి అన్నట్లుగా 'End of Education is Character' విద్య ధ్యేయం గుణవంతుణ్ణి చేయడమే.

విద్యావంతులను గుణవంతులను చేసే ప్రయత్నమే భగవాన్ బాబావారు ప్రశాంతి నిలయంలోని కె జి. (కిండర్ గార్డెన్) నుండి PG (Postgraduate) దాకా నడిచే విద్యాలయాల మాల. అన్ని గురుకులం రీతిలోనే. తెల్లవారుఝామున సుప్రభాతంతో లేచిన విద్యార్థి అనంతరం కొంతసేపు ఆ రోజు పాఠాలు చదివి విద్యాలయానికి వెళ్తాడు. సర్వమత సామరస్యాన్ని, లోక కళ్యాణాన్ని కాంక్షించే ప్రార్థనతో పాఠశాల అయినా, విశ్వవిద్యాలయమైనా ఆ రోజు కార్యక్రమాన్ని ఆరంభిస్తుంది. ఆ తర్వాత ఆ కోర్సు సబ్జక్టుతోపాటు నైతిక ఆధ్యాత్మిక విషయాలపై ప్రసంగాలు, విద్యార్థులచే నిర్వహిస్తారు. కొన్ని కొన్ని నిలయానికి విచ్చేసిన ప్రముఖులచే ఇప్పిస్తారు. సాయం సమయంలో శరీర వ్యాయామం, ఆటలు. వెనువెంటనే హాస్టల్లో సాయం సమయ ప్రార్థన, పుస్తక పఠన. ఎక్కువసేపు రాత్రి మేలుకొని చదవడం సాగనివ్వరక్కడ. Early to bed, Early to rise' సిద్ధాంతం. అందుకనే వారు 'Healthy and wise' దైవిక కార్యక్రమాలన్నీ హాస్టలైతేనేమి, Kitchen లో నైతేనేమి అందరూ కలిసి అందరికోసం పనిజేయడం ఒక యోగం ఇక్కడ. అన్నిటికన్నా ముఖ్యం వారి మార్కులు కేవలం సంవత్సరాంతం జరిగే వ్రాత పరీక్షల్లో మార్కులు కావు. వారి నడవడి, వారి సభ్యత, వారి దైవచింతన అన్నీ వారి విజయంలో భాగాలే. అందుచే సత్యసాయి విద్యార్థి, సత్య ధర్మ శాంతి ప్రేమల పెన్నిధి దూరం నించే ఆ విద్యార్థిని గుర్తుపట్టవచ్చు. ఉదాహరణకు : ఒకనాడు నిలయంలోని ప్రార్థనామందిరంలో ఒక విదేశీయుడు సిగిరెట్టు కాల్చాలని ప్రయత్నిస్తాడు. అందుకు సాయి విద్యార్థి వినయంతో ' అయ్యా ! ఇక్కడ సిగిరెట్టు లాంటివి కాల్చకూడదు అంటాడు. ఆ మహనీయుడు ' నేను కాలుస్తా ఏం చేస్తావంటాడు' తిరిగి ఆ విద్యార్థి నిర్మలంగా సవినయంతో 'మీరు కాల్చను అనేంతవరకు మీకు నమస్కారం చేస్తూనే వుంటాను అంటాడు. ఇంతకన్నా విన్నవించుకోదగిన పరిణామం ఏముంటుంది.

'Education is manifestation of perfection' అన్నారు వివేకానంద స్వామి. ఉదాహరణం ఈ విషయాన్ని అర్థమయ్యే రీతిలో చెబుతూ ' భూమిలో జలం వుంది. పైన ఉన్న మట్టిని తొలగిస్తే ఆ నీరు

ఫోన్ : 83 - 249



# ది రాయవరం వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్ సొసైటి లిమిటెడ్

**రాయవరం,** గూడూరు మండలం, కృష్ణాజిల్లా

మా సంఘమునందు 80 నెం. జరీగడి, జరీపేటు, T. D. జరీపాట్నా పేటు, ఫ్యాన్సీ పేటుచీరలు, 60 నెం. డార్కు స్పెషల్ పేటుచీరలు పక్కారంగులతో నాణ్యముగా తయారగును.

**శ్రీరాములు**
మేనేజరు

**ఆకురాతి లక్ష్మయ్య**
ప్రెసిడెంటు

డైరెక్టర్సు

నందం సత్యనారాయణ
తమ్మిశెట్టి పెద్దిరాజులస్వామి
మునగాల మల్లికార్జునరావు

పోలిశెట్టి వేణుగోపాలరావు
గుత్తికొండ వెంకటేశ్వరరావు
కాగితాల ధనలక్ష్మి

నందం కనకదుర్గ

మనకి కనిపిస్తుంది. ఈ మానవునిలోని ఆత్మశక్తి బహిర్గతం చేసేదే విద్య. ఈ గమ్యాన్ని ముందుంచు కొనే ఎన్నో సాయి విద్యాలయాలు భారతదేశంలోని వివిధ ప్రదేశాలలో, విదేశాలలో వెలిశాయి. ఈ సాయి విద్యా ఉద్యమం, సత్య ధర్మ శాంతి ప్రేమ, అహింసా జ్యోతులని వెలిగించి దేశాన్ని, ప్రపంచాన్ని ఆవహించిన అజ్ఞాన తిమిరాన్ని పారద్రోలడానికి బయల్దేరింది. ఇది సమస్త మానవాళిని జాగృతం చేస్తుంది, పునీతం చేస్తుంది. అపుడే మానవునికినిజమైన స్వాతంత్ర్యము.

" విశ్వ శాంతిని చేకూర్చు విధము నేర్పి
సంకుచిత భావములెల్ల సమయచేసి
ఐకమత్యము సహజీవనాదికము
సమత నేర్పుటయే కాదె సరస విద్య

\- బాబా

# మేధావిగా మారిన మందమతి

ఏలేశ్వరపురంలో ఏలేశ్వరోపాధ్యాయుడు అనే పండితుని కుమార్తె నాచి. ఆమెకు చిన్నతనంలోనే వివాహమైన కొలది కాలానికే భర్త మరణించాడు. ఏకైకపుత్రిక కావడంవల్ల తండ్రి ఈమె మనస్సుకు ఊరట కలిగించి ఒక సరియైన దారిలో పెట్టేందుకు తన శిష్యులతోపాటు ఈమెకూ అన్ని శాస్త్రాలు బోధించాలి అనుకున్నాడు.

కాని ఈమె మందమతి ఎంత చెప్పినా ఇటువంటి వారికి చదువు వంటబట్టడంలేదని తండ్రి ఆలోచించి తెలివితేటలు పెరిగేటందుకు ఏదైనా మందు వుందేమోనని గ్రంథాలన్నీ తిరగవేయసాగాడు. ఒక తీగరసము త్రాగితే తెలివితేటలు పెరుగుతాయని వున్నట్లు ఒక వైద్య గ్రంథములో ఆయన చూశాడు. ఆ తీగెను తెప్పించి తన కూతురులోపాటు శిష్యులకుకూడా రసము ఇచ్చాడు ఏలేశ్వరోపాధ్యాయుడు. అందరికి బుద్ధి, తెలివితేటలలో అభివృద్ధి కనిపించసాగింది.

ఈ తీగరసము ఎక్కువగా త్రాగితే తెలివితేటలు చాలా ఎక్కువగా పెరుగుతాయని నాచి ఆలోచించి ఎక్కువగా త్రాగేసింది. మోతాదును మించి మందు సేవిస్తే వికటించదా! నాచి శరీరమంతా నిప్పులలో వున్నట్లు భగభగ మండిపోసాగింది. ఆ బాధ భరించలేక ఆమె నూతిలో దూకివేసింది. ఆ సమయమున తండ్రి ఇంటివద్ద లేదు.

ఇంటికి వచ్చిన తండ్రి కూతురు కనిపించలేదని వెతికి చివరికి ఆమె మూలుగువల్ల నూతిలో వున్నట్లు తెలుసుకుని బయటికి తీసి రక్షించాడు. అప్పటినుండి నాచి బుద్ధి తెలివితేటలు విపరీతంగా పెరిగి తక్కువ కాలంలో తన తండ్రివద్ద అనేక శాస్త్రవిషయాలు నేర్చుకున్నది. ఆమెకు కవిత్వం వ్రాయడంకూడా అలవడింది.

వయసు మళ్ళిన తరువాత ఆమె తీర్థయాత్రలుచేస్తూ దారిలో పండితులతో వాదనలుచేస్తూ వారిని జయించి అనేక బహుమతులుకూడా పొందింది. పుత్రులు లేక పోయినా కుమార్తె ఎంతో కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకున్నందుకు ఆమె తండ్రి ఎంతగానో ఆనందించి, తనకు పుత్రులు లేరనే బాధ మరచాడు. నాచి జీవితంలో మలుపుతెచ్చి మేధావిగా మార్చిన సంఘటన నిజంగా ఆశ్చర్యకరమైనది కదా!

\- ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి

# గృహమే కదా స్వర్గసీమ

-డి. ఎస్. ఆర్. ఆంజనేయులు

ఒక కళాశాల వార్షికోత్సవానికి ఒక ప్రముఖ కళాకారుణ్ణి దుర్యోధన ఏకపాత్రాభినయం చేయమని ఆహ్వానించారు. సభానంతరం సాంస్కృతిక కార్యక్రమాలను ప్రారంభించారు. ఫలానావారు దుర్యోధనుడుగా అభినయిస్తారు అని ప్రకటించారు, తెర తొలగింది. సైడ్ వింగ్‌లోనుంచి దుర్యోధనుడు ప్రవేశించాడు. ఆయన సంభాషణలు చెబుతున్నంతసేపూ కుర్రవాళ్ళు గేలిచేయడం ప్రారంభించారు. నానా హంగామా, కేకలు అరుపుల నడుమ దుర్యోధన పాత్రాభినయం పూర్తి అయింది. ఆయన గ్రీన్ రూమ్‌లోకి వచ్చి తన డ్రస్‌ను మార్చుకుంటున్నాడు కొందరు విద్యార్థులు ఉత్సాహం చంపుకోలేక గ్రీన్ రూమ్‌లోకి వచ్చి ఆయన వంక తదేక దీక్షతో చూస్తున్నారు. చొక్కా మీద చొక్కా చొక్కా మీద చొక్కా అన్నీ విప్పేస్తున్నాడు. ముఖాన రంగు కడుక్కున్నాడు. కొందరు కుర్రాళ్ళు 'ఒరే! ముసలోడురా!' అని ఎగతాళిగా మాట్లాడారు ఈ మాటలు విన్న మిగతా వారంతా ఫక్కున నవ్వారు. పాపం ఆ పెద్దమనిషి హృదయం చివుక్కుమంది ... 'అవును బాబు! ముసలివాణ్ణే .... మీరంతా నాలోకి రావల్సినవాళ్ళే గాని నేను మీలోకి రాలేను కదా?' అన్నాడు ఆ వృద్ధ కళాకారుడు ఈ మాటలు అర్థమయినవాళ్ళు తలవంచుకొని వెళ్ళిపోయారు, లేనివాళ్ళు వెకిలిగా నవ్వారు.

చూసారా! వార్థక్యం అంటే సమాజంలో ఎంత చులకన భావన వుందో! అందుకే అన్నారు.

బాల్యం బంగారపు గని
యవ్వనం పొంగే ఝరి
వార్థక్యం ముసిరే నిశి
కాక మరేముంది జీవితం?

ఈ సత్యం తెలిసినపుడు యిది గుర్తెరిగినపుడు వయసు పట్ల మిడిసిపాటు వదలి పెద్దల్ని గౌరవించే మనస్తత్వం అలవడుతుంది. అసలు వృద్ధాప్యం అనేది ఒక శాపం కాదు .... అది జీవితంలో తప్పుకోలేని సహజ పరిణామం.

అయితే 'మాయ' అనే పొర ఎప్పటికప్పుడు మనల్ని ఆవరించి వుండటంవల్ల సత్యం కూడా అబద్ధంగా కనబడుతుంది. ఇందుకు భారతంలోని యక్షప్రశ్నల్లో ధర్మజుడు చెప్పిన జవాబే తార్కాణం.

తమ్ముళ్ళందరినీ బ్రతికించుకోవాలని తపిస్తున్న ధర్మరాజును అనేక ప్రశ్నలతో వేధించాడు కదా! అయితే ఆయనమాత్రం చాలా ఓర్మితో జవాబులిచ్చి విజయం సాధించాడు అందులో ముఖ్యమైంది –

'ప్రపంచంలో అత్యాశ్చర్యకరమైన విషయమేమిటి?' అన్నది.

"ఏముంది .... మృత్యువు! ఒక వ్యక్తి మరణిస్తే బంధువులంతా నానాశోకాలు పెట్టి స్మశాన వాటికదాకా సాగనంపి వైరాగ్యం పాటిస్తారు కానీ అంత్యక్రియలు పూర్తయిన తర్వాత ఎవరికి వారు ఈ మరణం మనకు రాదులే అన్నట్లు ప్రవర్తిస్తుంటారు ఇంతకు మించిన ఆశ్చర్యకరమైన సంగతి ప్రపంచంలో మరేముంది" అని బదులిచ్చాడు ధర్మజుడు నిజమేకదా! ఈ యదార్థం తెలియనిదెవరికి? అందరికీ తెలుసు ... అయినా మానవ మస్తిష్కం మారలేకపోతున్నది, ప్రవర్తన మార్చుకోలేకపోతున్నాడు అందుకే వర్తమానం శాశ్వతమనే

శ్రీశ్రీ

అంధ విశ్వాసంతో కొట్టుకుపోతూ భావి జీవితం గురించి ఆలోచన చేయలేకపోతున్నాడు. అందుకే ఈనాడు పచ్చని సంసారాలను మోడువారిన వృక్షాలుగా తయారవుతున్నాయి.

మన భారతీయ జీవన విధానంలో పెద్దలకు ఎంతో గణనీయమైన స్థానం వుంది! 'యత్ర నార్యస్తు పూజ్యతే' అన్నట్లుగానే వయోవృద్ధులను గౌరవించటం, వారిపట్ల భక్తి ప్రపత్తులతో వ్యవహరించడం అనాదిగా వస్తున్న సంప్రదాయం అట్లాగే కుటుంబంలో అందరూ కలసి మెలసి సహజీవనం చేయటం, సుఖసంతోషాలు, కష్టనష్టాలు సమానంగా పంచుకోవటం ఎప్పటినుంచో వస్తున్నది.

అందుకే భారతీయ కుటుంబ జీవనంపట్ల విదేశీయులు కూడా ఎంతో ఆసక్తి చూపుతున్నారు. మనల్ని చూసే చాలా దేశాలు విడిపోయిన తమ సంసారాలను కలుపుకోవటానికి ప్రయత్నాలు చేస్తున్నాయి

కానీ మన సమాజంలో పెచ్చు పెరిగిన కొన్ని అవాస్తవిక ధోరణులవల్ల కుటుంబాలు విడిపడి పెద్దల బ్రతుకు శరణాలయాల పాలౌతున్నది. ఏనాడూ లేనిది ఇప్పుడు మన దేశంలోను "ఏజ్‌డ్ హోమ్స్" వెలుస్తున్నాయి. తద్వారా కుటుంబానికి పెద్దదిక్కు కరువై పిన్నలు ఏదో తెలియని వెలితిని అనుభవిస్తున్నారు. పరిణతి చెందిన మనస్సులు కరువై అనేక కుటుంబాలు తగాదాలకు నిలయమయ్యాయి తగిన సలహా, సంప్రదింపులకు పెద్దలు లేక ఎందరో పలు బాధలకు గురౌతున్నారు.

'రెండవ బాల్యమునుమ్మ ముదిమి' అని వృద్ధాప్యాన్ని వర్ణించారు తిరుపతి వేంకట కవులు. అందుకే షష్టిపూర్తి కాగానే బాల్యం నుంచి ప్రారంభించి అన్ని కార్యక్రమాలను శాస్త్రోక్తంగా జరుపుకునే ఆచారం వచ్చింది

అంతర్జాతీయ కుటుంబ సంవత్సరం జరుపుకుంటున్న ఈ తరుణంలో మరొక్కమారు భారతీయ కుటుంబ సుగంధ పరిమళాలను విశ్వమంతా వ్యాప్తి చేయవల్సిన బాధ్యత మనందరిమీదా వుంది. అందుకు కావల్సింది.... ఎవరికి వారు తమలోని అల్పగుణాలను విసర్జించాలి. విశాల హృదయులై కుటుంబ సుఖాన్ని, సమాజ హితవును దేశ సమైక్యతను పరిరక్షించే విధంగా తమ ప్రవర్తన మార్చుకోవాలి .... ప్రతి ఇంటి నుంచి ప్రారంభమైన ఈ కార్యం వాడ వాడలా విస్తరించాలి.

ఒకనాడు గ్రామాల్లో కుల వర్ణాలకు అతీతంగా అక్క, అన్న, మామ, బావ, ఒదిన, మరదలు అనే వరసలతో పల్లె అంతా ఒక కుటుంబంగా విరాజిల్లింది. అలాగే సమిష్ఠి కుటుంబాలు ఆనందోత్సాహాలతో వెల్లివిరిసాయి కారణాలు ఏవైనా ఈ వాతావరణానికి దూరమైన మన జీవన వ్యవస్థ మళ్ళీ చేరువకు రావాలి. చింతలు లేని కుటుంబాలుగా అందరూ సుఖ సంతోషాలతో వర్థిల్లాలి

తల్లి దండ్రి యన్న దమ్ము లాత్మసఖులు
నెలమి బంధు భృత్యులెల్ల జనులు
గలిగి వర్థిల్లంగ ఘనతతో నుండరా

అన్న వేమన కాంక్షను మనమంతా నిజం చేసేందుకు యత్నం చేద్దాం ౦౦౦

'గొడ్డలి దెబ్బలు తిన్న అరణ్యం చిగిరించవచ్చు కాని, కటు వచనాలతో దెబ్బతిన్న హృదయము కోలుకోదు. శరీరంలో నాటిన తీవ్ర శరాలను పెరికివేయవచ్చును కాని; పరుష భాషణలు మాత్రం గుండెలో నుండి పైకి తియ్యలేము.'

— విదురనీతి

# భారతంలో రాజనీతి

-వి. వేంకటేశ్వర్లు

భారత వంశమున జన్మించిన కౌరవ పాండవుల ఇతివృత్తమును వివరించు గ్రంథమగుటచేత భారతమనే పేరుతో విరాజిల్లుచున్నది. ఈ మహా కావ్యమునందు రాజ సేవాధర్మములు మిక్కుటముగా బోధింపబడినవి కేవలం రాజులకే గాక, ప్రజలు కూడా రాజు పట్ల ఏ రీతిగా నడచుకోవలెనో వివరింపబడినవి.

" రాజు ప్రజలకు నాత్మగా గ్రాలుచున్న
ప్రజలు పతికి శరీరమై గ్రాలుచుంద్రు
గాన నిర్వైరనోన్యోన్య సంధాన కలన
నున్న నుభయుల కానందముండు ధాత్రి "

" రాష్ట్రమంతయుఁ దావిమర్శనముఁ జేసి
శాఖలెన్నియో పెంచి రక్షణముఁ జేసి
యన్నిటన్ రాజు కన్నిడి యున్న - నవని
ప్రజలు భయభక్తియుక్తులై వరలు చుంద్రు "

" భూతములు మేఘము నాశ్రయంబున రహించు
దరుల యాశ్రయంబున బక్షితతి సుఖించు
ప్రజలు రాజు నాశ్రయమున బ్రతుకుచుందు
రాశ్రయము "పెనుప్రాపు" సర్వార్థగతికి "

" యథా రాజా తథా ప్రజా " అను ఆర్యోక్తిని గ్రహించి సర్వ జన సమ్మతముగా, జగద్ధితముగాపరిపాలించుట రాజుల ప్రధాన కర్తవ్యము. శిష్టజన రక్షణ, దుష్టజన శిక్షణములే వారి రెండు నేత్రములు. దీనజన పోషణ, శరణాగత త్రాణములే వారి ముంజేతి కంకణములు. ప్రజానురాగమే వారికి పెట్టని కోట

" ఉత్సవేషుచ సర్వేషు పితేవ పరితుష్యతి
వ్యసనేషుచ జనేషు భృశం భవతి దుఃఖితః "

యజ్ఞయాగములు, వేదాధ్యయనము, దానధర్మములు చేయుచూ ప్రజలను రంజింపజేయుట రాజుల ప్రధాన ధర్మము. అన్నింటికీ మించి సమరమున పరాఙ్ముఖులు గాకుండుట చాలా ముఖ్యము ఇట్టి ధర్మములను తప్పించి తిరుగువారు రాజవిరుదంబునకు అనర్హులని భారతంలో తెలుపబడినది.

## దండనీతి

రాజులకు అత్యంతావశ్యకములైన సామదాన భేద దండోపాయములలో ముఖ్యంగా దండనీతి వారికి సహజంగా ఉగ్గుపాలతో అలవడే మొదటి విద్య.

" తల్లి యన్నను విభునకు దండనీతి
తండ్రియన్నను నృపునకు దండనీతి
దైవమన్న రాష్ట్రపతికి దండనీతి
ధాత్రి సర్వస్వ మారయ దండనీతి "

" అదండ్యాన్ దండయన్ రాజా!
దండ్యాంశ్చా దండయన్ సదా
అయశో మహదాప్నోతి
నరకంచాధి గచ్ఛతి "

దండింపదగిన వారిని గూర్చి, దండింపదగని వారిని గూర్చి ఈవిధంగా రాజుపట్ల తెల్పబడుచున్నది. కాబట్టి న్యాయాన్యాయములను విమర్శించి ధర్మసమ్మతముగా రాజు శిక్ష విధింపవలసినదే!

మహాభారత యుద్ధములో జరిగిన హింసకు తానే కారణమని పరితపించాడు ధర్మరాజు అప్పుడర్జునుడు అతనికి రాజదండ విధానము నెరింగించుతూ, "అగ్రజా! యమదండ రాజదండ భయముచే దురాత్ములు పాపమునకు వెనుకంజ వేయుదురు. దండభయము చేతనే

ప్రజలు రక్షింపబడియున్నారు. మాటలచే బ్రాహ్మణులను, బాహుబలముచే క్షత్రియులను, ధనముచే వైశ్యులను, దాస్యముచే శూద్రులను దండింపవలయును. దండంబు లేకున్న విప్రుడు వేదము చదువడు, పశువులు దున్నవు, సేవకులు శ్రద్ధతో మెలగరు. మంచిచెడ్డలను కనిపెట్టి దండముచే ప్రజలనేలకున్న భూపతికి ఆ పాపము సంక్రమించును. దుష్టహింస హింస కానేరదు. శత్రుసంహారమున పాపము రాదు. "హన్తి నియమాత్ వధ్యాం అవధ్యేషున కుప్యతి '' కావున, అగ్రజా! రాజ్యము నేలుకొమ్ము''అని కోరాడు.

## నారదుడు బోధించిన రాజనీతి

సభాపర్వములో రాజనీతి కార్యక్రమములను గూర్చి నారదుడు ధర్మజుని అడుగుతూ, ''రాజా! గూఢాలోచనము రాజులకు విజయము జేకూర్చు కదా! అట్టి రహస్యము నీ మూలమున గుప్తముగా ఉంచబడినదా?" అని ప్రశ్నించాడు. ''చారైః పశ్యంతి రాజానః చక్షుర్భ్యాం ఇతరే జనాః '' అన్నారు ''రాజానః చారు చక్షుషః" అని కూడా తెలుపబడినది కనుక రాజులు చారులద్వారా విషయసేకరణము, గూఢాలోచనము అవశ్యము పాటించి పరిపాలన సాగింపవలెను. నారదుడు మరికొన్ని రాజధర్మాలను యుధిష్ఠిరునకు ఉపదేశిస్తూ, ''అధిపా! సేవకులలో వారివారి శక్తి కొలది ఉత్తమ మధ్యమాధముల నేర్పరచి వారల కుచితమగు స్థానముల నిచ్చుచుంటివా? వారికి కాలము తప్పక జీతముల నొసంగుచుంటివా? నరేంద్రోత్తమా! యుద్ధమునకు వెనుకంజ వేయక పోరాడిన నీ భటులను బహుమానములచే సత్కరించి అన్నవస్త్రాదుల నిచ్చి పోషించుచుంటివా? నీకై ప్రాణములను వదలిన వీరభటుల సంతానమును పోషించుచుంటివా?

"ప్రజానాం వినయా ధానాత్ రక్షణాత్
భరణాదపి
సపితా పితారస్తా సాం । కేవలం
జన్మ హేతవః"

దుర్బలులను, శరణన్న వారిని పోషించు చుంటివా? నీ వేగులవాండ్రు శత్రు రాష్ట్రములో సంచరింతురా? స్త్రీలు లెస్సగ కాపాడబడుచున్నారు కదా! మహీపాలా! నాస్తిక్యము ప్రమాదము. ఆలస్యము, అనృతము, క్రోధము, దీర్ఘచింత- ఇట్టివి రాజదోషములు. కావున వీనిని పరిహరింతువే?' అని ప్రశ్న రూపమున హితబోధ గావింప, యుధిష్ఠిరుడు నారదుని పాదపద్మములకు సవినయ శ్రద్ధా భక్తి భావమున మ్రొక్కి 'మహాత్మా! నీ కటాక్షము వలన సకల ధర్మముల నెఱింగితి నా యథాశక్తి న్యాయపథంబును వదలక మహాత్ముల చరితలందు లక్ష్యముంచి రాజ్యమేలుచున్న వాడను' అని సమాధాన మిచ్చాడు.

## ధర్మజునకు భీష్ముడు తెలిపిన రాజనీతి

గుఱ్ఱమును పగ్గమువలె, ఏనుగును అంకుశము వలె లోకమును రాజధర్మమే శాసించును శాంతమన్నింటి యందు జూపఁదగదు. మావటివాడు ఏనుగు తలపై కెక్కఁజాలుటకు దాని శాంతమే కదా కారణం!

మితిమీరిన మృదుత్వముగాని, తీక్ష్ణతగాని లేక రాజు వసంతార్కునివోలె శీతోష్ణగతులను సమంగా వర్తింపవలెను

"తాలిమి శాంతియు దాంతియు
శీలంబున్ క్షాంతి గుణముఁ జెందిన ధరణీ
పాలుండిహ పరములలో
మేలొందున్ జిరసుఖంబు నేకొను రీతిన్"

రాజులు భృత్యులతో ఎప్పుడును పరిహాసమాడరాదు. భృత్యులకు చనువిచ్చిన తన్ను గౌరవింపకుండుటయే గాక, విజకృత్యంబు లందు అనాదరము చూపుదురు; రహస్యములను వెల్లడింతురు; తగని కోర్కెలను కోరుదురు; లంచము పుచ్చుకొని వంచన చేసి కార్యములను చెఱతురు.

"సేవకుల తోడ హాస్యంబు సల్పదెపుడు
దాన భూవల్లభున కవమానమగును
ప్రజల గాచుట ప్రథమ కర్తవ్యమరయ
నన్నిటిని విమర్శించుట మిన్నయెన్న"

"ముందు వెనుకలు చూడగా బోక చేయు
కార్యముల యందు నాపదల్ గల్గుచుండు
గార్యమెల్ల విమర్శింప గలుగువాని
స్వయముగ వరించు గుణమెంచి సంపదాళి"

'సహసా విదధీత నక్రియామ్ । అవివేకః
పరమాపదాం పదం
వృణుతేహి విమృశ్య కారిణం । గుణ లుబ్ధాః
స్వయమేవ సంపదః"

రాజు ఎట్టివానినైనను కడు నమ్మియుండుట తగదు. బొత్తిగా నమ్మకుండుటయు తగదు. నమ్మి నమ్మక వరించవలెను.

'నమ్మకము లేక యుండుట, నమ్మియుంట
రెండు నెవ్వేళ దగనివి పృథ్వీపతికి
మంచి సెడ్డల దా విమర్శించుకొనెడు
నేర్పు గాంచుట భద్రంబు నేతకెపుడు"

పుట్టలోనున్న పురుగులను పాములు మింగునట్లు-విరక్తిలేని బ్రాహ్మణుని, శాంతిపరుడగు భూవిభుని ప్రజలు మింగుదురు. తన రాజ్యాంగములకు ప్రతికూలు డగుచో మిత్రునైన, గురునైన చంపవలెను. రాజపుత్రుడనను గర్వాతిశయముతో పురబాలకులను సరయూ నదిలోనికి త్రోయుచుండుట తెలిసి – సగర చక్రవర్తి తన కుమారుడగు నసమంచిసుని పరిత్యజించాడు ఇట్లు చేయుట ప్రజా సౌఖ్యముననే కదా! కనుక, సత్య సంరక్షణము భూపతికి ముఖ్యము, ప్రయత్నము లేని వాడు నిర్విష సర్పము వలె ఎల్లరకూ వశుడగును. యత్నహీనుడైన బలవంతుని కంటె ప్రయత్నవంతు డగు దుర్బలుడే కార్యసిద్ధి నొందును.

## ధృతరాష్ట్రుడు ధర్మజునకు చెప్పిన రాజనీతి

'ధర్మజా! పితృ పితామహ క్రమాగతుల హితుల పుణ్యవంతుల పవిత్రుల మంత్రులుగా చేసి రాజ్యమును పాలింపుము. ఎన్నిక గన్న వారల నియోగింపుము. కులీనులగు వారలే ఆహార విహార శయ్యా సమయము లందు నీకు రక్షకులై యుండవలెను. పెక్కుర గూడి ఆలోచన చేయరాదు అరణ్యమందు గాని, గృహమందు గాని మంత్రాలోచన చేయవలెను. రాత్రి మంత్రము చేయరాదు. నీ కార్యార్థ నిర్ణయములన్నియు నపర రాత్రము నందు గావింపబడ చుండవలెను. మధ్యాహ్నము, మధ్యరాత్రి నీకు విశ్రాంతి సమయము. ఆత్మ రంధ్రము లించుకైనను ఒరులకు తెలియనీయ కూడదు; ఇతరుల రంధ్రంబుల నారయవలయును'

"ఓ కౌంతేయా! నిజబలము పరబల మెఱిగి సంచరించవలెను. అవసరముంటే శత్రునితో సంధి గావించుట ముఖ్యము. రాజునకు నిజ రాజ్య రక్షణ మొనర్చుకొనుటయే ప్రధాన దృష్టిగా ఉండవలెను బల హీనులపై దండెత్తి వధింపరాదు. రాజగువాడు మూల బలమును, మిత్రబలమును, ఆటవిక బలమును, భృతక బలమును, శ్రేణి బలమును సంపాదించవలెను. రాజులకు ఆపదలు బహు విధములుగా వచ్చుచుండును. వాటిని ఉపాయములచే నివర్తింపజేసుకొనుచుండవలెను"

'నరవరా! నదీతనూజుడు, నారదుడు మున్నగు వారు నీకనేక రాజధర్మములు తెల్పిరి. నేను కూడా నీ యందమితానురాగము గలవాడనగుట చేత కొన్ని నీ వెఱుగ చెప్పితిని ఉభయలోక ప్రాప్తికై నే చెప్పిన చొప్పున వర్తింపుము' అని బోధించాడు.

ఈనాటి పాలకులు, ప్రజా ప్రతినిధులు భారతంలోని రాజనీతిని గుర్తించి వర్తించటం శ్రేయస్కరం

(కీ॥ శే॥ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు (రాసురాట్కవి) గారి 'ప్రసన్న' భారతం ఆధారంగా)

# కంప్యూటర్ లీలలు

- కె. ఆర్. కె. మోహన్

చరిత్ర చదువుకున్న వారందరికీ రాతియుగం, లోహయుగం, తామ్రయుగం, స్వర్ణయుగంవంటివి తెలుసు. ఈ ఆధునిక యుగాన్ని కంప్యూటర్ యుగంగా పేర్కొన వచ్చు. కనిపించని దానివి గురించి 'ఇందుగల డందు లేడను సందేహము వలదు' అని అన్నారు కాని కనిపించే కంప్యూటర్ కాలు పెట్టని రంగమంటూ ఏదీ ఉన్నట్లని పించడం లేదు. యాంత్రిక విప్లవం వచ్చిన తర్వాత మనుష్యులు చేయలేని అనేక కార్యాలకు యంత్రాల్ని వినియోగించడం, మనం చేయగల ఎన్నో పనులను మరెంతో సుకరంగా చేయడానికి ఉపయోగించడం పరిపాటి అయింది. ఇటీవలి దశాబ్దాలలో ఎలక్ట్రానిక్ విప్లవం వచ్చిన తర్వాత అత్యద్భుతమైన కంప్యూటర్లు రూపొంది అతి క్లిష్ట కార్యాలను అతి సులువుగా నిర్వహిస్తూ మనిషికి మనిషిని మించిన తోడుగా ఉంటున్నాయి.

మనం ఫలానా సమయానికి నిద్ర లేవాలనుకున్నపుడు అలారం పెట్టుకుంటాం. సుప్రభాతంతో నిద్ర లేవ దలచుకుంటే కాసెట్‌ని టేప్‌రికార్డరులో ఉంచేసి టైం సెట్ చేస్తే ఆ టైంకి అది ఆటోమేటిక్‌గా స్విచ్ ఆన్ చేసుకుని ఉదయ గానాన్ని వినిపించే టేప్‌రికార్డర్లు ఏనాడో వచ్చాయి. ఇటీవల ఒక అమెరికన్ కంపెనీ ఎన్నో ఇంటి వ్యవహారాలను చక్కబెట్టే ఒక చిన్న సైజు మైక్రో కంప్యూటర్‌ని నిర్మించింది. దీని రిమోట్ కంట్రోల్‌ని హాయిగా జేబులో వేసుకొని తిరగవచ్చు. ప్రత్యేకించిన నంబర్ కోడ్‌లను ఉపయోగించడంద్వారా కూర్చున్న చోటునుంచి కదలకుండా లైట్లను వేయడం, ఆర్పడం, ఎయిర్ కండీషనర్లను సక్రమంగా పని చేయించడం వంటి ఎన్నో ఇంటి పనులను దీని ద్వారా చేయించవచ్చు. దీనికి ' హోం మైండర్ ' అని పేరు పెట్టారు ఆ కంపెనీవారు. ఇంతేకాదు మనం ఇల్లు విడిచి బయటకు వెళ్ళినా కూడా ఇంటి ముందు తచ్చాడే దొంగలను ఓ కంట కనిపెట్టవచ్చు. సరే .... కర్మ కాలి ఏదో క్లిష్టమైన ఆపరేషన్ చేయవలసిన రోగాలు వస్తే 'ఇక్కడే మేమున్నాం' అంటూ ప్రత్యక్షమవు తున్నాయి కంప్యూటర్లు. ఈ ఆపరేషన్‌లను కూడా రిమోట్ కంట్రోల్ మూలంగా సాధ్యమవుతోంది. కొద్ది కాలం క్రిందట లండన్ యూనివర్శిటీకి చెందిన ప్రొఫెసర్ మెరిడిత్ స్ప్రింగ్, ఆయన బృందం ఒక చిన్న టాంగ్స్ (పటకారు) వంటి పరికరాన్ని రూపొం దించారు. దీనిలోని ప్రధాన భాగాలు బొటన వ్రేలుని చూపుడు వ్రేలుని పోలిఉంటాయి. సర్జన్ రిమోట్ కంట్రోల్ ద్వారా వీటిని నడిపిస్తుంటే ఇవి మనిషి పట్టు కున్నట్లు పరికరాలను పట్టుకుని అతి సున్నితమైన ఆపరేషన్లు కూడా అమిత ప్రజ్ఞావంతులైన సర్జన్లకంటే మిన్నగా, వారు మామూలుగా తీసుకునే సమయంకంటే చాలా తక్కువ సమయంలో చేయగలుగుతాయి. క్లోజ్‌డ్ సర్క్యూట్ టి వి. ద్వారా టి వి తెరపై ఆపరేషన్ ఎలా జరుగుతుందో గమనించవచ్చు. ఈ పద్ధతి ద్వారా ప్రపంచ ప్రసిద్ధ శస్త్ర వైద్య నిపుణులు ప్రపంచంలో ఏ మూలనున్న పేషెంటుకైనా తామున్న చోటునుంచి ఆపరేషన్ చేయగల అవకాశం ఏర్పడింది.

పోతే ఏ రోగాలూ, రొష్టులూ లేకపోయినా, ఇంట్లో వారందరూ కమ్మని పాలు కడుపార త్రాగి కూర్చోవాలను కోవడం సహజం. మంచి పాడి పశువు వుంటేనే మనకి

చిక్కని ఆరోగ్యకరమైన పాలు దొరికేవి. కమ్మని పాల దిగుబడిని ఎక్కువ చేయడం మాకు తెలిసిన విద్యయే అంటున్నాయి ఆధునిక కంప్యూటర్లు. మనం మామూలుగా పశువులకింత మంచి మేత వేస్తే చాలు పుష్కలంగా పాలిస్తాయి. అని అనుకొంటుంటాం కాని ఇది సరికాదు. మనుష్యులలో ఆహారం విషయంలో విభిన్న అభిరుచులు ఉన్నట్లే పశువులకీ ఇష్టాఇష్టాలు ఉంటాయిట. అన్నిటికీ ఒకేరకమైన దాణా పెట్టడం కంటే అవి ఇష్టపడే దాణా పెట్టడం వల్ల పాల దిగుబడి ఎక్కువవుతుందట. పైగా వాటి ఇష్టా ఇష్టాలకు కూడా సమయాసమయాలు ఉంటాయిట. సమయం ఎరిగి వాటి మనసు తెలుసుకుని వాటికిష్టమైన దాణా పెట్టడం వల్ల ప్రయోజనం పెద్దగా ఉంటుందట. అయితే నోరులేని పశువుల అంతర్యం ఎరగడం ఎలా? ఇందుకోసం ఎలక్ట్రానిక్ కాలర్ నొకదానిని రూపొందించారు శాస్త్రజ్ఞులు. దీనిని పశువుల మెళ్ళో తగిలిస్తేచాలు ఇది కంప్యూటర్‌కి సిగ్నల్స్ పంపుతుంది. వాటి ఆధారంగా ఏ పశువుకి ఏ సమయంలో ఏ దాణా వేయాలో కంప్యూటర్ సూచిస్తుంది అంతే. ఆ సూచనలను పాటించి దండిగా పాలు పిండుకోవడమే. కమ్మటి పాలు త్రాగి కండలు పెంచుకొని సరదాగా సొంత కారు నడుపుకుంటూ విహార యాత్రలు చేస్తున్నామనుకోండి. కారు నడుపుతుంటే నిద్ర ముంచుకువచ్చి కళ్ళు మూసుకుపోవచ్చు. అలా అయితే పెద్ద ప్రమాదమే మరి. మరి ఇటువంటప్పుడు మేలుకొలుపులు పాడటానికి ఎలక్ట్రానిక్ యంత్రం ఒక దానిని రూపొందించారు. లండన్‌కి చెందిన జెరాల్డ్ సెవార్, హంట్లీస్పెన్స్ అనేవారు. డ్రైవరు చేతులకి కాని కాళ్ళకికాని ఒక జత ఎలక్ట్రోడ్స్‌ని అమరుస్తారు. వీటిని వైర్ల ద్వారా ఒక జేబు సైజు కంప్యూటర్‌కి కలుపుతారు. ఇది దేహంలో వుండే విద్యున్నిరోధక శక్తిని ఎప్పటికప్పుడు గమనిస్తూంటుంది. నిద్ర మూలంగా ఏకాగ్రత దెబ్బతింటే ఆ నిరోధకశక్తి పెరుగుతుంది, వెంటనే చెవిలో అమర్చిన ఒక లౌడ్ స్పీకర్ ద్వారా హెచ్చరిక శబ్దం వస్తుంది. అయ్యగారికి ఆ హెచ్చరిక చాలకపోతే వెంటనే ఒక మృదువైన ఎలక్ట్రిక్‌షాక్‌ని కల్పిస్తుంది. అంతటితో ఎంతటి నిద్ర స్వామికైనా మెలకువ వచ్చేస్తుంది.

మనుష్యులను మేలుకొలపడం సరే. "కదిలితే బండి- కదలకుంటే మొండి" అన్న ప్రఖ్యాతి పొందిన కార్లూ, మోటార్‌సైకిళ్ళ వంటి ఇంధనంతో నడిచే వాహనాలకు రిపేర్లు వచ్చి ప్రాణం తింటేను! అనేక సందర్భాలలో లోటు ఎక్కడుందో తెలీక రిపేరు చేయడానికి చాలా సమయం పట్టుంది. ఈ సమస్యను చిటికలో పరిష్కరిస్తాం అంటూ కంప్యూటర్‌లు చిటికవేసి రంగ ప్రవేశం చేస్తున్నాయి. కార్లలో కంప్యూటర్‌ని దాని ప్రక్కన ఒక టీ వి స్క్రీన్‌ని అమరుస్తారు. కంప్యూటర్‌కి ప్రోగ్రాంను లోడ్ చేసిన తరువాత వాహనంలో ఏ భాగంలో ఏ లోటుందో తెలుసుకోడానికి తగిన స్విచ్‌లు వేస్తే చాలు. సస్పెన్షన్, బ్రేక్‌లు, టైర్లు, ట్రాన్స్‌మిషన్, ఇంజన్, కూలింగ్ సిస్టం, ఇంధనం, వాయువుల విడుదల వంటి వాటికి చెందిన భాగాల బొమ్మ టీ వి. స్క్రీన్‌మీద పడుతుంది. దానిని బట్టి లోపం ఎక్కడుందో తెలుసుకొని త్వరత్వరగా రిపేర్లు చేసుకోవచ్చు. ఇందువల్ల ఎంతో కాలం, ఖర్చు కలిసివస్తాయి. ఈ కంప్యూటర్‌లో మరో విశేషం ఉంది. ఇది వాహనంలోని లోపాల్ని చూపించడమే కాకుండా దాని మెయిన్‌టెనెన్స్ గురించికూడా సమగ్ర సమాచారం అందిస్తుంది. కార్లకు మామూలుగా అయ్యే రకరకాల ఖర్చుల్లో నలభైరకాల వాటికి దేనికెంత ఖర్చవుతుందో చూపిస్తుంది.

మనం విహార యాత్రలకోసం పరాయి భాషా ప్రాంతాలకు, దేశాలకు వెళ్ళామనుకోండి. ఆయా భాషలు

నేర్చుకొనే అవసరం, అవస్థ లేకుండా కంప్యూటర్లు మనకి కావలసిన పదాలకు అనువాదం చేసిపెడుతున్నాయి ఇటీవల శాస్త్రజ్ఞులు ఫ్రాన్స్, జర్మనీ, స్పెయిన్ దేశాల్లో సంచరించే ఇంగ్లీషు తెలిసిన వారికోసం 'లాంగ్వేజ్ షైట్' అనే ద్విభాషా కాలుక్యులేటర్‌ని రూపొందించారు ఇది నాలుగు వేల పదాల్ని ఫ్రెంచి, జర్మన్, స్పానిష్ ఇంగ్లీషు భాషలలో ఒక దానినుంచి మరో దానికి తర్జుమా చేస్తుంది. మనం చేయవలసినదల్లా దీని కీబోర్డు దగ్గర మనకి కావలసిన మాటని ఉచ్చరించటమే. వెంటనే దాని అనువాదం లిక్విడ్ క్రిష్టల్ డిస్‌ప్లేమీద కనిపిస్తుంది. పైగా ఇది ఒక దేశపు కరెన్సీని మరో దేశపు కరెన్సీలో లెక్కించి చెపుతుంది. ఈ కంప్యూటర్‌కి 'ట్రాన్స్‌లేటర్ 800 కాలిక్యులేటర్' అని పేరు పెట్టారు శాస్త్రజ్ఞులు.

నాలుగైదువేల పదాలను కంప్యూటర్ అనువదించ గలగడం గొప్ప విషయమే కాని ఇంతకు మించిన గొప్ప విషయం మరొకటి ఉంది ప్రపంచంలో అతి పెద్దదైన గ్రంథంగా ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' ను చెప్తుంటారు అరవై వాల్యూములు ఉండే ఈ పుస్తకంలో కొన్ని లక్షల పదాలు ఉన్నాయి. కంప్యూటర్‌ని రూపొందించిన వానెవర్ బుష్ అనే శాస్త్రజ్ఞునికి 1945 లో ఒక వింత ఆలోచన వచ్చింది ఇంతటి బృహత్తరమైన ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాను ఒక అగ్గిపెట్టె సైజులోకి ఎందుకనువదించకూడదని. ఆయన ఊహ ప్రకారం గ్రంథంలోని సమాచారమంతా ఒక డిస్క్‌లో ఇన్‌డెక్స్ అయి ఉంటుంది బటన్ నొక్కగానే మనకి కావలసిన సమాచారం అంతటివి తెరమీద కనిపిస్తుంది. పుట్టబోయే పిల్లడికి సోమలింగం అని పేరు పెట్టినట్లు ఇంకా రూపొందని ఈ కంప్యూటర్‌కి ఆయన 'మెమెక్స్' అని పేరు కూడా పెట్టాడు అయితే ఆయన దీనిని సాధించలేకపోయాడు కాని నలభై ఏళ్ళ తర్వాత ఆయన ఊహ వాస్తవరూపం ధరించింది. రెండున్నర లక్షల పేజీలలోని సమాచారాన్ని, వేలాది చిత్రాల్ని ఆడియో డిస్క్‌లమీద లేజర్ కిరణాల సహాయంతో రికార్డు చేశారు ఈ డిస్క్‌లను స్పెషల్ సి డి ఆర్ ఓ యం (కంపాక్టు డిస్క్‌రెడ్ ఓన్లీ మెమొరీ) ఇప్పటికే ఇటువంటి వాటిని లైబ్రరీలలోనూ, ఆస్పత్రుల లోనూ ఉపయోగిస్తున్నారు. ఇవి విప్లవాత్మకంగా ఉండడంతో అచిరకాలంలో లైబ్రరీల రూపురేఖలు మారిపోతున్నాయి వివిధ గ్రంథాలలోని విషయాలన్నింటినీ జేప్ చేయడం, కోడ్ చేయటం కూడా కార్యాలన్నింటినీ కంప్యూటర్లేనిర్వహిస్తాయి. ఈవిధంగా రికార్డు చేసిన పుస్తకాలతో ఒకేసారి వంద విశ్వవిద్యాలయాలలో బోధించవచ్చు. ఈ కంప్యూటర్ పుస్తకాలు వస్తే ఇప్పటిలాగా పుస్తకాలు చిరిగిపోవడం, నాశనం కావడం అంటూ ఉండదు కాటలాగ్‌లూ, ఇండెక్స్‌లూ వంటివి తయారుచేసే తలనెప్పి తప్పుతుంది. అల్మారాలలోనూ, రాక్‌లలోనూ పుస్తకాలను భద్రపరచే అవసరం ఉండదు ఏదో ఒక లైబ్రరీలో మెంబర్ అయి ఇంట్లో కూర్చుని బటన్‌నొక్కి పుస్తకంలోని ఏవిషయాన్నైనా చూసుకోవచ్చు.

ఈవిధంగా కంప్యూటర్లు మనదైనందిన జీవితంలో భాగస్వాములుగా మారుతున్నాయి వీటిని మనం సవ్యంగా వినియోగించుకోగలిగితే ఈ ధరాతలాన్ని అపర స్వర్గంగా మలచుకోవచ్చు. ◯

'మనుష్యుడు నాలుగు బలాలతో ఉంటాడు. మొదటిది బాహుబలం, అది నికృష్టమైనది. రెండవది మంచి మంత్రి ధన సంపదలు మూడో బలం పిత్రుపైతామహ సంప్రాప్తమైన దున్న దే అది సహజాత బలము. ఈ బలాలన్నిటికి మించినది బుద్ధి బలము.'

– విదురనీతి

# ప్రాచీన భారతదేశంలో అంకగణనా విలాసం

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

రామాయణ మహాభారతాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన విద్వాంసులు, దశాంశ పద్ధతి మరియు అంక గణనాక్రమం భారతదేశంలో విస్తృత వ్యాప్తి కలిగి ఉండేదని విశ్వసిస్తారు అయినా ఈ పద్ధతులు అరేబియా నుండి వెలువడినవని కొందరు పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయం. కాని దశాంశ పద్ధతిలోని మూల అంకెలైన, 0, 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 (దశ) అనాదిగా భారతీయుల వాడుకలో ఉండినవే మన దేశానికి వచ్చిన అరబ్ విద్వాంసులు వాటిని నేర్చుకుని తమ దేశాలలో ఆచరణలో పెట్టారు ఆ రీతిగ వాటికి అరబిక్ సంఖ్యలను పేరు వచ్చింది - దశాంశ పద్ధతిలోని 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 అను అంకెల పట్ల పాశ్చాత్యులు వివాదం లేవనెత్తినప్పటికీ, వాటిలో మొదటి అంకె '0' (సున్న) మాత్రం ఒక అజ్ఞాత భారత మేథావి సృష్టేనని ప్రపంచమంతా విశ్వసించింది. సున్న యొక్క వైశిష్ట్యం ఉపయోగం, ఇంకా నేటివారలకి పూర్తిగా అవగతం కాలేదని చెప్పవచ్చు. కాని ఆధునిక పాశ్చాత్య గణిత శాస్త్రవేత్తలు మాత్రం, గణితశాస్త్ర పరిశోధనలన్నీ ఒక ఎత్తు అయితే, వాటికి సమానమైనది 'సున్న' పరికల్పన అని చాటిచెప్పారు. అందుకు రెండు ఉదాహరణములను పేర్కొనవచ్చు. రోమన్ పద్ధతిలో 10, 000 కు పైబడిన సంఖ్యలను వ్రాయటం కష్టం ! రెండవ అంశం గణితశాస్త్రంలో అనంత (OC = Infinity మరియు అనిర్ధారిత Indeterminates) సంఖ్యల కల్పన, సున్న లేనిదే సాధ్యం కాదు

ఈ వ్యాసంలో రామాయణ, మహాభారతములలోని సామాన్య, అసామాన్య (బృహత్) సంఖ్యల స్థూల పరిశీలన సాగింది వాల్మీకి మహర్షి సంఖ్యలు ఖచ్చితమైనవి, సందేహాతీతమైనవి శ్రీరామ వనవాస కాలమైన 14 సంవత్సరాలను 7+7, 9+5, 8+6 అంటూ విభిన్న రీతులలో వర్ణిస్తారు. అట్లే కాకుత్స రాజుల జీవితకాలాన్ని వర్ణించునపుడు దశరథుడు 60 వేల సంవత్సరాలు, శ్రీ రాముడు 11 వేల సంవత్సరాలు (దశవర్ష సహస్రాణి, దశవర్ష శతానిచ) సగర చక్రవర్తి 30 వేల వత్సరాలు (త్రింశద్వర్ష సహస్రాణి) అని పేర్కొన్నారు.

సముద్ర మథనంతో ఉద్భవించిన వివరాలను విశ్వామిత్రులు పేర్కొన్న తీరు ఇలా ఉన్నది. శ్రీరామచంద్రునికి వివరాలను తెలుపుతూ -

'షష్టిః కోట్యోభవంస్తాసామప్సరాణాం సువర్చసాం'
'అసంఖ్యేయాస్తు కాకుత్స్థ యాస్తాసాం పరిచారికాః '

'కాకుత్స్థా, తేజోవంతులైన 60 కోట్ల అప్సరసలు జన్మించారు. వారికి లెక్కలేనంతమంది పరిచారికలు పుట్టారు.'

పై ఉదాహరణలతో వాల్మీకి మహర్షికి దశాంశ పద్ధతితో సంఖ్యాసూచన బాగుగా తెలిసినట్లు విదితమవుతుంది. ఇక ఆ పద్ధతి ప్రకారం (బృహత్) అసామాన్య సంఖ్యలను పేర్కొనుటకు ఏ రీతిగ ఉపయోగించారు అను విషయమును పరిశీలింపవచ్చును.

యుద్ధకాండ ప్రారంభములో రావణుడు విశ్వాస పాత్రులైన, శుక, సారణ, అను గూఢచారులను, శ్రీరాముని సైన్యమందలి కపుల సంఖ్యను తెలుసుకొనుటకై పంపాడు. రావణుని ఆజ్ఞమేరకు శుక - సారణులు, వేషముమార్చుకుని కపిసైన్యంలో చొచ్చుకొని రహస్యంగా వివరములను సేకరించునపుడు విభీషణునికి దొరికిపోయారు శ్రీరాముని దయతో బంధవిముక్తులై

(శ్రీరాములవారి అనుమతితో) కపిసైన్యము గణాంక వివరాలను సేకరించుకుని రావణుని వద్దకు వచ్చి తమ నివేదికను సమర్పిస్తారు

'శతం శత సహస్రాణాం కోటి మాహుర్మ నీషిణః
శతం కోటి సహస్రాణాం శంఖ ఇత్యభి ధీయతే' - 1
శతం శంఖ సహస్రాణాం మహా శంఖ మితిస్మృతమ్
మహా శంఖ సహస్రాణాం శతం బృంద మితిస్మృతమ్ ॥ 2

# కోటి దీపాల కొలువు

జనుల పంచకు చేరి చల్లగా చూచి చే
తిని గగనముపై వు త్రిప్పుచుండి
వ్రేళ్ళనే కదలిరాని వింతగా వ్రాయుదు
వేదియో శూన్యాన సాదరముగ
ప్రజ్ఞానము యాన ప్రజల బుద్ధుల చేర్చు
చిత్కళా ప్రక్రియల్ చేతువేమొ
వాక్కులకందని భావాలతో చని
లీలావినోదాల హేల చూపి
మాయ పరిధులన్ పరిమార్చి మానవులను
దివ్యసాధనాపరులుగా దిద్దగలవు
కోటి దీపాలు వెలిగించు కొలువుమీది
హృదయపుష్పాంజలులివె సాయీమహేశ

- పంచాంగము శీనప్పశా

మహా బృంద సహస్రాణాం శతం పద్మమితి స్మృతమ్ - 3
మహా పద్మ సహస్రాణాం శతం ఖర్వమిహోస్మృతే ॥
శతం ఖర్వ సహస్రాణాం మహా ఖర్వ మితి స్మృతమ్ - 4
మహా ఖర్వ సహస్రాణాం సముద్ర మభిధీయతే ।
శతం సముద్ర సహస్రయోఘ ఇత్యభి ధీయతే-5
శతమోఘ సహస్రాణాం మహౌఘ ఇత్యభి శ్రుతః
ఏవంకోటి సహస్రేణ శంఖానాం చ శతేనచ - 6
మహాశంఖ సహస్రేణ తథాబృంద శతేనచ మహా బృంద సహస్రేణ తథాపద్మ శతేనచ - 7
మహా పద్మ సహస్రేణా తథా ఖర్వ శతేనచ సముద్రేణ శతేనైవ మహౌఘచ తథైవచ - 8
ఏషకోటి మహౌషేన సద్నశౌనచ॥
(యుద్ధకాండ - సర్గ - 2)

స్థూలంగా మొదటి 5 శ్లోకాలకు దశమాంశ కోష్టక రూపంలో సంఖ్యలను నిరూపించడం జరిగింది. చివరి మూడు శ్లోకాలలో నిరూపింపబడిన సంఖ్యల ఆధారంగా కపిసైన్యం సంఖ్య చెప్పబడింది.

మొదటి అయిదున్నర శ్లోకాల అర్థం ఇలా ఉంది.

శుకుడు రావణునితో చెబుతాడు గణితజ్ఞులు వంద వంద వేలకు కోటి అంటారు $(10^7)$

ఒక లక్షకోటి = ఒక శంఖ
ఒక లక్షశంఖ = ఒక మహాశంఖ
ఒక లక్ష మహాశంఖ = ఒక బృంద
ఒక లక్ష బృంద = ఒక మహాబృంద
ఒక లక్ష మహాబృంద = ఒక పద్మ
ఒక లక్ష పద్మ = ఒక మహాపద్మ
ఒక లక్ష మహాపద్మ = ఒక ఖర్వ
ఒక లక్ష ఖర్వ = ఒక మహాఖర్వ
ఒక లక్ష మహాఖర్వ = ఒక సముద్ర
ఒక లక్ష సముద్ర = ఒక ఓఘ
ఒక లక్ష ఓఘ = ఒక మహౌఘ

ఒక మహౌఘ అంటే 1కి ముందు 62 సున్నలు వ్రాసిన వచ్చు సంఖ్య. ఆధునిక గణితశాస్త్రంలో ఇటువంటి ఎటువంటి పేరూ కానరాదు. అలాంటిది ఉన్నట్లు తెలిపినవారికి కృతజ్ఞుడను తక్కిన మూడు

శ్లోకాలలో కపి సేనాధిపతుల అధీనంలోని కపుల సంఖ్యలు.

"వేయికోట్లు ; వంద శంఖ, వేయి మహాశంఖ, వంద బృంద ; వేయి మహాబృంద వంద పద్మ, వేయి మహాపద్మ, వంద ఖర్వ, వంద సముద్ర, వంద మహౌఘములుగల వివిధ కపిసైన్యాలున్నాయి వాటిని సంఖ్యారూపంలో :

$$10^3 \times 10^7 + 10^2 \times 10^{12} + 10^3 \times 10^{17} + 10^2 \times 10^{22} + 10^3 \times 10^{27} + 10^2 \times 10^{32} + 10^3 \times 10^{37} + 10^2 \times 10^{42} + 10^2 \times 10^{52} + 10^2 \times 10^{62}$$

మొత్తం దాదాపు ఒక కోటి మహౌఘ సంఖ్యల వానర యోధులు అనగా $10^7 \times 10^{62} = 10^{69}$ — అంటే 1 అంకె ముందు 69 సున్నలు గల సంఖ్య ! శ్రీరాముని సైన్యములో ఉండినవి !

పై సంఖ్యలను చదువుతుంటే పాఠకుల తలలు దిమ్మెత్తిపోతాయి అందుకు కారణం వాల్మీకిమహర్షి మేధాశక్తి. వారు తప్పమరెవరు ఈసంఖ్యలను ఊహించగలరు?

మహాభారతములోని బృహత్తర సంఖ్యలను వ్యాసులవారు విశద మొనర్చిన తీరుకు రెండు మూడు ఉదాహరణలు.

మహాభారతములోని ఆదిపర్వము రెండవ అధ్యాయములో అక్షౌహిణీ సైన్యవివరణము. ఒక 'పత్తి' (అనగా ఒక రథం, ఒక ఏనుగు, మూడు గుర్రాలు ఐదుగురు సైనికుల బృందం— వీటన్నిటినీ కలిపిన గుంపుకు 'పత్తి' అని పేరు) 'పత్తి' నుండి అక్షౌహిణి వరకు సంఖ్యలు ఇలా ఉన్నాయి.

మూడు పత్తిలు = ఒక సేనాముఖం
మూడు సేనాముఖాలు = ఒక గుల్మం
మూడు గుల్మాలు = ఒక గణం
మూడు గణాలు = ఒక వాహిని
మూడు వాహినులు = ఒక పృతనం
మూడు పృతనాలు = ఒక చమూ
మూడు చమూలు = ఒక అనికినీ
పది అనీకినులు = ఒక అక్షౌహిణి.

ఒక అక్షౌహిణి సేనలో 21, 870 ఏనుగులు 21,870 రథాలు ; 65610 గుర్రాలు ; 1,09,350 మంది సైనికులు ఉండినట్లు చెప్పవచ్చు. ఈ క్రమాన్నిబట్టి మహాభారత యుద్ధంలో 18 అక్షౌహిణుల సైన్యం 18 దినములలో సంపూర్ణమైంది. అక్షౌహిణి సైన్య ప్రస్తావన రామాయణములో కూడా కానవస్తుంది.

సభాపర్వములో యుధిష్ఠిరుడు రాజసూయయాగం చేయుచున్నపుడు దక్షిణ దిగ్విజయానికి సహదేవుణ్ణి పంపిస్తాడు. సహదేవుడు దక్షిణతీరమందలి సముద్రమునకు వచ్చి లంకలో ఉన్న విభీషణుని నుండి కప్పము, కానుకలు తీసుకుని వచ్చుటకు భీముని కుమారుడైన ఘటోత్కచుని సహాయం కోరతాడు ఘటోత్కచుడు మాయాజాలంతో సముద్రమును దాటి. విభీషణు తన సత్ప్రవర్తనతో మెప్పించి, అతని నుండి తీసుకున్న బంగారు నాణెముల సంఖ్యను వ్యాసులవారిలా వివరించారు.

'కోటి సహస్రమధికం హిరణ్యస్య మహాత్మనే' అంటూ వేయి కోట్లకు మించిన బంగారు నాణెములను ఇచ్చాడట ! ఈ మొత్తమును విభీషణుని 88మంది మాయా రాక్షసులు మోసుకొనివచ్చి, ఘటోత్కచుని నేతృత్వంలో సహదేవునికి అర్పించాడట !

మహాభారత మందలి హరివంశమందలి 8 వ అధ్యాయంలో కాల పరిణామాన్ని చెబుతూ, వ్యాసులవారు ఇలా అన్నారు.

శ్రీవాణి దశాబ్ది ప్రత్యేక సంచికకు మా శుభాకాంక్షలు

స్థా 1973 ఫోన్ : 83-231



# శ్రీ చౌడేశ్వరి
# చేనేత సహకార ఉత్పత్తి విక్రయ సంఘం లిమిటెడ్

**No. H W - 1**

మల్లవోలు, గూడూరు మండలం, కృష్ణాజిల్లా

కొనండి ! ఆనందించండి !

మా సంఘములో 100, 80, 60 నెంబర్లలో చేనేత చీరెలు నూతన డిజైన్లలో పక్కా రంగులలో సరసమైన ధరలకు లభించును.

మా సంఘమును సందర్శించండి !

**బూసం సుబ్బారాయుడు**
మేనేజరు

**పిచ్చుక నాగేశ్వరరావు**
ప్రెసిడెంటు

**కుర్మా హేమసుందరరావు**
వైస్ ప్రెసిడెంటు

* డైరెక్టర్సు *

| | | |
|---|---|---|
| బూసం గోవర్ధనరావు | బూసం ఈశ్వరలింగం | షేక్ హుస్సేన్ |
| పిచ్చుక సోమసుందరరావు | పిచ్చుక నాగేశ్వరమ్మ | నల్లా శ్యామలాంబ |

'చత్వార్యేవ సహస్రాణి వర్షాణాంతు కృతం యుగమ్
త్రీణి వర్ష సహస్రాణి త్రేతాస్యాత్ పరిమాణితః
తథావర్ష సహస్రేద్వే ద్వాపరం పరికీర్తితమ్
కలి వర్ష సహస్రించ, సంఖ్యాస్తోత్ర మనీసిభిః '

అంటే కృతయుగంలో దేవతల 4వేల సంవత్సరాలు త్రేతాయుగంలో 3 వేల సంవత్సరాలు ద్వాపరములో 2వేల ఏళ్లు, కలియుగంలో 1000 ఏళ్ళు ఇవే కాక నాలుగు యుగాలు చేరి 2000 దేవవత్సరాలు (సంధ్య, సంధ్యాంశములు చేరి) ఇలా మొత్తం నాలుగు యుగాలు ఒక చక్రం 12 వేల దేవ వత్సరాలు.

మానవుని ఒక ఏడాది దేవతలకు ఒక దినం. మానవుని 360 సంవత్సరములు దేవతలకు ఒక ఏడాది. ఈ గణాంకాల ప్రకారం కలియుగం, 4,32,000సంవత్సరాలు, ద్వాపరయుగం 8,64,000 సంవత్సరాలు, త్రేతాయుగం 12,69,000 సంవత్సరాలు; కృతయుగం, 17,28,000 వత్సరాలు. ఒక చతుర్వగ చక్రకాలం 43,20,000 మానవ సంవత్సరాలు.

పై పేర్కొన్న కాల గణనకు మూల పరిమాణం 'నిమేషం'. ఇది అధునిక పరిమాణం ప్రకారం 0.2 సెకండ్లకు సమానం. (తెలుగు నిముషం కాదు) పాఠకులు (అందులోను ఆధునిక భౌతిక శాస్త్ర పాఠకులకు) పై వివరాలన్నీ గమనించనపుడు ఐన్‌స్టీన్ సాపేక్ష వాదం (Theory of Relativity) జ్ఞాపకం రాకపోదు!

ఆదే అధ్యాయంలో (71-4-16) చతుర్వగాన్ని మన్వంతరంగా పేర్కొన్నారు.

ప్రస్తుతం వైవస్వత మన్వంతరం జరుగుతూఉంది కలియుగం, ప్రథమపాదం) బ్రహ్మ యొక్క ఒకదినము 1000 చతుర్వగములకు 1000 $\times$ 43,20,000 అంటే



43. 2 $\times$ 108 మానవ వత్సరాలకు సమానం - ఈ క్రమంలో బ్రహ్మ యొక్క ఆధిపత్యకాలం వంద వత్సరాలని చెప్పబడింది.

ఎక్కడ నిమేషం, ఎక్కడి బ్రహ్మ యొక్క దిన ప్రమాణం! ఇటువంటి వందలాది ఉదాహరణములు. మన దేశ సంస్కృతికి మూలకందములైన రామాయణ, మహాభారత, భాగవతములు మొదలైన అష్టాదశ పురాణాలలో, నిగూఢంగా ఉన్నాయి వాటిని అధ్యయన మొనర్చి సగర్వంగా తల ఎత్తుకుని తిరిగేందుకు మనకు తీరిక ఎక్కడిది ?

('కస్తూరి' కన్నడ మాస పత్రిక - మార్చి 1994 సంచికలోని శ్రీ గొరూరు శ్రీనివాసమూర్తి వ్యాసం ఆధారంగా)

# మూడురోజుల ముచ్చటైన పండుగ

- కొమరగిరి జయప్రద

" వచ్చింది వచ్చింది సంక్రాంతి లక్ష్మి
తెచ్చింది తెచ్చింది సంబరాలెన్నో "

తెల్లనైన చల్లనైన మంచుతెరలను తొలగించుకొని తెల్లనైన స్వచ్ఛమైన మనసులు మనకు ఉండాలని, బంతులు చేమంతులవలె పచ్చగా ఉండాలని, ఆటపాటలతోను ఆనందముగా ఉండాలని, ఎల్లకాలము ఇలా చల్లగా ఉండాలని, చెప్పకనే చెబుతున్నది సంక్రాంతి లక్ష్మి. ఇది ముచ్చటైన మూడురోజుల పండుగ. అన్ని పండుగలకన్నా సంక్రాంతికి చాలా ప్రత్యేకత ఉన్నది. ఎందుకంటే ధనుర్మాసముతో మొదలయి సంక్రాంతితో ఆఖరవుతుంది ఇది. ఈనెల రోజులూ పర్వదినములే.

ధనుర్మాసస్య మహాత్మ్యం,
వక్తుం విస్తరతోమయా
నశక్యతే మునిశ్రేష్ఠః, తథా వర్ష శతైరపి

" ధనుర్మాస మహాత్మ్యమును సవివరముగా చెప్పటకు వంద సంవత్సరాలకైనా నాకు శక్యము కాదు'' అని సూతులవారు శౌనకాది మహామునులతో చెప్పారుట. అంత పవిత్రమైనది ధనుర్మాసం. మార్గశిర మాసములో ధనుర్లగ్నమునందు సూర్యుడు ప్రవేశించినది మొదలు ధనుర్మాసము అంటారు. ముక్కోటి ఏకాదశి ఈ మాసంలోనే వస్తుంది. దీనినే వైకుంఠ ఏకాదశి అనికూడా అంటారు. ఈరోజుననే వైష్ణవాలయాలలో ఉత్తరద్వారం తెరుస్తారు. దైవదర్శనం అటునుండి జరుగుతుంది ఆరోజు మరణిస్తే విష్ణులోకప్రాప్తి కలుగుతుందని నమ్మకం చంద్రుడు మృగశిర నక్షత్రముతో కూడుకొని ఉండటం వలన ఈ మాసానికి మృగశీర్షమని, మార్గశిరమని పేరు. ఈ నెలలోనే సూర్యుడు ధనూరాసిలో ప్రవేశించటం వలన ధనుర్మాసమని కూడా పేరు. 'మాసానాం మార్గశీర్షోహం' అన్నారు శ్రీకృష్ణ పరమాత్మ. ధనుర్మాసములో ప్రాతఃస్నానము, విష్ణుపూజ, తులసిపూజ, గోపూజ, ముఖ్యమయినవి. అన్నదానము, అగ్నిదానము (చలిమంటలు వేయించుట, దుప్పట్లు గొంగళ్లు పంచిపెట్టుట) చాలా ముఖ్యమయినవి. ధనుర్మాసములో దేవునికి నివేదించే నైవేద్యములలో కూడా ఒక ప్రత్యేకత ఉన్నది. నెలరోజులు పెసరపప్పుతో వండిన పొంగలిని నివేదిస్తారు. మనం తీసుకునే ఆహారము వలననే శరీరములో శక్తిఉత్పాదన జరుగుతుందని మనందరకు తెలుసు. శీతాకాలంలో ఈ శక్తిని మనం రెండు విధాలుగా ఖర్చుపెడుతాము దినచర్యలకు కొంత, దీర్ఘమయిన శీతాకాలపు రాత్రుల చలిని తట్టుకోవటంకోసం కొంత. ఉదయాన్నే బలవర్ధకమయిన ఆహారాన్ని తీసుకోవటంవలన ఆ శక్తిని మనము తిరిగి సమకూర్చుకోవచ్చు. అందుకే మన పెద్దలు హేమంతపు చలిని తట్టుకోవటానికై కొన్ని ఆరోగ్యకరమైన పద్ధతులను ప్రవేశపెట్టారు. అది కూడా ఇహపరాలను చేకూర్చేటటువంటివే. వైష్ణవాలయాలలో ధనుర్మాసం నెల రోజులూ సూర్యోదయానికి రెండు మూడు గంటలు ముందుగా నిద్రలేచి ప్రాతఃస్నానముచేసి మేళతాళములతో భగవంతుని గుణగానము చేస్తూ నగర సంకీర్తనచేసి శ్రీ మహావిష్ణువును పూజిస్తారు. దధ్యోజనము, శర్కరపొంగలి, పులిహోర, శెనగలు మొదలయినవి నివేదన చేస్తారు తెల్లవారుఝామున ఆచార్లగారు గుళ్ళో గంట కొట్టగానే బిలబిలమంటూ చిన్నా పెద్దా అందరూ చేరతారు అసలు భక్తులకన్నా ప్రసాదం భక్తులే ఎక్కువ. అదొక ఉత్సాహం,

అదొక సందడి. ఇలాచేస్తే ఈ రోజుల్లో డాక్టర్లు చెప్పే మార్నింగ్ వాకింగ్ కూడా మనం చెయ్యనవసరం లేదేమో ! ధనుర్మాసం మొదలైన నాటినుండి సంక్రాంతి వరకు గృహిణులు తెల్లవారుఝామునే లేచి ముంగిళ్ళను శుభ్రము చేస్తారు. ఆవుపేడతో కళ్ళాపి చల్లుతారు. రంగురంగుల ముగ్గులు వేస్తారు ఈ ముగ్గులు కూడ ఎన్ని రకాలో ! చుక్కలముగ్గులు, గీతల ముగ్గులు ఒకరు వేసింది వేయకుండా, ఒకరోజు వేసింది మరొక రోజు వెయ్యకుండా రకరకాల రంగవల్లులు వేయటంలో మనది అందెవేసిన చేయి.

ఈ ముగ్గులపైన రంగు రంగుల బంతిపూలతో అలంకరించి ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలను పెడతారు. వాటిని పసుపు కుంకుమలతో పూజించి వాటి చుట్టూ తిరుగుతూ -

" గొబ్బీ గొబ్బెమ్మా సుఖమూలియ్యావే
తామర పువ్వు వంటి తమ్ముణ్ణియ్యావే
చామంతి పువ్వు వంటి చెల్లెల
మొగిలి పువ్వు వంటి ... మొగుణ్ణియ్యావే"

అని సిగ్గులు ఒలకబోస్తూ పాటపాడుతుంది కన్నెపిల్ల. ఈ నెలలోనే హరిదాసులు, గంగిరెద్దులవారు, సాతాని జియర్లు, బుడబుక్కలవారు భగవన్నామంతో మనలను మేలుకొలుపుతారు సాతానిజియర్లు పల్లెపదాలతోను బుడబుక్కలవారు భారత రామాయణాలను తమ వాక్చాతుర్యంతోను వినిపిస్తారు.

అయ్యగారికి దణ్ణం పెట్టూ, అమ్మగారికి
దణ్ణం పెట్టూ
డూ! డూ! డూ! డూ బసవన్నా! రామయ
తండ్రికి దణ్ణంపెట్టూ
సీతమ్మారికి దణ్ణంపెట్టూ, డూ! డూ! డూ! డూ!
బసవన్నా !

అంటూ మొదలెడతారు. మొత్తానికి ఎవరు ఏ విధంగా చేసినా ప్రాతఃకాలం భగవన్నామంతో మొదలవుతుంది. ఏడాదికొకసారిగదా వారు వచ్చేది అవి ధనమో, ధాన్యమో, కాయో, పండో ఇస్తుంటాము మనము. మనకు తెలియకుండానే దానధర్మముతో దైనందిన కార్యక్రమము మొదలు పెడ్తాము. అదే మన తెలుగువారి పండుగల లోని ప్రత్యేకత

సంక్రాంతి రోజున సూర్యుడు మకరరాశిలో ప్రవేశిస్తాడు గనుక మకర సంక్రాంతి అని పేరు. సూర్యుడు ఒక రాసి నుండి మరొక రాసిలో మారే కాలమునకు సంక్రమణము అని పేరు పన్నెండు రాసులకు లేని ప్రత్యేకత దీనికెందుకు ? అని అంటే, ద్వాదశాదిత్యుడైన దివాకరుని దివ్యయాత్రలో మేష, కర్కాటక, తుల, మకర సంక్రమణములు ముఖ్యమయినవి. వీటిలో ఒక్కొక్క మజిలీకి ఒక్కొక్క ప్రత్యేకత ఉన్నది. సూర్యుడు కర్కాటక రాసిలో ప్రవేశించినది మొదలు మకర రాసిలో ప్రవేశించే మధ్య కాలమునకు "దక్షిణాయనము" అని పేరు దక్షిణాయనము పితృదేవతల మార్గము. ఉత్తరాయణం దేవతలమార్గము ఉత్తరాయణం ప్రవేశించగానేచేసిన దానధర్మాలు అనంత ఫలములనిస్తాయి. ఆ రోజు మంచి గుమ్మడిపండుకు పసుపురాసి బొట్టుపెట్టి బియ్యము దక్షిణ తాంబూలములతో దానమిస్తారు. వానలు వరదలు పోయి ప్రశాంతముగా ఉంటుంది హేమంతలక్ష్మి కర్షకుల శ్రమ ఫలించి గాదెలన్నీ నింపుతుంది ధాన్యలక్ష్మి ధాన్యలక్ష్మి వలన వస్తుంది ధనలక్ష్మి పచ్చని చేమంతులతో బంతులతో ప్రకృతిని పులకరింపజేస్తూ వస్తుంది పౌష్యలక్ష్మి. ముచ్చటైన మూడు రోజుల పండుగను వెంట తెస్తుంది సంక్రాంతిలక్ష్మి.

"శ్రీవాణి" దశాబ్ది ప్రత్యేక సంచిక సందర్భముగా

మీకివే మా శుభాకాంక్షలు



# గోకవరపు రామారావు సన్స్

జనరల్ మర్చంట్స్

ఫోర్టు రోడ్

## మచిలీపట్నం

మావద్ద నిత్యావసర కిరాణా సరుకులు బాగుచేయించి అమ్మబడును.

స్వచ్ఛమైన నెయ్యి, దీపారాధనకు ఆవు నెయ్యి అమ్మబడును.

: ప్రొప్రయిటర్ :

గోకవరపు నాగవెంకట మురళీకృష్ణమూర్తి

మొదటి రోజు భోగిపండుగ. ధనుర్మాసం నెలరోజులు గోదాదేవి రచించిన "తిరుప్పావై" ప్రతి రోజూ తెల్లవారుఝామున చదువుతారు. భోగినాడు గోదా రంగనాయకుల కల్యాణం జరుపుతారు తమిళులకు ఇది చాలా ముఖ్యమయిన పండుగ. భోగిరోజు తెల్లవారు ఝామున లేచి చలిమంట వేసి చలికి వీడ్కోలు చెబుతారు. సాయంత్రం పసిపిల్లలకు భోగిపండ్లు పోస్తారు. కొత్త బియ్యం, రేగిపండ్లు, బంతిపూలు చిల్లర కలిపిన ఈ భోగిపండ్లు పిల్లలకు దృష్టిదోషం లేకుండా ఉంటుందని మనవారి నమ్మకం సంక్రాంతికి బొమ్మల కొలువులు పెట్టటం మన తెలుగువారి ప్రత్యేకత. మూడవరోజు కనుము పండుగ ఇది పశువుల పండుగ. పశువులను అలంకరిస్తారు. ఎడ్ల పందేలు, కోళ్ళు, పొటేళ్ళ పందేలు నిర్వహిస్తారు కొత్త అల్లుళ్ళ బావమరదులతో పరాచికాలు, కన్నెపిల్లలు బావలతో సరసాలు, వంట ఇంట్లో అత్తగారు చేసే పిండివంటల ఘుమఘుమలు, ఒకటేమిటి ? ఎన్నెన్నో సరదాలతో సంతోషాలతో మరెన్నో వింతలు విశేషాలతో ఇంటింటికి వస్తుంది సంక్రాంతి లక్ష్మి.

కానీ ఈనాటి వారికి ధనుర్మాసము గురించి తెలియదు. గొబ్బిళ్ళ సంగతి తెలియదు. రాత్రి ప్రొద్దుపోయేదాక T V. చూడటం, ప్రొద్దెక్కిన తరువాత నిద్రలేవటం, లేచిన దగ్గరనుండి ఉరుకులు పరుగులు. అపార్టుమెంట్స్‌లో ఉండటం మొదలుపెట్టాక ముంగిళ్ళులేవు, ముంగిట్లో ముగ్గులూలేవు. ఒకవేళ ఇళ్ళల్లో వేసినా ప్రతిదానికి స్టిక్కర్లు అతికించటమే నైటీలు వచ్చిన తరువాత నడుము బిగించే పనేలేదు అసలు నడుము ఉన్నదో లేదో తెలియదు. నడుమునొప్పి వస్తే డాక్టరు పెట్టే బెల్టు వేసుకోవటానికి నడుము వెతుక్కోవాలి బొమ్మలకొలువులు పెడదామంటే చిన్నచిన్న గదులు, మంచం ఎత్తి వండుకోవటం, మంచంవేసి పడుకోవటం. ఇదీ ఈనాటి పరిస్థితి. బర్త్‌డేపార్టీలు, మారేజ్‌డే పార్టీలు తప్ప దానధర్మాలు లేవు. స్త్రీ పురుషులు యంత్రాల మాదిరిగా పనిచేస్తున్నా పొట్ట గడవని ఈ రోజుల్లో పండుగలు పర్వదినముల గురించి పట్టించుకునే తీరిక ఓపిక ఎవరికిలేదు. కానీ మన సనాతనధర్మ సంప్రదాయములు ఆరోగ్యకరమైనవి, ఆనందకరమైనవి. కొన్ని కాకపోతే కొన్ని అయినా పాటించటం అలవర్చుకుంటే ఇంటికి ఒంటికి మంచిది. *

## అచ్చమైన నిచ్చెన

ఎన్ని పుష్పాలున్నాయి ?
రంగురంగుల పుష్పాలు ! రకరకాల పుష్పాలు !
కమ్మని పరిమళాలను వెదజల్లే పుష్పాలు !
కొమ్మల నుండి, రెమ్మల నుండి,
వేరుచేయగానే—
కార్చుతున్నాయి కన్నీటి బాష్పాలు !
పుష్పాలు కాదు పూజ ముఖ్యం
పూజకన్నా మనోఏకాగ్రత ముఖ్యం
మానవుడికీ, మాధవుడికీ మధ్య,
కుదిరించాలి సఖ్యం
అదే ఆరాధన ! అదే అర్చన !
అదే మనలను స్వర్గానికి చేర్చే
అచ్చమయిన నిచ్చెన !

- కలవలపల్లి బాలసుబ్రహ్మణ్యం

# తిలక్, శ్రీశ్రీ కవితలు

## మధ్యతరగతి, నిరుపేదల బ్రతుకులు

-సింగళి వెంకట కృష్ణారావు

ఆధునిక కవితా యుగంలో శ్రీశ్రీతో సమానమైన ప్రతిష్ఠను పంచుకున్న కవి దేవరకొండ బాలగంగాధర తిలక్. శ్రీశ్రీకి లభించిన కీర్తిలో కొంత భాగం కవిత్వానికి సంబంధించినదైతే, మరికొంత ఆయనఅభిమానించిన కమ్యూనిష్టు సిద్ధాంతం వల్ల సంక్రమించింది. అరసంలో ఉన్నా విరసంలో ఉన్నా చివరిదాకా కమ్యూనిష్టు సిద్ధాంతాలకే కట్టుబడి శ్రీశ్రీ రచనలు చేశాడు. విప్లవం ఆయన మార్గం. కార్మిక కర్షక లోకానికి సౌభాగ్యం సమకూర్చే మరో ప్రపంచ నిర్మాణం ఆయన లక్ష్యం.

'నవ కవిత' అనే ఖండికలో తన కవితాసామగ్రిని ప్రస్ఫుటంగా శ్రీశ్రీ చెప్పాడు.

" సిందూరం, రక్తచందనం
బంధూకం సంధ్యారాగం
పులి చంపిన లేడి నెత్తురు
ఎగరేసిన ఎర్రని జండా
రుద్రాలిక నయన జ్వాలిక
కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవ కవనానికి "

'ఎర్రని జండా' అనటంలో కమ్యూనిజంపై అభిమానాన్ని, 'రుద్రాలిక నయనజ్వాలిక, కలకత్తా కాళిక నాలిక' అనటంలో విప్లవాన్ని కవి స్ఫురింపజేశాడు. 'రగులుతునే తాకసిబొగ్గు.... వికసించిన విద్యుత్తేజం, కావాలోయ్ నవకవనానికి" అనటంలో కవి ఆశించిన పారిశ్రామిక విప్లవం స్ఫురిస్తున్నది.

" గర్జించు రష్యా '' అనే ఖండికలో 'రారా రష్యా ఓ రష్యా' అంటూ ఆ దేశానికి స్వాగతం పలికాడు.

" లెనిన్ తపస్సు, స్టాలిన్ సేద్యం ఫలించిన సముజ్జ్వల తేజం యునైటెడ్ సోవియట్ సోషలిష్టు రాజ్యం " అంటూ రష్యాను ప్రశంసించాడు. అలాంటి పాలన మనదేశంలోకూడ రావాలని ఆశించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే శ్రీశ్రీ జీవితానికి, కవిత్వానికి కమ్యూనిజంతో విడివడని ముడిపడింది.

తిలక్ శ్రీశ్రీ అభిమానాన్ని ప్రశంసల్ని పొందిన కవి

" యువకవి లోకప్రతినిధి
నవభావామృత రసధుని
కవితాసతి నొసట నిత్య
రసగంగాధర తిలకం "

అంటూ తిలక్ మరణించిన సందర్భంగా శ్రీశ్రీ విషాద గీతాన్ని రచించాడు. తిలక్‌కు కవిగా లభించిన ప్రతిష్ఠ కేవలం అతని కవిత్వం ద్వారా లభించింది మాత్రమే. ఏదో ఒక రాజకీయ సిద్ధాంతానికి కట్టుబడ్డవాడు కాకపోవటం వలన తిలక్ కవితలో విభిన్నమైన విషయాలు మనకు గోచరిస్తాయి. ఏ రాజకీయ వర్గాలవల్లా ఇతనికి ప్రత్యేకంగా లభించిన కీర్తిప్రతిష్ఠలు లేవు. అయితే తిలక్ కమ్యూనిస్టు కాకపోయినా అభ్యుదయవాది. సమస్యలకు, సౌందర్యానికి స్పందించే హృదయవాది. అందువలన అందరి అభిమానాన్ని చూరగొన్నాడు. ఈ కవుల కవిత్వంలో భేదంవున్నా కొంత సాదృశ్యం కూడా లేకపోలేదు.

తిలక్ రచించిన కవితా సంపుటి 'అమృతం కురిసిన రాత్రి' అందులో 'నా కవిత' అనేది మొదటి గేయం. తన కవితాతత్త్వాన్ని ఈ గేయంలో అతడు సమగ్రంగా చెప్పాడు శ్రీశ్రీ లాగా ఏవో కొన్ని సిద్ధాంతాలకు మాత్రమే ఇతడు కట్టుబడి కవిత్వం వ్రాయలేదు.

" నా కవిత్వం కాదొక తత్త్వం
మరికాదు మీరనే మస్తత్త్వం
కాదు భసికవాదం సామ్యవాదం
కాదయ్యా అయోమయం జరామయం
గాజు కెరటాల వెన్నెల సముద్రాలు
జాజి పువ్వుల అత్తరు దీపాలు
యంత్రలోకపు మణిస్తంభాలు
నాకవితాచందనశాలా సుందరచిత్రవిచిత్రాలు
అగాధ బాధా పాధః పతంగాలు
ధర్మవీరుల కృత రక్తనాళాలు
త్యాగశక్తి ప్రేమరక్తి శాంతిసూక్తి
నాకళా కరవాల ధగధగ రవాలు
నా అక్షరాలు కన్నీటి జడులలో
తడిసే దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తులు వహించే
విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు "

పై కవితను పరిశీలిస్తే తిలక్ కవితకు ఒక అవధి అంటూ కనపడదు. ఆ కవిత ఏ వాదానికీ కట్టుబడదు. అది పసికిరాని పాతది కాదు అయోమయమైన కొత్తది కాదు అది పాతక్రొత్తల మేలు కలయిక.

'గాజు కెరటాలు - వెన్నెల సముద్రాలు' మొదలైన మాటలు భావకవితాధోరణిని సూచిస్తుంటే 'నా అక్షరాలు ప్రజాశక్తులు వహించే విజయ ఐరావతాలు' అన్న వాక్యం కవి అభ్యుదయభావనకు ప్రజాస్వామ్య ధోరణిని తెలియజేస్తున్నది. 'యంత్రలోకపు మణి స్తంభాలు' అంటే రమణీయ కల్పనావిశేషాలన్నమాట. 'చందన శాలా సుందర చిత్రవిచిత్రాలు' అంటే తన రచన కవితాశిల్ప విలసితమని సూచించాడు తిలక్. దయ, ధర్మం, త్యాగం, ప్రేమ, శాంతి మొదలైనవన్నీ తిలక్ కవితా వస్తువులే ! అందం, ఆనందం, తన కవిత్వానికి పరమావధిగా చెప్పుకున్నాడు ఇతడు. కవితా వస్తువు విషయంలో శ్రీశ్రీకి తిలక్‌కు ఇంత వ్యత్యాసమున్నది.

పోలికల విషయానికొస్తే ఇద్దరూ సమకాలీన సమాజానికి స్పందించి కవితలు వ్రాసినవారే ! ఇద్దరూ కూడ వచన కవితను అభిమానించారు, రచించారు. శ్రీ శ్రీ, తిలక్ వీరిద్దరికి ప్రాచీన సాహిత్యంలో మంచి పాండిత్యమున్నది. కవిత్వం వ్రాయటం ప్రారంభించిన తొలి రోజుల్లో ఇద్దరూ పద్యాలు వ్రాశారు. ఈ భేదసాదృశ్యాలనలా వుంచి వీరిలో ఎవరు ఏ ఏ తరగతి ప్రజల సాధక బాధకాలకు ప్రధానంగా స్పందించారో పరిశీలిద్దాం

మహాప్రస్థానంలో శ్రీ శ్రీ పతితులకోసం బాధాసర్పదష్టులకోసం కూడు, గూడు లేని భిక్షులకోసం కలం పడుతున్నట్లు 'జగన్నాథ రథచక్రాలు' అనే ఖండికలో స్పష్టంగా చెప్పాడు. 'ప్రతిజ్ఞ' అనే కవితలో

"నాలో కదలే నవ్య కవిత్వం
కార్మిక లోకపు కల్యాణానికి
శ్రామిక లోకపు సౌభాగ్యానికి"

సమర్పణమని, సమర్చనమని, చెప్పాడు శ్రీ శ్రీ తన కవితలో ముఖ్యంగా అట్టడుగు ప్రజల జీవనాన్ని చిత్రించాడు. కార్మిక కర్షకుల ప్రసక్తి లేని కవితలు చాలా తక్కువ.

మరొక కవిత 'పేదలు' అనేదాంట్లో పేదల గుండెలు అశ్రువులు నిండిన కుండలని, శ్మశానంలో ఖండలని – వారి చేతులు ఆకులు రాలిన మోదుగు కొమ్మలని–కన్నులు వెతల వ్రణాలని పేదల బ్రతుకులు తిరిపెమునకు పిడికెడు మెతుకులని శ్రీశ్రీ వర్ణించాడు అక్కడక్కడ మధ్య తరగతి వారిని వర్ణించినా, వారిపై కవికి అంత సానుభూతి ఉన్నట్లు కనబడదు

'ఖడ్గ సృష్టి' అనే మరో కవితా సంకలనంలో 'శరశ్చంద్రిక' అనే చక్కని కవిత ఉన్నది చంద్రణ్ణి అడ్డం పెట్టుకుని శ్రీశ్రీ మానవుని పురోగతి, పతనం మొదలైన విషయాలనెన్నింటినో ఈ కవితలో వర్ణించాడు.

మన మధ్య తరగతి ప్రజానీకం, యేదో ఒక్క రాజకీయ సిద్ధాంతానికి నిరంతరం కట్టుబడి ఉండరు. పాపం, పుణ్యం సంప్రదాయం అన్నీ వీరికి కావాలి. వీరు ధనికులు కారు, అలా అని బీదవారందామా! అంటే వారే ఒప్పుకోరు వీరు ఆర్థిక బాధల్ని అనుభవిస్తుంటారు పైకి చెప్పుకోరు సాంఘిక దురాచారాలకు బలి అవుతుంటారు కానీ పెదవి విప్పరు. అలాంటి మధ్య తరగతి ప్రజలంటే తిలక్‌కు సానుభూతి ఎక్కువ. శ్రీశ్రీ కవిత్వంలో నిరుపేద ఎలా ప్రధాన పాత్రగా కనిపిస్తాడో తిలక్ కవిత్వంలో మధ్య తరగతి మానవుడు. అలానే నాయకునిగా కనిపిస్తాడు.

"అమృతం కురిసిన రాత్రి" తిలక్ అద్భుత కవితా సృష్టి ఈ సంకలనంలో 'సి ఐ డి రిపోర్టు' అనే కవితను పరిశీలిస్తే కవి మధ్య తరగతివాణ్ణి ఎంత స్పష్టంగా, సమగ్రంగా చిత్రించారో తెలుస్తుంది. ఇందులో 'కోటేశ్వరరావు' ప్రధానపాత్ర. అతడు మూడంతస్తుల మేడమెట్లు ఎక్కుతుండగా గుండె ఆగి మరణించాడు. అతడు గుమాస్తా తండ్రి, తాత, ముత్తాతలు కూడా గుమాస్తాలే. కోటేశ్వరరావు కుటుంబం చూడండి.

" సాంప్రదాయకమైన వినయ విధేయతలకి
గౌరవకరమైన దరిద్రానికి వీళ్ళవంశం ఒక రాస్తా
అతనికి యింట్లో ఆరుగురు పిల్లలూ, ఒక
ముసలితల్లీ, ఒక్క పిల్లి ఒక్కత్తే నీరసంగా
ఉన్న భార్య
ఇతనద్దెకున్న వాటాలో రెండున్నరగదులూ,
ఒక టెలివిజన్ లాంటి బాత్‌రూము
ఒక అటకా "

ఈ మధ్యతరగతి కుటుంబానికి యజమాని 'కోటేశ్వరరావు' పేరు ఎంత గొప్పగాఉందో చూశారా, ఆ పాత్రకు ఆ పేరు పెట్టటంలో కూడా కవి వ్యంగ్యాన్ని ప్రదర్శించాడు. మధ్య తరగతివాడు తినటానికి లేక పోయినా పైకి డాంబికంగానే ఉంటాడు.

ప్రతీకవాద ధోరణిలో సాగిన మరొక అద్భుత మైన కవిత ' గొంగళి పురుగులు ' గొంగళి పురుగు ఇక్కడ మధ్య తరగతి మానవుడికి ప్రతీక. కవితలో ప్రారంభ వాక్యాలు చూడండి.

" బల్లపరుపుగా పరచుకొన్న జీవితంమీదనుంచి
భార్యామణి తాపీగా నడచివచ్చి అందికదా-
" పంచదార లేదు
పాలడబ్బా లేదు
బొగ్గుల్లేవు - రాత్రికి
రగ్గుల్లేవు "

ఈ సన్నివేశం ప్రతి మధ్యతరగతి కుటుంబంలో కనిపించేదే అయితే మధ్యతరగతి మానవుడికి ఎన్నో ఆలోచనలు, ఊహలు నిజ జీవితంలో లభించని వాటిని గురించి ఎన్నో కలలు కంటుంటాడతడు.

మధ్యతరగతి వాడి ఆలోచనలను ప్రతిబింబించే ఈ వాక్యాలు చూడండి.

" బస్ స్టాప్ దగ్గర పరాయి ఆడది తనకేసి
చూసిందని
మెరీనా కాంటిన్ యువతల నుంచుంటే
మినపట్టు వాసన ఘాటుగా వేసిందని
అసలు అప్పుడే కాంగ్రెసులో చేరి వుంటే
ఈ పాటికి మినిష్టర్ని అయిపోయి
ఉండేవాడినని
పెళ్ళాం దగ్గర చెప్పాని సర్దాపడి
"హయ్యో రామ నీ బతుక్కి"
అన్నట్టు మూతి విరచే
అర్ధాంగి ఆకారం తల్చుకుని
ముడుచుకుపోయిన గొంగళి పురుగు
తన్ని తనే తీసుకుని గోడ అవతలకి
తన్ని తనే గిరవాటేసుకుంది "

ఈ విధంగా తిలక్ మధ్యతరగతి వాడి కలల్ని నిజ జీవితంలోని వైఫల్యాన్ని చిత్రించాడు. ఈయన వర్ణించినంతగా మధ్య తరగతి జీవనాన్ని బహుశా మరొకరు వర్ణించలేరేమో !

మధ్యతరగతి వాడి కుడి చేయి విన్యాసం ఎలాంటిదో కూడ కవి వర్ణించిన తీరు చూడండి.

" ఆఫీసర్ వస్తే సాల్యూట్ చేస్తుంది కుడిచెయ్యి
ఆకలేస్తే గబగబ రాస్తుంది కుడి చెయ్యి
జేబులోంచి సెకండు హాండు సిగరెట్టు
ముక్కల్ని తీస్తుంది కుడిచెయ్యి
అయితే ఇంక ఎడమ చెయ్యి ఉపయోగ
మేమిటంటా ?
నవ్వుకుంటూ ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకుని
షాక్ తగిలి
నిరుపయోగంగా చచ్చిపోతాడు ఏలేశ్వరరావు

ఈ విధంగా విశ్లేషణ చేస్తే తిలక్ కవితా దృష్టిని మనం గ్రహించవచ్చు

ఇంక ఈ కవులిద్దరు స్వీకరించిన ఒకే ఇతివృత్తం గల రెండు కవితలను పోల్చిచూపి నా వ్యాసం ముగిస్తాను. శ్రీ శ్రీ 'భిక్షువర్షీయసి' అనే కవితలో ఒక వృద్ధు రాల్ని వర్ణించాడు. తిలక్ 'ముసలివాడు' అనే శీర్షిక

క్రింద వ్రాసిన కవితలో ఒక ముసలివాని జీవితం వర్ణించాడు.

శ్రీశ్రీ ముసలిదాన్ని, తిలక్ ముసలివాణ్ణి కొద్దిగా పరామర్శిద్దాం

శ్రీశ్రీ వర్ణించిన ముసలి బిచ్చగత్తె, దారిప్రక్క చెట్టుక్రింద, ఆరిన కుంపటి విధాన కూర్చున్నది. ముగ్గు బుట్టవంటి తల ముడతలుదేరిన దేహం, కాంతిలేని గాజుకళ్లు, ఆమెకన్నా శవం నయం.

ఆ ముసలి అవ్వకు ఎవరూలేరు జబ్బుచేసి పడిపోయింది అడుక్కుతినే శక్తిలేదు. రాబోతున్నది చలికాలం, ఆ దిక్కులేసి దీనురాలు మరణిస్తే ఆ పాపం ఎవరిది ? అని శ్రీశ్రీ ప్రశ్నించాడు. మరి ఈ ప్రశ్నను కవి సంఘాన్ని నిలేస్తున్నట్లే భావించాలి.

ఇక తిలక్ వర్ణించిన ముసలివాడు అనాధ కాదు. ఒకనాడతడు ప్రొఫెసరు, సామ్యవాది, గ్రంథకర్త. ఇప్పుడు వృద్ధాప్యంలో అతడు అరిగిపోయిన చెప్పు లాంటివాడు పక్షవాతం వచ్చి కుక్కిమంచంలో పడ్డాడు. భాగవతం కూనిరాగాలతో చదువుకుంటున్నాడు. ఇతనికి ఇల్లుఉంది, కానీ దాని నిండా గబ్బిలాలు, సాలిగూడులు. భార్య ఉంది, అయితే ఎండిపోయిన ఏటిగట్టులాగా ఆమె కదల్లేదు మెదల్లేదు, గతంలోని ఘనత ఆ ముసలివాణ్ణి బాధిస్తున్నది. వర్తమానం దుర్భరంగా ఉన్నది.

శ్రీశ్రీ వర్ణించిన ముసలిదానికి ఘనమైన గతమూ లేదు వర్తమానంపైన ఆశాలేదు. భవిష్యత్తును గురించిన కలలూలేవు. తిలక్ వర్ణించిన ముసలివాడికి కలలకేం తక్కువలేదు అతడికి ఇంకా ఇంకా మంచి వైద్యం చేయించుకోవాలని కోరిక. అందుకే ఎప్పుడు డాక్టరు స్టెతస్కోపు కలలో కనిపిస్తుంది. భార్య శవం దున్నపోతులు మొదలైన దుస్స్వప్నాలు అతన్ని వెంటాడుతుంటాయి.

తిలక్ వర్ణించిన ముసలివాడు మధ్యతరగతి వాడు. కొడుకులు కోడళ్ళు అంతా ఉంటారు. ఈ ముసలివాణ్ణి ఎవరూ పట్టించుకోరు, అలా అని గాలికి వదిలిపెట్టారు. అలాచేస్తే గౌరవభంగం. చాలీచాలని సంపాదనలు తల్లిదండ్రులు మీద భక్తిఉన్నా ఏమీ చేయలేని అసమర్థత ఈ పరిస్థితులన్నీ శాపాలుగా పరిణమించి, ఆ ముసలివాడు మరణాన్ని గురించి ఆలోచిస్తుంటాడు, చింతిస్తుంటాడు.

సమాజంలో కనపడే బాధలు అనుభవిస్తున్నవారు అట్టడుగు తరగతివారు. అయితే వారికి శ్రమశక్తి అనే ఆయుధం వున్నది. పారిశ్రామిక విప్లవంలో వీరు బలవంతులైనారు. ఇక మధ్యతరగతి బాధలు బయటకు కనిపించవు. ఆ కష్టాల్ని చెప్పుకోవటంకూడ వారు అవమానంగా భావిస్తారు. ఆయా విషయాల్ని తిలక్ కండ్లకు కట్టినట్లుగా వర్ణించాడు. శ్రీశ్రీ అట్టడుగు తరగతి ప్రజల జీవితానికి తిలక్ మధ్యతరగతి ప్రజల జీవనానికి వ్యాఖ్యాతలు.

)○(



' ప్రపంచంలో ద్వేషాలూ, కావేషీలూ, కార్పణ్యాలూ, ఆశలూ సత్ఫలితాన్ని, సంతోషాన్ని లేకుండా చేస్తాయి ద్వేషం ఎంత నీచమైన గుణమో ప్రత్యక్షంగా చూచి అనుభవించిన తరువాతనే బోధపడుతుంది. అంతా అయిపోయిన తరువాతనే మనకు వివేకం కలుగుతుంది. అంతవరకు మోహంలో మునిగి యథార్థాన్ని గుర్తించలేము. '

– శ్రీ రాజాజీ రామాయణం

# గీత - అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వన్ద్వ మోహేన భారత
సర్వ భూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప॥

– విజ్ఞానవంతమైన మానుషజన్మ మెత్తియు జనులు ఏ కారణముచేత భగవత్తత్త్వమును ఎరుగలేకపోవు చున్నారు? అను ప్రశ్నకు సమాధానమిచ్చట చెప్ప బడుచున్నది. "పుట్టినప్పుడే సకల ప్రాణులున్నూ రాగ, ద్వేషములతో కలుగునట్టి ద్వంద్వ మోహముచే మోహమొందుచున్నవి" అని భగవానుని ప్రబోధ. ఇట్టి ద్వంద్వమోహము ద్వంద్వాతీతమైన దివ్యత్వ మును ఎరుగనివ్వజాలదు. రాగ, ద్వేషములనే ఆటగాళ్ళు ప్రపంచమనే రంగస్థలంలో జీవుడనే బంతిని అటునిటు తన్నుతూ ఆడుతున్నారు. రాగ ద్వేషములచే ఈడ్వబడు ఈ జీవుడను బంతి వారి బారినుండి విడివడు నంతవరకు, ఆవలనున్న విశాల జగత్తును అనగా సర్వవ్యాపక బ్రహ్మతత్త్వాన్ని దర్శించలేడు. కనుక ఆత్మానుభూతికి రాగ ద్వేషములే ప్రధాన నిరోధక ములు. వాటినుండి కలుగు విముక్తియే ఆత్మానుభూతికి ప్రధాన సహకారి

ఐతే ఈ రాగ ద్వేషములు మనిషి పుట్టిన తరువాత ఆహార, విహార, సంసర్గ, సంభాషణాది చర్యల వలన కలుగుటలేదు. అతనికి పుట్టుకతోనే అవి కలిగియుంటు న్నవి. శిశువు పుట్టిన వెంటనే ఏడుస్తుంది. ఆకలైతే ఆహారం కావాలనే రాగంతో ఏడుస్తుంది. బాధైతే ఆబాధ దూరం కావాలనే భావంతో అనగా ఆ బాధ యందున్న ద్వేషంతో ఏడుస్తుంది. ఈవిధంగా విచారించగా రాగ ద్వేషాలు ప్రాణియొక్క పుట్టుకతోనే సంప్రాప్తములని నిరూపితమౌచున్నవి. దీనికి కారణము గత జన్మల యందునూ వీటిచే తాను ఆవరింపబడియుండుటే. గత జన్మలయందు వీనియొక్క నిర్మూలనకై తాను పరిశ్ర మించకుండుట ప్రధాన కారణము. కనుక రాగ ద్వేష ములవి నిర్మూలనకై సాధకుడు ప్రప్రథమంగా ప్రయత్నించాలి.

రాగము వలన భిన్నత్వముత్పన్నమౌతుంది. ద్వేషం వలన అది అభివృద్ధిచెందుతుంది. సచ్చిదానందు డైన తనకన్ననూ ఆనందప్రదమైనదేదో కలదను భ్రాంతిచే రాగము అజ్ఞానమును కలిగించుచున్నది. ఈ రాగమే ద్వేషమునకు ఆధారము. రాగమందు తన కామనాని వృత్తి వుంటుంది. ద్వేషమందు పరుల వినాశనముంటుంది. రాగము ప్రాప్తిని కోరుతుంది. ద్వేషము నాశనాన్ని కోరుతుంది. ఆరోగ్యాన్ని కోరటము రాగము, అనారోగ్య నిర్మూలనాన్ని కోరటము ద్వేషము. ఈ విధంగా యోచిస్తె ప్రతి క్షణం రాగ ద్వేషాలే మన మతులను పరిపాలించుచున్నవని తేలుతుంది. ఇవన్నీ దేహధ్యాస, జీవధ్యాసలనుండి ఉత్పన్నములగుచున్నవి. కనుక దైవ ధ్యానను అభివృద్ధి గావించుకుంటే తప్ప ఈ రాగ, ద్వేషములు తొలగవు. ఈ రాగ ద్వేషాదుల వలయం జరుగక ఆత్మసాక్షాత్కారం సిద్ధించనేరదు. అందుకే శ్రీ భగవానుడిచ్చట పుట్టుకతోనే రాగ ద్వేషాదులచే సమస్త ప్రాణులు మోహమొందుచున్న వని ప్రబోధించినారు. కనుక సకల విధ సాధనల కన్ననూ వీని (రాగ ద్వేష) నిర్మూలనమే ప్రధానము. రాగ, ద్వేషాదులు నశించవలెనన్న ప్రేమయే ప్రధాన సాధనము. భగవంతుని యందలి ప్రేమచే రాగము నశిస్తుంది. జగత్తునందలి వైరాగ్యముచే ద్వేషం నశిస్తుంది. ఈ విధంగా భక్తి, వైరాగ్యములచే రాగ ద్వేషాదులంతరిస్తాయి. ఈ రెండింటిని పొందుటకు జ్ఞానమవసరం. కనుక భక్తి, జ్ఞాన, వైరాగ్యములనే త్రివేణీ సంగమంలో మునిగి రాగ, ద్వేష కల్మష రహితులై ఆత్మస్వరూపులై వర్ధిల్లెదముగాక! ○

# నిప్పును తాకకండి

-ఆర్. యస్. కె. మూర్తి

"తీర్పు" అని ఆ మధ్యన తెలుగు చిత్రం వచ్చింది. అక్కినేని చిత్రం జడ్జిగా నిష్కళంకుడిగా పేరు తెచ్చుకున్న, రిటైరైన మంచివాని పాత్ర అక్కినేనిది ఆ మాజీ జడ్జీగారికి ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. పెద్ద కొడుకు పోలీసు అధికారి. రెండవ కొడుకు స్ట్రీట్ రౌడీ అయినా, చాల మంచి వాడన్నమాట కూతురు కాలేజీ విద్యార్థిని ప్రేమలో పడుతుంది సాంప్రదాయకంగా. సరే, విలన్ ఉంటాడు. మెత్తగా గొంతులు కోసే రకం పచ్చినెత్తురు త్రాగుతూ పరమాన్నం తాగుతున్నట్లు నటించగల రాజకీయుడు ఆయన. మంచివాడైన స్ట్రీట్ రౌడీ చిన్నకొడుకు విలన్ గారితో అక్కడా ఇక్కడా తలపడుతూ ఉంటాడు. కూతురు ప్రేమించిన అందగాడు ఈ విలన్‌గారి సుపుత్రుడే! దాంతో ఈ మొత్తం కుటుంబమే యిబ్బందుల్లో పడుతూ ఉంటుంది. మాజీ జడ్జిగారిని ఆ విలన్ బ్లాక్‌మెయిల్ చేసి, కోర్టులో సాక్ష్యం సజావుగా చెప్పనీయడు. పోలీసాఫీసరైన పెద్దకొడుకు చాల మంచివాడని తల్లిదండ్రుల నమ్మకం. కాని చివరికేమవుతుందంటే ఆ పెద్దకొడుకు పెద్ద అవినీతిపరుడు పచ్చి నెత్తురు త్రాగే విలన్‌కు అన్ని విధాలా అనుచరుడు. కథ క్లైమాక్సుకి వచ్చిన తర్వాత విలన్, పెద్దకొడుకులనుండి రక్షించటానికై మాజీ జడ్జిగారే తుపాకీతో వాళ్ళను కాల్చివేస్తాడు ముద్దాయిగా బోనులో నిలబడతాడు. ఇదంతా మనకు అప్రస్తుతం.

ప్రస్తుతమేమిటంటే— ఆ బోనులో నుంచి ఆయనో మాట చెప్తాడు. మా పెద్దవానిలో అవినీతి... చిన్నవానిలో జులాయితనం, చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకునే స్వభావం— నా రక్తంలో లేవే? నా కొడుకుల్లో ఎట్లా వచ్చినాయి మిలార్డ్? అని ఆ మాజీ జడ్జి నిర్వేదం ప్రకటిస్తారు.

నేడు రేపు మన సామాజిక జీవనంలో, ప్రత్యేకించి యువతీ యువకుల్లో పెచ్చుమీరిపోతున్న వికారపు ధోరణులు చూస్తుంటే మనకీ ప్రశ్నే ఎదురవుతున్నది. క్షణం క్షణం.

తల్లీ తండ్రి పొలాల్లో పనీ పాటలు చేసుకుంటుంటారు. దేవుడూ దైవమూ... నీతి ధర్మం.... మంచి చెడూ.... వీటన్నింటిని గౌరవిస్తూ ఉంటారు సాత్విక జీవనులై ఉంటారు. కాని పిల్లలను చదువులకని కాలేజీలకో, విశ్వవిద్యాలయాలకో పంపిస్తారు. అక్కడ ఆ పిల్లల ప్రవర్తన ఎట్లా రూపొందుతున్నది? కొంత మందిలోనే అయినా?

వారు దురలవాట్లకు లోనవుతున్నారు. జులాయిలవుతున్నారు దైవం, ధర్మం ఎరుగని వారవుతున్నారు. నీతి న్యాయం పట్టించుకోలేనివారవుతున్నారు రజోగుణం కాదంటే తమోగుణం — వారి గుణమవుతున్నది. మాటల్లో మర్యాద ఉండదు ప్రవర్తనలో సంస్కారముండదు. ఇవన్నీ వారి తల్లి తండ్రులలో లేని గుణాలే వీరికెక్కడనుంచి వచ్చినాయి? వీరి చదువు వీరికేమిటి నేర్పుతున్నది? ఆధునిక 'నాగరికత' స్వరూప స్వభావాలు ఏమిటసలు? తల్లితండ్రులు పూజలు పునస్కారాలు ఏవో చేస్తుంటే వెక్కిరించే కొడుకులు కూతుళ్లు ఎంతమంది తయారవుతున్నారు? ప్రేమలూ దోమలూ అంటూ ఎంతమంది

కొడుకులూ, కూతుళ్ళూ సంసారాలను అంపపుకోతకు గురిచేయటంలేదు ? ఈ మధ్య ఒక సర్వేలో తేలిన అంశం - వివాహానికి పూర్వం లైంగిక సంబంధాలుండటం తప్పుకాదని .... 30 - 40 శాతంమంది భారతీయ యువతీ యువకులు విశ్వసిస్తున్నారుట ! ఎవరి రక్తం లోనివీ - వికారాలన్నీ ? వారి వారి తల్లిదండ్రుల రక్తం లోనివి అయిఉండవు. ఈ సమాజపు సంస్కృతిలో అవి అంశాలు కావు మరెక్కడనుండి వచ్చి, మన యువతీ యువకుల్లో స్థానం సంపాదించుకోగలుగుతున్నాయి ? నేడు రేపు - యిట్టి వికారపు ధోరణులు, వికృతపు ప్రవర్తనలు వీరిలో సరే రేపు వీరికి పుట్టబోయే సంతానం ఎట్లా ఉండబోతున్నారు ?

మన రచయితలు .... మన పత్రికలు .... మన సినిమాలు .... అన్నీ జీవనరంగాలకే వారే నాయకులుగా రూపొందుతున్న రాజకీయవాదులు - ఈ ప్రశ్న లేమన్నా వేసుకుంటారా ?

## హింసా - వ్యామోహాలు

ఇవన్నీ నేడు రేపు మన 'రేపటి తరం' లో గూడు చేసుకుంటున్న వ్యామోహాలు. మన తరంలో యివి పూర్తిగా బహిష్కరించబడినవి కాదు. కాని మన పూర్వీకులు ఎరుగనే ఎరుగని వింత వ్యామోహాలివి.

ఇక హింసావాదులున్నారు. హింసకు పాల్పడేవారు వేరు, హింసావాదులువేరు. హింసకు పాల్పడేవారందరూ హింసావాదులుకారు. ఏ రౌడీనో, గూండానో వెయ్యికో

# రామాయణ మహాసభలు

ఇటీవల బాంకాక్‌లో రామాయణం మీద మూడు రోజులపాటు అంతర్జాతీయ సదస్సు జరిగింది. ఈ మహాసభలకు థాయ్‌లాండ్ యువరాణి " గల్యానివాదన " అధ్యక్షత వహించారు. ఈమె ప్రముఖ సంస్కృత పండితురాలు. రామాయణ, భారతాది గ్రంథ ములను క్షుణ్ణంగా అధ్యయనం చేసిందట. ఈ సదస్సులో అమెరికా, కెనడా, చైనా, ఇండోనేషియా, మలేషియా, భారత్ వంటి 20 దేశాల పండితులు పాల్గొన్నారు. పాల్గొనిన వక్తలు శ్రీరాముడు ప్రబోధించిన భాతృ తత్వాన్ని గురించి, ఆయన పాటించిన ఉన్నతి విలువలను గురించి ప్రసంగించారు.

1965 సం॥లో ఇండోనేషియాలో "ప్రపంచ రామాయణ మహాసభలు" అక్కడి ప్రభుత్వ ఆధ్వర్యముననే నిర్వహించబడినాయి. ఇండో నేషియా పరిపాలకులు ముస్లిములే అయినప్పటికి రామాయణ మహాకావ్యాన్ని ఆదరించడం విశేషం. రష్యావారు సహితం రామాయణాన్ని తమ భాషలోనికి అనువదించుకోవడం మరో విశేషం. టి.వి. రామాయణ కాసెట్లకు రష్యాలో ఈనాడు మంచి గిరాకీ ఉన్నదట. వేల సంవత్సరాలైనప్పటికీ, ప్రపంచ ప్రజల హృదయాలలో శాశ్వతంగా స్థిరమైన స్థానాన్ని ఆక్రమించుకొనిన ఘనత రామాయణ మహా కావ్యానికే దక్కింది. ○

వందకో ఆశపడో, మరో దురాకర్షణతోనో .... మరో మనిషిని చంపుతాడు. అతను హింసావాదికాడు అట్లా చంపటంలో తప్పులేదనీ .... అసలట్లా చంపటమే ధర్మమనీ .... అట్లా చంపితేనే సమానత్వమో వల్లకాడో సాధించబడుతుందనీ .... సిద్ధాంతరీత్యా వాదించే వారంటుంటారు. వాళ్ళు హింసావాదులు తమ మతమ్మం అనుసరించని వారందరూ నరకానికి పోతారు అట్టి వారిని ఉద్ధరించటానికై కత్తి పట్టయినా సరే, వారిని తమ మతంలోకి మార్పిడి చేయించాలనే వారుంటారు - వారు హింసావాదులు తమోగుణ ప్రధానులు వీరు. సర్వ ధర్మములో సమానమే ఎవరిమార్గాన వారు భగవానుని చేరుకోవచ్చు. ఆకాశం నుంచి కురిసిన నీరంతా సాగరానికి చేరుతుందనే మతవిశ్వాసం గల వారుంటారు. వీరు సత్వగుణప్రధానులు. అన్ని మతాలూ ఒక్కటే అనే ఒక విశాలమైన వాక్యం ప్రతిపాదిస్తుంటాం కాదు ఇట్లాంటి రజో, తమో గుణ ప్రధానమైన విశ్వాసాల తాకిడివల్ల సత్వగుణ ప్రధానమైన మన ధోరణుల్లో మార్పు వస్తున్నది.

అదలా ఉంచుదాం హింసావాదుల సంగతి కదా ప్రస్తావించుకుంటున్నది కొందరు సిద్ధాంతవాదులున్నారు మనుషుల్లో సహజ శత్రువులున్నారు ఆలనాటి రాక్షసులవంటివారు. వారికి 'ఖతం' చేయటమే న్యాయం ఎవరికి వారే చట్టాల్ని చేతుల్లోకి తీసుకోవచ్చు, శిక్ష విధించవచ్చు, అవును, మరణ దండన కూడా మనకు విధించవచ్చు కాళ్ళు నరకవచ్చు, చేతులు ఉత్తరించవచ్చు, తప్పులేదు ఆసలదే న్యాయంఅని వాదించేవారు. 'తీర్పు' చిత్రంలో మాజీ న్యాయాధీశుని రెండవ కుమారుడు ఇటువంటివాడే,

ఇట్లాంటి సిద్ధాంతం విశ్వాసం ఆ రెండో కొడుకు తండ్రి రక్తంలో లేదు మన జాతి భావనా ప్రవంతిలోనే అటువంటిది లేదు. దుష్ట శిక్షణ చేయవలసిన వాడు ప్రభువు. ఆయనే శిష్ట రక్షణ కూడా చేస్తాడు, ఆధునిక కాలంలో ప్రభువుకు పర్యాయం చట్టం. చట్టం దోషులను శిక్షించాలి ధర్మం పాపులను శిక్షిస్తుంది. చట్టం మంచివారికి అండగా నిలవాలి. ధర్మం ధర్మపరులకు రక్షణనిస్తుంది. 'ధర్మో రక్షతి రక్షితః'

మరా ప్రభువే నేడు దుర్మార్గుడైపోయాడు గదా! చట్టం ఓటికిపోతున్నది గదా! నిజమే, అది మన స్వయంకృతం సమిష్టిగా మనం మంచి ప్రభుత్వాన్ని ఎంచుకోలేకపోతున్నాం. మనం దుర్వ్యామోహాలకు లోనవుతున్నాం. అధర్మపరులని తెలిసినవారిని అందలమెక్కిస్తున్నాం. మనకు తగిన ప్రభుత్వమే మనకు వస్తుంది. గంతకు తగ్గ బొంత!

అట్లా అని.... మన సంస్కృతి సాంప్రదాయాలకు మన పూర్వీకుల రక్తానికి మన సాత్త్విక జీవన విషకు, విరుద్ధంగా వ్యతిరేకమైన మార్గాన పోదామా?

## సాకేతపతి కది కీర్తి కరమా?

సీతాసాధ్వి లంకలో నిర్బంధితురాలైంది. కామ పిశాచం ఆవహించిన రావణుడు ఆమెను చెరబట్టాడు. విశ్వనాథవారు తమ 'రామాయణ కల్పవృక్షం' లో ఈ రాక్షసరాజుని నేడు రేపు పెచ్చుమీరిపోతున్న విశృంఖలత్వానికి ప్రతీకగా రూపొందించంటారు. స్వేచ్ఛాప్రణయం వంటి ఆధునిక దుర్భావనలకీ రాక్షస రాజు మూర్తిమంతం.

పరకాంతల హరించి రమించుట
పరమ ధర్మము మారుల మంత!

అంటాడీ రావణహతకుడు సీతా సాధ్వితోనే! నేడు, రేపు యిట్లాంటి ధర్మపరులు హీరోలుగా బోలెడన్ని రచనలు, చలన చిత్రాలు వస్తున్నాయి గదా!

అదలా ఉంచుదాం. రావణుడు చెరపట్టిన సీతను హనుమంతుడు కనుగొన్నాడు. ఆమెకు తన నెరిగించు కున్నాడు. ఆమెకు రామబంటు యందు విశ్వాసం కలిగింది. అప్పుడాయన సీతమ్మ తల్లిని తన భుజములపై మోసుకొని రాముని వద్దకు గొనిపోతాను రమ్మంటాడు. అంటే ప్రభువు చేయవలసిన పనిని తానే చేస్తానంటాడు, ఆ తల్లి అంగీకరిస్తుందా ?

ఇందుండి నన్ను ఈ క్షణమందే
కొనిపోగల సమర్థుడవీవే !

అని ఆ తల్లి ఒప్పుకుంటుంది. కాని ఏమంటుంది ?

రాముని వేగమె తోడ్కొనిరమ్ము
రాక్షసచెర నాకు తొలగింపుము

అంటుందామె, అంటే ఏమిటి అర్థం ? పిచ్చినాయనా, నా చెర వదిలించే పని నీది కాదు, అది ప్రభువు పని. ఆయన వచ్చి దుష్టశిక్షణచేసి, తనను చెర విడిపించి తీసుకొనివెళ్ళాలని ఆమె భావం కాదని హనుమంతుని తోనే తాను వెళ్ళిపోతే—

మహాపరాక్రమ విశ్రుతుడైన
సాకేత పతికది కీర్తి కరమా ?

అని ఆ తల్లి రామబంటుతో తాను వెళ్ళనంటున్నది, పరోక్షంగా హనుమంతునితో పరాధికారం పైన వేసుకో వద్దని చెబుతుంది. కాని ఆధునిక హింసావాదులు ఏమని వాదిస్తున్నారు ? చట్టం చేయవలసిన పని మనం చేస్తే తప్పులేదంటున్నారు, కారణం మన ప్రభువులు యిప్పుడు శ్రీరామచంద్రులు కారు.

నిజమే, కాకపోతే మనం దేనికై తపించాలి ! శ్రమించాలి ? రామరాజ్యం కోసమా ? పరాధికారం పైన వేసుకోవచ్చుననే గాడిదల ధర్మం కోసమా ?

ఇట్లాంటి హింసావాదుల వికృతలక్షణం మాజీ జడ్జీగారి రక్తంలోనే కాదు. మన సంస్కృతిలోకూడ లేదు. సి. నా. రె. ఒకచోట వ్రాస్తారు, 'ఇది ఈ జాతి బీజం కాదు' అని.

## అవినీతి జన్యుకణాలు

అట్లాగే నేడు మన సహజ జీవితాన్ని అతలాకుతలం చేసిపారేస్తున్న రెండో భూతం అవినీతి ఈ భూతపు జన్యుకణాలు కూడ ఈ దేశపు రక్తంలోనివి కావు. 'తీర్పు' సినిమాలో తన పెద్దకొడుకును ఆవహించిన అవినీతి భూతపు జన్యుకణాలు తన రక్తంలోనివి కాదని అన్నట్లుగా, పరుల సొమ్ము మనకు నిప్పు లాంటిది. మనం దానిని ముట్టుకుంటే కాలిపోతామన్న ధార్మిక విశ్వాసం మన జాతి జన్యుకణం. పరాయిసొమ్మును పరమాన్నంలాగా జుర్రుకుందామనే ప్రలోభం మనది కాదు. ఉన్నదానిలో జీవించు, లేనిదానికి ఆశించకు, ఇదీ మనకు పరమ నీతి

కాకులు ఎక్కడెక్కడో తిన్న పండ్లగింజలను మన పెరటులలో పడవేస్తూ ఉంటాయి, మన పెరట్లలో పిచ్చి మొక్కలు మొలుస్తూ ఉంటాయి. అట్లాగే యిలాంటి పిచ్చిపిచ్చి భావనలు, వాదనలు మన జాతి పెరటులో ఎక్కడినుంచో వచ్చిపడినవే తప్ప.... ఇవి ఈ జాతి బీజాలు కావు.

వెయ్యేళ్ళపాటు మన జాతి బానిసత్వంలో మగ్గి పోయింది, పరాయి పాలనను అనుభవించింది తప్పని సరిగా పరభావనల ప్రభావంలోకి వచ్చింది. భౌతిక వాదులైన పాశ్చాత్యులు తమలోని లోటును గమనించి మనదైన ఆధ్యాత్మిక జీవన వెలుగులోకి పరితపిస్తుంటే మనం పాశ్చాత్య జీవన వ్యామోహితులమై వారి భౌతిక వాదపు చీకట్లలోకి నడుచుకుంటూ వెళ్ళాం. వెళ్ళటం

మన దురదృష్టం, మనఖర్మ ఇప్పుడూ అటే వెళ్తున్నాం. అదే మన అవివేకం స్వాతంత్ర్యానంతరం మనం మనదైన అధ్యాత్మిక - సాత్విక జీవన విలువల పునరుద్ధరణకై ఆరాటపడటంలేదు. వస్తు వ్యామోహమే మనలో అవినీతిని పెంచుతున్నది. 'ధనం మూలం మిదం జగత్' అన్నది విమర్శగా చెప్పిన మాట, నీతి వాక్యమవుతున్నది

## మనలో లేవా ?

ఒకమాట అనవచ్చు త్రాగుడు, జూదం, వ్యభిచారం వాటిని మన పూర్వులలో లేవా ? పాశ్చాత్యుల నుంచే వచ్చినాయా ? ఉన్నాయి కాని ఎట్లా ? అని మహా పాత కాల వివేచనతో, నరకద్వారాలనే హెచ్చరికతో. అయినా వాటికి దాసులైనవారు లేరా ? ఉన్నారు మంచి చెడూ మనుష్యుల మధ్య ఎప్పుడూ ఉంటాయి చెడు చెడు కాదనే దుష్టనమ్మకం మనకెప్పుడూ లేదు. నీతి బాహ్యత నాగరికతా అనే మూర్ఖత్వం మనలో ఏనాడూ లేదు. పరపీడన న్యాయమనే రాక్షసత్వం మన జాతి బీజం కాదు.

పెద్దలు, ప్రముఖులు ఆలోచించుకోవాలి. యువతీ యువకులు గుర్తెరగాలి. దుర్వ్యామోహాలకు, దుష్ట భావనలకు దూరంగా ఉండటమే తమకు శ్రేయోదాయక మని నిప్పును తాకరావని, తాకితే ముందు వెచ్చదనం యిచ్చినా .... అటుపై వేడి .... ఆ పైన బూడిద మాత్రమే మిగులుతుందని నిప్పును తాకం.

ఇది యువతావాణిగా రూపొందాలి. ○

# రాగోదయం

-- డాక్టర్ ఆచార్య తిరుమల

గాలికి మ్రోగే ఈ వీణ నుండి
నిర్గమించిన రాగం
పరిమళమై
ఆత్మలా అంతా నిండి వుంది !
చర్మ చక్షువులు వినలేని
శ్రుతి లయాత్మక సంగీతాన్ని
హృదయం మాత్రమే వినగలుగుతోంది
శాస్త్ర మత్తేభాలు ఘీంకరించే
కర్కశ తర్క శార్దూలాలు గాండ్రించే
మేధస్సులో ఉషస్సౌందర్య సాక్షాత్కారం
ఎలా జరుగుతుంది ?
అక్షరానికి అతీతంగా
అవ్యయ జ్ఞాన సముద్రం మీద
ఉదయిస్తున్న సూర్యుణ్ని
సహస్రార చక్రవేదిక మీద
దర్శించగల నేత్రాల్ని
దానం చేయుమని
అంతర్ధానమైన అంధకారాన్ని ప్రార్థించు
పదహారు ముక్కలైన చంద్రుణ్ని
మూటగట్టుకొని మోస్తున్న మనసుని
వాఙ్మయ ప్రపంచం నుండి వెలికివేసి
చిన్మయ గృహంలో బంధించు
పరిమళించే ఆత్మలో లీనమై
పరవశించు
కాలం ఖడ్గధారకు భగ్నమై
ఈ వీణ శూన్యంలో కలిసినా
విచారించవలసిన పనిలేదు
హృదయాన్ని కేతనంగా ధరించి
ఉదయ శిఖరం మీద ఉదయించు.

# గీత గోవిందం

సి. వేదపతి

అసలు అనుకుంటాను - మానవీయమైన అనుబంధాలు అన్నింటిలోకీ, అతి గాఢమైనదీ - అత్యంత సుందరమైనదీ - స్త్రీ పురుషుల మధ్య పుట్టుకువచ్చే ఆకర్షణా - అనురాగమూ అని ! ఇందులో నుంచే అన్ని రకాల భావాలూ, రసాలూ, రాగాలూ ఏర్పడి ఉంటాయి. మహోన్నతంగా మనసును ఊపి వేసే ఈ ప్రణయ ప్రవృత్తినుంచే కరుణా, వాత్సల్యమూ, స్నేహమూ, త్యాగమూ, విషాదమూ, ఆరాధనా, ప్రపత్తీ - వంటి అనుభూతులు ఉద్భవించి ఉంటాయి. మనిషి జీవితాన్ని రస చైతన్యంతో నింపి, అత్యంత మాధురీమయం చేయగల హృదయ గతమైన ఈ అనురక్తి ఈ సమస్త సృష్టిస్థితికే మూలభూతమైన మహాశక్తి.

స్వచ్ఛమైన అనురాగాన్నీ, ప్రణయాన్ని గురించిన ఆలోచన వచ్చినప్పుడు ముందుగా మన భారతీయాత్మకు స్ఫురణకు వచ్చేది రాధాకృష్ణులు. రస జగత్తుకు సంబంధించినంత వరకు అపురూపమైన అనురాగానికి ప్రతీకగా నిలచినవారు. ఇద్దరూ కలిస్తే-ఒకశృంగార రసార్ణవమే అయినవారు.

భారతీయ సాహిత్యాలన్నిటిలోనూ ఈ ఇద్దరనూ మించిన శృంగార మూర్తులు లేరనే చెప్పాలి. నాటి నుంచీ నేటి వరకూ, ఎందరు మహాకవుల ఊహా కల్పనలో ఆ ప్రణయమూర్తులు విహరించారో ఎన్నెన్ని కవిత్వాలు, శిల్పాలు, చిత్రలేఖనలు - ఆ జంటతనంలోని అద్వైత సిద్ధిని అనుభూతం చేయటానికి ప్రయత్నించాయో !

సంస్కృతంలో తన గీత గోవింద కావ్యలో రాధా మాధవ ప్రణయ గీతను రసవత్తర గీత కావ్యంగా రచించిన రసపత్కవి జయదేవుడు. ముందుగా తాను 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' అయినాడు. అందుకే రాధా కృష్ణుల ప్రణయ జీవితంలోని పరమ రహస్య ఘట్టాలను ; ఉత్కటమైన శృంగార రసాభినివేశంతో తనగీతికావ్యంలో సుమనోహరంగా చిత్రించగలిగినాడు

రక్తినీ, భక్తినీ - సమపాళ్ళలో రంగరించుకొన్నది గీత గోవింద కావ్యం కోమలమైన పదాలు - సంగీత రస ప్రధానాలు, శృంగార రస బంధురాలు !

ఒక్కొక్క భావమూ, అందుకు అమరుకొన్న పదాల పొందికా - ఆయన భాషలోనే చెప్పాలంటే - 'లలిత లవంగ లతా పరిశీలన కోమల మలయ సమీరాలై' మనలను స్పృశిస్తాయి రసలుబ్ధులైన వారి హృదయాలకు తుష్టిని ప్రసాదిస్తాయి

భక్తిలో రక్తిని దర్శించుకొన్నాడు జయదేవుడు. విడతీయరాని ఒక అద్భుతమైన అద్వైత మూర్తిమత్వం ఆయనకు గోచరించింది. ఆ ఇద్దరినీ గురించిన ఎన్నో కథలూ గాథలూ అంతకు ముందే వినిఉన్నాడు. ఇంకెన్నో శృంగారమయ భావనలు ఆ జంట చుట్టూ అల్లుకొన్నాయి స్వర, తాళ, పదాత్మకమైన కవిత్వం వెల్లుబికి వచ్చింది జయదేవ కవి హృదయాంతరాళాల నుండి కథనాత్మకమూ, వర్ణనాత్మకమూ అయిన గీత గోవింద కావ్యం కవి గళంలో రాగాలు పుంజుకొని పుట్టుకువచ్చింది. కావ్యానికి మంజీర నాదాలు సమకూర్చినది జయదేవుని హృదయేశ్వరీ, జీవితేశ్వరీ అయిన పద్మ.

సంగీత, సాహిత్య, నృత్యాత్మకమైన ఒక దివ్య శృంగార కావ్యం జయదేవ కవి మనోలోకంలో ఇలా రూపుదిద్దుకొని ఆవిర్భవించింది

ఈ కావ్యంలోని రసం శృంగారం, రాధాకృష్ణుల మధ్య అన్యోన్య ప్రేమనూ, శృంగారమయ భావాలనూ, విరహాన్నీ, సంయోగ సంతోషాన్నీ మహాపరవశంగా వర్ణిస్తాడు కవి.

సాహిత్యపరంగా ఇందులోని విశేషం ఏమంటే, ఈ రాధాకృష్ణ ప్రణయాన్ని నాటకీయ ధోరణిలో సంభాషణాత్మకంగా కావ్యంలో కవి నడిపించిన తీరు.

కావ్యంలో మూడే పాత్రలు రాధ, కృష్ణుడు, సఖి ఈ ముగ్గురితోనూ ఒక గాఢమైన, కాంక్షభరితమైన, ప్రియంకరమైన ప్రేమకథ అంతా నడుస్తుంది భావ వివశుడైన కవి ఈ ప్రేమికుల పరస్పరానురాగాన్ని- సుందరమైన ప్రతీకలతో, లాలిత్యం ఒలికే కవితా శక్తితో కథాకథనంగా గీతరచనకు ఉపక్రమిస్తాడు

కావ్యమా ఇది ! ఇది నాటకమా ? గీతసంకలనమా? ఏ ఒక్కటీ కాదు కాని గీతగోవిందం- అన్నీ ని !

కొందరు దీనిని కేవలము శృంగార సంబంధమయిన అసత్కావ్యంగా పరిగణించారు. మరికొందరు వైష్ణవ భాగవతులు భక్తిప్రపూర్ణమైన ఆధ్యాత్మిక గ్రంథంగా భావిస్తారు.

ఉదాత్తమైన ప్రణయ ప్రవత్తికన్నా ఎక్కువగా భౌతికమైన కామశృంగారాన్ని ప్రతిపాదిస్తూ వర్ణించడం, కవితాదృష్టికి బాధాకరం అంటారు కొందరు. భౌతికం కాని పారమార్థికదృష్టితో చూస్తే, కావ్యమంతా మధుర భక్తిప్రపూర్ణమైనదనీ- ఆత్మ, పరమాత్మను చేరి ముక్తిని పొందడాన్ని సంకేతపూర్వకంగా చెప్పబడినదనీ అంటారు మరికొందరు.

భౌతికవాదులు కావ్యంలోని శృంగారభావ రసాను భూతికి పరవశులవుతుంటే, ఆధ్యాత్మికవాదులు రాధా కృష్ణుల ప్రణయానుభూతిలో పరతత్త్వ ప్రతిపాదనం చేసే ప్రయత్నంలో పరమానందం పొందుతారు.

నాకు అనిపిస్తుంది- కావ్యం ఇంతటి రసాత్మకమైనదైనప్పుడు- ఉన్నది ఉన్నట్లుగానే మనం ఎందుకు ఆస్వాదించి ఆనందించకూడదు ? ఇహపరాలను కొంత సేపు ప్రక్కన ఉంచి- గీతగోవిందాన్ని చదివీ, వినీ, చూచీ- హృదయరాసికృతను మనం ఎందుకు పండించుకోరాదు.

నిజ జీవితంలోనూ అద్వైత ప్రణయబంధాన్ని సిద్ధింపచేసుకొన్నాడు జయదేవుడు. భక్తి చేతనో రక్తి చేతనో- అట్టి గట్టి ప్రణయబంధానికి ప్రతీకలుగా రాధా కృష్ణులను ఎంచుకొని కావ్యరచనకు ఉపక్రమించాడు రససిద్ధుడు జయదేవుడు.

అసలు కృష్ణకథలోనే గొప్ప ఆకర్షణ ఉంది. చెప్పరాని తీపిదనం ఉంది !

ఎవరు ఈ కృష్ణుడు ?

అందగాడు, అధికారం కలవాడు, ఇట్టే ఆకర్షిస్తాడు, అందరినీ ! సమ్మోహనకరమైనరూపం అది ! నవ్వుతాడు, నవ్విస్తాడు ! కొంటె కోణంగి ! హాస్యాలు ఆడతాడు ! చతురుడు, చమత్కారి, శృంగారి ! అందరినీ అలరించగల ఆకర్షణ ఉంది. శాసించగల ప్రతిభ ఉంది ! ఇన్నీ- ఇవన్నీకాక మరెన్నో కలిగినవాడు ఒక అపురూప అద్భుత వ్యక్తి కాక మరేమవుతాడు ?

ఎవరు ఈ రాధ !

విష్ణుపురాణంలోనూ, హరివంశంలోనూ, భాగవతంలోనూ కూడా కనుపించని రాధ- కవులనూ, కవులు కాని వారినీ కూడా అలరిస్తూ, నామమాత్రం చేతనో ఏవో సుమనోహర భావలహరులను రేకెత్తించగల సౌందర్యమూర్తి ! ప్రణయిని ! బృందావనంలో పుట్టి పెరిగే ఒక నల్లచిన్నవాణ్ణి చూచినప్పుడల్లా ఆమె గుండెల్లో ఒక ఉలికిపాటు ! కలవరపాటు ! వాడు తనకంటే కొంత

చిన్నయితేనేమి ! పెద్దయితేనేమి ! వాడి కంఠం, వాడి నెమలిపింఛం, వాడి వాలుచూపూ, వాడి చిరునవ్వూ, వాడి వేణుగానమూ- రవ్వంత తాకినా చాలు- మనస్సు మకరందధార అయిపోతుంది ! మాధుర్య మందాకిని అయిపోతుంది.

అటు అతడు - ఇటు ఈమె !

పరిశోధకులు పట్టి పట్టీ తరచి చూస్తారు. రాధ పేరు భాగవతంలో వినపడదే ? కృష్ణుడు రాధామనోహరుడు ఎట్లా అయినాడు ? అని వితర్కిస్తారు

అవునండీ ! 'రాధామనోహరం' అన్నది ఒక అందమైన పువ్వు పేరు ! ఎంతటి గడుసువాడు కాకుంటే - పువ్వు పేరున ఎక్కి కూడా ఆమెను కవ్విస్తాడు వాడు.

పండిత పరిశోధకులు వెతికి వెతికి రాధను బ్రహ్మవైవర్త పురాణంలో ఉన్నదని పట్టుకున్నారు. దేవీ భాగవతంలోనూ, గర్గ సంహితలోనూ ఆమె ఉనికిని కనుగొన్నారు.

ఎవ్వరెక్కడ పుడితేనేమీ - అతడు పురుషుడు - ఆమె స్త్రీ ! ఆమె స్త్రీత్వం అతనికి ఆధారం అతని పురుషత్వం ఆమెకు ఆలంబన ! అర్థబిందువులు వారు- కలిసి పూర్ణబింపువులైనారు.

ఒకరంటే ఒకరికి పట్టరాని ప్రేమ. ఆ ప్రేమ వారి అంతఃకరణ స్పందనల నుంచే పుట్టింది. అది ఆ ఇద్దరికీ అభేద స్థితిని కలిగించింది.

అది ఎంతటి ఆత్మగతమైన స్థితి - అంటే పురుషుడు అంటున్నాడు స్త్రీతో -

'తెల్లదనం పాలలో ఉన్నట్లు, మండే గుణం నిప్పులో ఉన్నట్లు, భూమిలో వాసనఉన్నట్లు, నీటిలో చలువదనం ఉన్నట్లు - నీలో నేను కలసి ఉన్నాను'

" మయా వినా త్వాం స్త్రీవా చ
అదృశ్యోహం త్వయా వినా "

" నేను లేనిదే నీకు ప్రాణం లేదు - నీవు లేనిదే నాకు అస్తిత్వం లేదు " అని కూడా అంటాడు.

అయితే ఆ స్త్రీ పురుషులు ఏ నల దమయంతో, శకుంతలా దుష్యంతులో, సుభద్రార్జునులో అయి ఉంటే మన భారతీయ దృష్టికి పేచీ ఉండకపోనూ.

కాని, అత్యంత ప్రేమికులైన రాధాకృష్ణులు భార్యాభర్తలు కారు. వావి వరుసలున్నవారుగానైనా తోచదు. అయితేనేమి ! ఆ జంటను చూచి కనుబొమలెత్తినవారేరీ.

లేరు సరికదా - అందరూ ఆ ప్రణయమూర్తులకు హారతి పట్టినవారే ! ఆరాధించినవారే ! కొసరి - కొసరి ఆ ఇద్దరనూ ప్రణయైక మూర్తులుగా, శృంగార రసాధిదేవతలుగా తీర్చిదిద్దుకున్నవారే.

శృంగార రసంలో ముంచి తీసిన కలంతో ఒక

---

'సత్యాన్ని ప్రేమించేవాడే అసత్యాన్ని ఖండించగలడు. సత్యజీవనం వల్ల అంధ విశ్వాసాలు పటాపంచలైపోతాయి సత్య వాక్కు వ్యర్థం కాని సుస్థిర వాక్కు, సత్యం గొప్పతనం నిగ్రహులకు మాత్రమే తెలుస్తుంది. సమత మమతల సంరక్షణే సత్యం అసహనాన్ని, దౌర్జన్యాన్ని అరికట్టే మహత్తర శక్తి సత్యం, నీతికి, నిర్భీతికి ఆధారం సత్యం మానవ హృదయ ప్రశాంతికి, జీవన సుఖశాంతికి సత్యం సరయినదారి. '

- శ్రీ మహాత్మా గాంధి

---

రసమయ గీత కావ్యానికి శ్రీకారం చుట్టుకొన్నాడు జయదేవ కవి. అవతారికా శ్లోకం లో ఒక నేపథ్య చిత్రాన్ని రచించాడు.

" మేఘైర్మేదుర మంబరం వనభువః
శ్యామా స్తమా ద్రుమైః "

అంటూ ప్రారంభించాడు.

అద్భుతమైన కవితా సౌకుమర్యం - శ్లోకార్థంలోనూ పదలాలిత్యం లోనూ

' ఆకాశమంతా దట్టమైన మబ్బులు కమ్ముకొన్నాయి. అడవి అంతా కానుగుచెట్లతో నల్లగా కనిపిస్తున్నది, రాత్రివేళ ! కృష్ణయ్య రాత్రుల్లో భయపడుతాడు ! రాధా ! నీవు తొందరగా కృష్ణుణ్ణి ఇంటికి తీసుకువెళ్ళ'.... అంటూ కృష్ణుడి తండ్రి నందుడు రాధను ఆదేశించాడు.

ఒక అందమైన, మానవీయమైన సన్నివేశం. చీకటి పడితే కృష్ణయ్యకు భయమవుతుందట ! ఆ వేళప్పుడు - అంతటి భయస్థుడు అడవిలో ఎందుకు ఉన్నాడో! రాత్రి అయేవరకూ మేఘాలున్నూ ఆకాశాన్ని చిక్కగా అల్లుకోవడం ప్రారంభించాయి ! అడవి చూస్తే తుమ్మచెట్లే కారు నల్లగా కనిపిస్తున్నది. భయపడే కృష్ణయ్యకు తోడు కావలసివచ్చింది రాధ. రమణీయ సన్నివేశం కదా !

ఇకనేమి ! ఇద్దరూ స్వేచ్ఛా విహంగాలు అయిపోయారు. దొరికిన ఏకాంతాన్ని పుష్కలంగా వినియోగించుకున్నారు. యమున ఒడ్డున చెట్టాపట్టాలు వేసుకొని పరుగులు తీశారు. పొదరిళ్ళ మాటున దూరిపోయారు ఇది ఆ రాధాకృష్ణుల లీల ! క్రీడ. ఈ రహః కేళికి జయం కలగాలి.

ఇదీ జయదేవ కవి తన కావ్యానికి చేసిన నాందీ ప్రస్తావన ! ప్రస్తావన ఇంత తియ్యగా ఉంటే ప్రస్తారం మరింకెంత మధురంగా ఉండి ఉండాలి.

చిత్రిస్తాడు కవి - రాగ రంజితంగా, రమ్యభావ బంధురంగా - పన్నెండు సర్గలలో "సామోదా దామోదర' నుంచీ - 'సుప్రీత పీతాంబరం' వరకూ.

" యది హరి స్మరణే సరసం మనో
యది విలాస కలాసు కుతూహలం
మధుర, కోమల, కాంత పదావలీ
శృణు తదా జయదేవ సరస్వతీం "

- గీత గోవిందము జయదేవ కవి ప్రణీతము ◯

# చైనాలో భారత పురాణాలు

భారత్ సాహిత్యానికి చెందిన పలు గ్రంథాలను చైనీయులు తమ భాషలోనికి తర్జుమా చేసుకుంటున్నారు. సంస్కృత పండితుడైన బీజింగ్ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ జి. క్సియో లిన్ వాల్మీకి రామాయణమును చైనీస్ భాషలోనికి అనువదించాడు. భగవద్గీత, కౌటిల్యుని అర్థశాస్త్రం, తులసీదాస్ రామచరితమానస్, మహాభారతంలోని కొన్ని భాగాలు కూడా చైనీస్ భాషలోనికి అనువదించబడినాయి. భగవద్గీత విశేష ప్రాచుర్యం పొంది ఇప్పటికి మూడుసార్లు పునర్ముద్రితమైందని బీజింగ్ యూనివర్శిటీ ప్రొఫెసర్ ఓంప్రకాష్ సింఘాల్ వెల్లడించారు. గీతాచార్యుడు ప్రవచించిన కర్మసిద్ధాంతం చైనీయులను విశేషంగా ఆకర్షించిందట. కరడుగట్టిన నాస్తికవాదంతో ముందుకు నడచిన చైనాలో నేడు భారతీయుల ఆస్తిక ఆధ్యాత్మిక సంపదకు విశేష ప్రాచుర్యం పొందటం విశేషమే. ◯

# మానవతావాది, మహాకవి జాషువా

డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

తమ్మిచూలి కేలుఁదమ్మిని గల నేర్పు
కవి కలంబు నందుఁ గలదు గాన
నీశ్వరత్వ మతనికే చెల్లుమణియయ్యె
నిష్కళంకముగఁ బూజనీయుడతడు.

అంటారు జాషువా తన ఫిరదౌసి కావ్యంలో. నిజానికి ఈ మాటలు పూర్తిగా ఆయనకే వర్తిస్తాయి. జాషువా వ్రాసిన 'శ్మశానవాటి' పద్యాలను చదివితే ఈ విషయం మనకు స్పష్టమవుతుంది.

ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని కలము
నిప్పులలోన గలిగిపోయె
ఇచ్చోటనే భూములేలు రాజన్యుని యధికార
ముద్రిక లంతరించె
యిచ్చోటనే లేత యిల్లాలి నల్లపూసలసౌరు
గంగలో గలసిపోయె
యిచ్చోట నెట్టి పేరెన్నికం గనుగొన్న
చిత్రలేఖకుని కుంచియ నశించె
ఇది పిశాచులతో నిటలేక్షణుండు గజ్జె గదలించి
యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టులొలయ నవని
బాలించు భస్మ సింహాసనంబు

జాషువా 1895 సెప్టెంబరు 28 న తేదీ ఉదయాన ఊరికి దూరంగా స్మశానాల కెదురుగా ఉన్న మారుమూల గల ఇంట్లో వీరయ్య లింగమాంబకు వినుకొండలో జన్మించారు. వీరయ్య లింగమాంబలది వర్ణాంతర వివాహం అందువల్ల ఒక ప్రక్క దారిద్ర్యం, మరో ప్రక్క కుల మతాలపోరు పీడిస్తూంటే 'పుత్రఁ ప్రేమయు రోమ రోమమున దీప్తుల్ చిమ్ముచుండగ' 'అహోరాత్రంబు నిజదేహ సౌఖ్యములు, సర్వస్వంబు వెచ్చించి' జాషువాను పెంచి పెద్దజేశారు. శ్రీమతి హేమలతా లవణంగారు వారి తండ్రి జాషువా ఎంతటి దారిద్ర్యంలో పెరిగారో చెపుతూ ఒక పండుగ రోజున వీధిలో ఒక బాలిక పళ్లెమునిండా తినుబండారాలు తీసుకొని పోతుంటే కొన్ని క్రింద పడ్డాయని, అది చూచిన జాషువా వెంటనే వెళ్ళి, ఆ క్రింద పడిన పదార్థాలను తీసుకున్నారని వ్రాశారు. అందుకే కామోసు జాషువా ఒక చోట అంటారు - 'పేదరికము పెద్ద వింత విద్యాశాల దానిలోన లజ్జ గానఁబడదు' అని చదువు ముగించుకున్నాక 'మేరి యను సద్గుణరాశిని' 'ఎడెందల్ మెదలెడు దాని, రూపవతి, మేనరికంబను జన్మహక్కుతో నెరిగినదాని' వివాహము చేసుకొని "పల్లెటూరు బడి పంతులు వృత్తి" నలంకరించారు. చాట్రగడ్డపాడులో జాషువా ఉద్యోగం చేస్తున్న రోజుల్లోనే శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారితో సాహచర్యం కల్గింది. వీరిరువురూ కలిసి జంట కవిత్వం చెప్పసాగారు కాని దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు వినుకొండ తరలి వెళ్ళాక ఒంటరిగా వారు సాహిత్య సాధన చేయవలసివచ్చింది. 1939 వ సంవత్సరంలో ఆరంభమయిన ఆయన కవితా ప్రస్థానం ఆయన మృత్యువు ఒడిలో నిద్రించినంతవరకూ సాగుతూనే వుంది. రుక్మిణీ కల్యాణం, కుశలవోపాఖ్యానం శివాజీ, ధ్రువ విజయము, ఫిరదౌసి, అనాథ, ముంతాజమహలు, తెరచాటు, గబ్బిలము, కాందిశీకుడు, నేతాజీ, స్వయంవరం, బాపూజీ, క్రీస్తు చరిత్ర, ముసాఫిర్లు, నాగార్జున సాగర్ వంటి ఉత్తమ రచనలెన్నో వారి కలం నుండి ప్రభవించాయి. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో

1965 వ సంవత్సరంలో రాష్ట్రప్రభుత్వం వారికి యం. యల్. సి. పదవినిచ్చి సత్కరించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1939 వ సంవత్సరంలో వారికి 'కళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి సత్కరించింది.

జాషువాకు గాంధీజీ అంటే విపరీతమైన శ్రద్ధాభక్తులు. "గోచి పాత గట్టుకొని, జాతి మానంబు నిలిపినట్టి ఖద్దరు నేతగాడు, విశ్వ సామరస్య విజ్ఞాన సంధాత, కామిత ప్రదాత గాంధీ తాత" అని అంజలి ఘటిస్తారు. గాంధీజీ నిమ్న జాతులకు చేసిన సేవ జాషువా మనసును ఆకట్టుకున్నది. అందుకనే ''నిమ్న జాతుల కన్నీటి నీరదములు పిడుగులై దేశమును గాల్చివేయుననుచు రాట్నమును దుడ్డుగఱ్ఱ కరాన బూని దెసల దోతెంచె, గుజరాతు ముసలిసెట్టి" అంటారు. నిమ్నకులాల వారిని ఎంతగా ఆ రోజుల్లో హీనంగా చూసేవారో, జాషువా వ్రాసిన ఈ పద్యం స్పష్టం చేస్తుంది. ''సీమ గుడ్డకు కన్నులు చెమ్మగిల్లె, మతకబట్టకు మర్యాద పొట మరిచె, నగరి వెలుపల మాల మాదిగలు గూడ, నరులు సుమ్మని దేశంబు గుఱుతుబట్టె''— అంబేద్కర్ మహాశయునికి అంజలి ఘటిస్తూ జాషువా అంటారు— '' కలడంబేద్కర్ నా సహోదరుడు, మాకై యష్టకష్టాలకుం బలియై, సీమకుపోయి క్రమ్మరిన విద్వాంసుడు ''.

జాషువా 'గబ్బిలం' కావ్యంలో గూడా ఈ కుల తారతమ్యాలు, దానివల్ల వచ్చిన దుష్టపరిణామాలను గురించి వ్రాస్తూ, అందరికీ సేవలనందించినా, నిమ్న జాతిన జన్మించినవాడి జీవితం కడు దుర్భరం అని వాపోయారు.

వాని రెక్కల కష్టంబు లేనినాడు
సస్యరమపంక్తి పులకింప సంశయించు
వాడు చెమ్మటకోడ్చి ప్రపంచమునకు
భోజనముం బెట్టు, వానికి భుక్తిలేదు.

వాని తలమీదం బులిమిన పంకిలమును
గడిగి కరుణింపలేడయ్యె గగన గంగ
వాని నైవేద్యమున నంటువడినవాడు
మూడు మూర్తులకును గూడ గూడులేదు.

అందువలననే జాషువా 'నాల్గు పడగల హైందవ నాగరాజు'గా హిందూమతాన్ని అభివర్ణించారు. అలా అని ఆయన హిందూమత వ్యతిరేకి కాదు. ఆయన హిందూమతాన్ని అభిమానిస్తూ రచనలు చేశారని క్రైస్తవసంఘంలో చాలామంది విరోధులయిన సందర్భాలున్నాయి జాషువా ఏ కులానికీ, ఏ మతానికీ చెందిన వ్యక్తి కాదు. ఆయన మానవతావాది, ఆయన ప్రతి రచనలోనూ మానవతావాదం వెల్లివిరుస్తుంది. 'ముసాఫిర్లు' అనే ఖండకావ్యంలో జాషువా ఇలా అంటారు.

ఎట్టి వివేకశాలురుదయించిన లోకమునెల్ల
మూటగా
గట్టు ప్రతాప వారిధులు గల్గిన
మానవులొక్క తల్లికిం
బుట్టిన యన్నదమ్ములను భూరి
వివేకము లోపమైనచో
పుట్టును బుట్టిగిట్టు చెదపుర్వులు
వారల నర్మిలిచ్చుటన్

జాషువా కావ్యాలలో అత్యుత్తమమైన కావ్యం 'ఫిరదౌసి' గజనీ మహమ్మద్ పారశీకకవులలో అగ్రగణ్యుడైన ఫిరదౌసితో "ఒక్కొక్క పద్దియంబున కొక్కొక్క బంగారు రూక యొసగెదను కవీ! మక్కా మసీదు తోడని పక్కాణించెన్, మహాసభా మధ్యమునన్ ", ఆయన కోరిక మేరకు 'షానామా' గ్రంథాన్ని వ్రాయ పూనుకుంటాడు ఫిరదౌసి అయితే కావ్యరచనకు సృష్టి

రహస్యాన్ని తెలుసుకోవాలి! కాకుంటే ఆ కల్పన 'అభూతకల్పనే' అవుతుంది. అందువల్ల –

ముదురుకోయిల కంఠమున నివాసము సేయు
కొసరింపు కూతల గుట్టు దెలిసి
ప్రతి పుష్పగంధ గర్భముఁ జీల్చికొని వచ్చు
పిల్లగాడ్పుల జన్మవృత్త యరసి
మేఘంబు తెరచాటు మెఱుపు బోగముసాని
మోసగింపుల యర్థమును గ్రహించి
శరధి నాయకుని క్రొన్నురువు పిల్లల తీరు
బడిలేని యాటల భావమెఱిగి

ముగ్ధ మోహన సౌందర్య పూర్ణమైన
ప్రకృతి దయతోడ స్నేహభావమున మెలగి
మువ్వదేడులు సర్వాంగ పుష్టి మెఱయఁ
గబ్బియు రచించె పిర్దౌసి కవివరుండు.

అయితే గజనీ మహమ్మదు మాటతప్పి బంగారు నాణెము లకు బదులుగా వెండినాణెములనును పిరదౌసికి కానుకగా పంపుతాడు.

ఒక కవీశ్వరు నిశ్శేతకు మెచ్చుకుని నోటి
నిండ మాణిక్యముల్నింపినాడు
ఒక పండితుని విమర్శకు, జిత్తముప్పొంగ
గనక చేలంబులు గప్పినాడు
ఒక గాయకుని పాటకు మేనుపులకింప
దోసిట ముత్యాలు పోసినాడు
ఒక యాటవెలది యాటకు సెబాసని పల్కి
కొంగున వరహాలు గురిసినాడు

ఏమి చెప్పుదు నిత్య సంతృప్తి దేల్చి
విపుల వాఙ్మయసేవ గావించినాడు
దానవలయంబు లిరుగేల దాల్చినాడు
పిరదవుసినేమో పూర్తిగా మఱచినాడు

పిరదౌసి తన కావ్యానికి మహారాజు కట్టిన విలువకు కుపితుడై మహారాజుకు 'అల్లాతోడని పల్కి, నా పసిడి కావ్య ద్రవ్యమున్ వెండితో జెల్లింపన్ దొరకొన్న ఒక్కరివి, నీచే బూజితుండైనచో, నల్లాకున్ సుఖమే? మహమ్మదు నృపాలా! సత్యవాక్యంబెవ డుల్లంఘింపడో వాడె పోనరుడు, ధన్యుండిద్ధరా మండలిన్' అని వ్రాసి పంపుతాడు. తత్ఫలితంగా మహారాజు ఆగ్రహానికిగురై తన కుటుంబంతోసహా అడవుల వెంట తిరిగి తిరిగి స్వగ్రామాన్ని చేరి, అక్కడ దయనీయమైన స్థితిలో మరణిస్తాడు. గజనీమహమ్మదు హితవుకోరే వారు కొందరు అతనితో 'మక్కాలో బయిగంబరుండగు. మహమ్మదుగోరీ పయిన్ బక్కాకీర్తుల వెల్లవేసిన మహా భక్తాగ్రగణ్యుండవై చిక్కబట్టితివేల? యొక్క కవి మీచే గోరు ద్రవ్యంబు మీ హుక్కా ఖర్చుకు సాటిరాదు గద! రాజోత్తంస! యోచింపుమా' అని నచ్చచెప్పగా గజనీమహమ్మదు తిరిగి ద్రవ్యాన్ని పంపుతాడు కాని అప్పటికే పిరదౌసి కాలంచేస్తాడు. కావ్యంలోని ఘట్టాలు మనసుకు హత్తుకుపోయేలా జాషువా చిత్రించారు. జాషువా శైలి అసాధారణమైనది. అందమైన మాటల్లో భావాన్ని పొదగటంలో జాషువా తనకు తానే సాటి. ప్రకృతి వర్ణనచేస్తూ ఒక కవిగా ఆయన స్పందించే తీరు చూడండి.

ఏమిటికెక్కుపెట్టితివో! యింద్రధనస్సును
మింటి చాయ నా
సామి! పయోద మాలికల చాటున సూర్యుడు
నక్కినాడు తా
నేమపచారము స్సలిపి యిట్టి విపత్తును
దెచ్చిపెట్టె నీ

భూములు నిల్చునా భువన మోహన !

నీవు పరాక్రమించినన్ !

కవికోకిలగా కీర్తింపబడిన జాషువా సామాజికంగా ఎంతగా విరాదరానికి గురయ్యారో వీరేశలింగం పంతులుగారికి వారు వ్రాసిన ఈ పద్యాన్ని చదివితే తెలుస్తుంది -

క్రైస్తవుండ కవిని కడు పేదవాడ నా
లంబనంబు నాదరంబు లేని
ఆది యాంధ్రకులుఁడనని నమస్కృతి చేసి
విన్నవించుకొంటి స్వీయచరిత ॥

అందుకే, "మనుజుడు మనుజుని గనుకొని మనుజుండని గుర్తుపట్టి మసలెడు శుభసూచన లెల్ల దిశల గాంధీయుని చంద్రునను గ్రహమున పుష్పితమయ్యెన్ " అని సంతోష పడతారు.

ఆయోధ్యలో బాబ్రీమసీదు ధ్వంసం అయిన సన్నివేశాన్ని మనం మరచిపోలేం ! ఈ సందర్భంగా జాషువా అన్న మాటలను మనం జ్ఞాపకం చేసుకుని తీరాలి-

" భారతక్షోణి గల్గు దేవస్థలములు
బెదరి గజనీ పురాన మసీదులయ్యె
నిప్పటి మసీదుల్ రూపమెత్తగలవొ
కాలమెఱుగునుఁ ధారుణీ గర్భమెఱుఁగు "

'గబ్బిలం' కావ్యంలో ఒక దురదృష్టవంతుడు, గబ్బిలముతో- ''ఆలయంబున నీవు వ్రేలాడువేళ శివుని చెవి నీకు గొంత చేరువుగనుండు, యామిళగరాజ్ఞ ! పూజారి లేనివేళ విన్నవింపుము, నాదు జీవితచరిత్ర" అంటాడు ఆ సూక్తులను చదువుతున్నపుడు జాషువా తన ఆత్మఘోషను వెలువరించుకున్నారేమో అన్పిస్తుంది.

సంకుచితమైన భావాలకు ఆలవాలమయిన సమాజం జాషువాను ఏ మతంవాడిగా గుర్తించినా, ఏ కులంవాడిగా ఈసడించినా, ఆయన కులానికీ, మతానికీ, దేశానికీ గూడా అతీతుడు విశ్వ మానవతావాది ! సార్థక జన్ముడు ! అమరుడు ! ○

---

# నేటి సంక్రాంతి

పాటిబండ్ల శ్రీమన్నారాయణ

రంగు రంగు భంగిమలతో
రకరకాల ముగ్గులు తీరుద్దామంటే
ముంగిళ్ళు మూరెడాయె !
ముగ్గుల మధ్య అక్కడక్కడ
గొబ్బెమ్మల పెడదామంటే
పశువుల పేడ జాడ కానరాదాయె !
హైబ్రీడ్ కూరగాయల సంతలో
తమ్మలవారి నక్కదోసకాయ
అడ్డసే దొరకదాయె !
పాలవాళ్ళ పోలికేకల ముందు
హరిదాసుల కీర్తనలే వినపబడవాయె !
సందుల్లో గొందుల్లో
వ్యాధుల్ని మోసుకొచ్చే పందులు తప్ప
బసవన్నల అడుగుజాడ కానరాదాయె !
వ్యాపార పంటల వ్యాపకంలో పడి
ధాన్యపు రాశులే కరువాయె !
బంతి చామంతి ఘుమఘుమలాడవలసిన తరుణంలో
మురుగు కాలువల మురికి కంపు పెరిగిపోయె !
ప్రశాంతంగా పదినిమిషాలు పడుకుందామంటే
వాహనాల ఘీంకారాలు
ఫాక్టరీల భూంకారాలు !
ఒళ్ళంతా కృత్రిమత్వం పులుముకొని
అసహజమైన నవ్వును మొఖాన అంటించుకొని
ఆప్యాయతల్ని, అనురాగాల్ని
డబ్బు మీటరు బద్దతో కొలిచే మా దగ్గరకు
ఏన్నెలా ఆహ్వానించాల సంక్రాంతీ
నిన్నెలా ఆదరించాలి సంక్రాంతి ○

# అశ్వత్థామ

-మల్లాప్రగడ శ్రీరంగారావు

ద్రోణాచార్యుల కుమారుడైన అశ్వత్థామ పుట్టగనే ఉచ్చైశ్శ్రవము గుఱ్ఱమువలె పెద్దగా అరచెను. అందుచే యీ పేరు వచ్చినది. చిన్నతనమునుండి కౌరవ పాండవులతో కలిసి సకల విద్యలు నేర్చెను. అస్త్ర ప్రయోగంలో అర్జునుని మించిన శక్తి సంపాదింప వలయునని పట్టుదలతో చీకటి సమయములందు కూడ బాణ ప్రయోగము నేర్చుకొనెను అర్జునునికా రహస్యము తెలియకుండా వుండాలని అతని కన్నము పెట్టువానితో చీకటిలో అర్జునునికన్నము పెట్టవద్దని సూచించెను.

ఒకనాడర్జునుడు భుజించుచుండగా దీపమారిపోయెను, అయినను చీకటిలో అభ్యాసబలంతో అన్నమును భక్షించిన అతనికి బాణములను కూడ అభ్యాసముతో చీకటిలో ప్రయోగింపవచ్చు కదా అని తలంపు కలిగి చివరకు చీకటిలోకూడ బాణప్రయోగ కుశలుడైనాడు.

అమోఘమైన బ్రహ్మశిరోనామకాస్త్రమును తండ్రి వలన సంపాదించి అశ్వత్థామ అహంకరించెను. ఈ అస్త్రము నెన్నడు మానవులపై ప్రయోగింపరాదని ద్రోణుడు అశ్వత్థామకు చెప్పెను. ఒకనాడు శ్రీకృష్ణుని వద్దకేగి నీ చక్రమును నాకిమ్ము, నా అస్త్రమును నీకిచ్చెదనని అడిగెను. కృష్ణుడు నవ్వి నాకత్యంత ప్రియుడైన అర్జునుడే యీ చక్రము నడుగలేదు. నీవడిగితివి. నా ఆయుధము తీసికొనిన నీనుండి నాకు ఏమియు అక్కరలేదు, నీ కిష్టమైన దానిని నా ఆయుధములలో కావలసినది తీసుకొనుమనెను. అశ్వత్థామ రెండు చేతులతో గట్టిగ పట్టుకొని ప్రయత్నించినను చక్రమును చేతపట్టలేకపోయెను. అపుడు కృష్ణుడు అశ్వత్థామతో ఎవరితో యుద్ధము చేయదలచి యీ చక్రమును కోరితివని అడుగగా నీతో పోరాడి నీ చేతిలో పరాజయము పొందకుండా వుండాలని యీ చక్రమును కోరితినని పలికెను.

తన తండ్రితోపాటు కౌరవులవద్దనుండి దుర్యోధనుని సహాయముచే జీవించుచున్న అశ్వత్థామ పాండవులతో యుద్ధము చేయక తప్పలేదు. తన తండ్రిని అసత్యమాడి అన్యాయముగ చంపినారను కోపముతో పాండవులపై మరింత ద్వేషమును పెంచుకొనెను. చివరకు యుద్ధరంగమున తొడలు విరగగొట్టబడిన దుర్యోధనుని దురవస్థ జూచి వానికి సంతృప్తి కలిగించుటకై పాండవులను సంహరింతునని శపథముచేసి, నాటిరాత్రి చెట్టు క్రింద నిలిచియుండగా చెట్టుమీద గూటిలో నిద్రిస్తున్న కాకిపిల్లలను గుడ్లగూబలు పొడిచి చంపుచున్న దృశ్యం అతని కంటబడెను అట్లే పాండవులను నిద్రించుచుండగ హతమార్పవలయునని, నిశ్చయించుకొని పాండవ శిబిరమునకు పోవుచుండగా త్రోవలో శివుడు భూతాకారముతో యెదుట నిలబడెను. ఆ భూతముపై అనేక బాణములు వేసినను అన్నిటిని దిగమ్రింగి ఆ భూతము కదలక యట్లేయుండుట గమనించి దైవరూపమని తలచి వినయముతో నమస్కరించి తన శరీరమును అగ్నియందు దగ్ధము చేసుకొనదలచగా శివుడు నిజరూపము చూపి యొక ఖడ్గము నిచ్చెను. శివశక్తి అతనిలో ప్రవేశింపగా ఆవేశముతో పాండవ శిబిరమును ప్రవేశించి నిద్రించుచున్న ధృష్టద్యుమ్నుని శిఖండిని సంహరించి, నిద్రించుచున్న ఉపపాండవులను పాండవులనుకొని సంహరించి దుర్యోధనునికా వార్త తెలియ చెప్పి తన పగ తీరినదని భావించెను. పాండవపుత్రుల

మరణము విని భీముడాగ్రహించి వెదకి అశ్వత్థామను ద్రౌపది ముందునకు తీసికొనివచ్చి వీనిని వధింతును, నీ బిడ్డలను హతమార్చిన కిరాతుడు వీడు అని పలుక ద్రౌపది మాతృభావముతో తనకువలెనే అశ్వత్థామ తల్లికి పుత్రశోకము కలిగింప నిష్టములేక పరాభవించి ప్రాణములతో విడిచిపెట్టించెను.

అపాండవము చేయాలనే పట్టుదలతో ఉత్తర గర్భమందున్న శిశువుపై బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. ఉత్తర శ్రీకృష్ణుని ప్రార్థింపగా చక్రము నడ్డువేసి గర్భస్థ శిశువును రక్షించెను. ఆ శిశువే పరీక్షిత్ అను మహారాజుగ లోకమున ప్రఖ్యాతి చెందెను.

ఇంత చేసినను తన ప్రతిజ్ఞ నెరవేరలేదను బాధతో ప్రాణములతో పాండవులు తనను దయతో వదలిపెట్టా రను వైరాగ్యముతో పశ్చాత్తాపము చెంది కృష్ణద్వీపమునకు పోయి తపస్సు చేసుకొనుచుండెను.

ఈ కథ వలన శక్తికి మించిన పని తలపెట్టినవారికి కలుగు పరాభవము, ప్రాణభీతి యెటువంటిదో మనము తెలుసుకొని ప్రవర్తించుట మనకు శ్రేయోదాయకము. *

## జపాన్ టి. వి. లో శ్రీ సాయిబాబా దర్శనం

శాస్త్ర సాంకేతిక రంగాలలో అద్భుత ప్రగతిని సాధించిన జపాన్‌లో శ్రీ సత్యసాయి బాబాగారికి విశేష జనాదరణ లభిస్తున్నది. జనాదరణ ఉన్న ఛానల్-4 ప్రైమ్ టైంలో మూడు గంటలపాటు శ్రీ సత్యసాయి కార్యక్రమాలకు కేటాయించటం విశేషం శ్రీ సత్యసాయిపై ఓ శాస్త్రజ్ఞుడు వ్రాసిన పుస్తకం 10 వేల కాపీలు తేలికగా అమ్ముడుపోయినాయిట. శ్రీ సత్యసాయిబాబాపై వ్రాసిన పుస్తకాలు హాట్ కేకుల్లా అమ్ముడుపోతున్నాయిట. సాంకేతికంగా అభివృద్ధిగాంచిన విదేశాలలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారికి ఇంతటి పేరు ప్రతిష్ఠలు లభించడం నిజంగా ఆయన దివ్యశక్తికి నిదర్శనం కాదా !

# విశ్వనాథవారి ఊహావైభవము

## (శ్రీమద్రామాయణ కల్పవృక్షము)

-డా॥ కాజ ల

భారతీయ మహా కవులు ఋషులు. వారికి ధర్మము మూలభూత విషయము ఈ ధర్మము త్రిధాభూతమయినది ఒకటి విశ్వ శ్రేయస్సు, రెండవది లౌకికానందము, మూఁడవది బ్రహ్మానందము. త్రిధాభూతమగు నీ ధర్మము మరల చాతుర్విధ్యము నందించినది. ధర్మార్థ కామ మోక్షములయినది. కౌసల్యా సుమిత్రా కైకలు నలువురు బిడ్డలను ప్రసవించినారని కల్పవృక్షమున చేయఁబడినట్టి వర్ణనము ధర్మస్వరూపము యొక్క నిరూపణార్థమే.

దశరథునకుఁ బుత్ర సంతతి లేదు. ఆయన దుఃఖించెను. ఆ రాజునకు ముగ్గురు రాణులు. వీరే కాక దశరథునకు అనేకులు అంగనలున్నారు. కల్పవృక్ష రామాయణమునందలి ఈ సన్నివేశ కథనము వాల్మీకము కంటే భిన్నమయినది. అశ్వమేధ యాగ ఘట్టము వరకు దశరథుని భార్యల ప్రసంగము వాల్మీకి రామాయణమున గన్పింపదు. అచ్చటఁగూడ ఒక కౌసల్యా ప్రసక్తి మాత్రమున్నది. పాయస ప్రదాన సమయమున మాత్రమే సుమిత్రా కైకలను గూర్చిన ప్రసంగము వాల్మీకమున నున్నది. కల్పవృక్షమున దశరథుని గూర్చి చెప్పిన వెనువెంటనే, ఆయన భార్యలను గూర్చిన వర్ణనము ఉన్నది. ఈ యుండుట సామాన్య విషయము కాదు. రామాయణము వేదమే నన్న మహార్థమును స్థాపించునట్లున్నది. కల్పవృక్షమున బాలకాండలోని 'యిష్టి' ఖండారంభము నందలి ఆ రెండు పద్యములు

'అరయ నెందఱేని కలరాయన కంగన లందు మూఁగురిం పారిన ప్రేయసుల్ గుణగణాఢ్యులు కోసల రాజపుత్రి దేవేరి, సుమిత్ర శాంతగుణ పేటిక, కేకయ రాజకన్య హేలారతీ దాగురేకుల తలత్తల కాటుక రాజు కంటికిన్

కౌసల్య ముక్తికాంతాసమానాకార
నలి సుమిత్ర యుపాసనా స్వరూప,
విజయ రమాకార వినయాంబుధి సుమిత్ర
కైకేయి మధు సామగానమూర్తి
కౌసల్య నవ శరత్కాల మందాకిని
సిత పుండరీకంబు శ్రీ సుమిత్ర
మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర
కైకేయినును నల్ల కల్వ పూవు

ధర్మ కామంబులీ రెంట దశరథుండు, ముగ్గురు భార్యలందును రసమూర్తులందు నమృతసౌఖ్యానుభూతి నధ్యయన సుఖము తీర్థభోగ సుఖమ్ము సిద్ధింపఁగనియె

దశరథుని ముగ్గురు భార్యలు గుణగణాఢ్యులు. గుణగణముల చేత నాలుగు సముద్రముల వంటివారు ఈ ముగ్గురు రాణుల గర్భవాసమున శ్రీమన్నారాయణుఁడు నలుగురు అన్నదమ్ములుగా అవతరింపఁబోవుచున్నాఁడని యిందు ఒకచమత్కారమైన సూచనయున్నదన్నచో ఇట్టి సూచనను కవి శబ్దవాచ్యుఁడెవడైన చేయఁగలఁడు.

"కౌసల్య ముక్తికాంతా సమానాకార ...." ఈ పద్యమున కౌసల్య యొకసారి, సుమిత్రి రెండుసారులు, కైక యొకసారి వర్ణింపఁబడిరి ఆ కౌసల్యకు రాముఁడొకఁడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులిద్దఱు, కైకకు భరతుఁడొకఁడు జన్మింపఁ బోవుదురన్న సూచ్యార్థ సూచనము ఇందున్నదన్నచో – ఇది కవి మాత్రుఁడెవ్వఁడైనను చేయగల చమత్కారమే.

వేదార్థమును కావ్య శిల్ప రమణీయముగా విశ్వనాథవారీ పద్యమున నిక్షిప్తముగావించిరి.

శ్రీరాముఁడు మోక్ష స్వరూపుఁడు, కర్మబంధములు తొలఁగి గాని మోక్షము లభింపదు. ఆ జీవులు శాంతులు తపస్వులును గావలయును. శ్రీ మహావిష్ణువు కౌసల్యా దేవి గర్భమున శ్రీరామచంద్రుడై యవతరించెను. ఆమె సాక్షాన్ముక్తిస్వరూపిణి ఆ తల్లి గుణములు కొడుకునకు సంక్రమించినవి లోక మర్యాద యొక వంక. అవతార రహస్య నిరూపణ యొక వంక జరిగినవి. రెండవయామె సుమిత్ర. ఈమె లక్ష్మణ శత్రుఘ్నులను గన్నది. సుమిత్రను గూర్చి రెండేసి విశేషణములు వాడబడినవి. 1) సుమిత్ర యుపాసనా స్వరూప 2) విజయ రమాకార వినయాంబుధి ఈ రెండు విశేషణములు సుమిత్రా నందనులకు వరుసగా నన్వయింపఁదగినవి. లక్ష్మణుఁడు శ్రీరామోపాసనా ధురంధరుఁడు. లక్ష్మణుఁడు శ్రీరామ చంద్రునకు నిత్యసమీపవర్తి. సుమిత్రయు ఉపాసకురాలే. సుమిత్రకుఁ గౌసల్య యొక దేవీస్వరూపము రామాయణ గత బహు స్త్రీ పాత్రలు దేవీస్వరూప వ్యంజకములుగా కల్పవృక్ష రామాయణము చిత్రించినది అందు సీత సాక్షాత్పరమేశ్వరి, ఆత్మేశ్వరి. సుమిత్ర నిత్య కౌసల్యా సమీపవర్తిని. కౌసల్య సుమిత్రలకు ఆశ్రియాశ్రియీ భావ సంబంధమును రామాయణ కల్పవృక్షమున దర్శింపఁగలము. సుమిత్రను గూర్చిన రెండవ విశేషణము 'విజయ రమాకార వినయాంబుధి సుమిత్ర' అనునది. సుమిత్ర రెండవ కొడుకు శత్రుఘ్నుఁడు వీర రసావతారుఁడు, మరియు అన్నలయందు వినయశీలి.

ఇఁక మూఁడవయామె కైక. తానొక రామకథా భాష్యకారుఁడై విశ్వనాథవారీ కైక తత్త్వమును ఒక్క విశేషణముతో ధ్వనింపఁజేసిరి. కైక "మధు సామగాన మూర్తి" అని.

'తతో బ్రహ్మ తదూర్ధ్వ స్వాధ్యాయ స్తపః, తస్మిన్ నిరతం సామగాన లోలత్వ మిత్యర్థః వేదానాం సామ వేదోఽస్మి ఇతి భగవతాగీతత్వాత్ ఏవం వేదాధ్యయన ముక్తం అథ యదధీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే కేవలాధ్యయన నిందిత్వాత్ తదర్థజ్ఞ ఇత్యాహ ' రామాయణము వేదము వేదమున సామవేదము సార భూతము కేవల వేదపఠన కంటెఁ దదర్థజ్ఞానులుత్తములు. కైక మధుసామగానమూర్తి యనఁగా రామాయణ వేదము యొక్క సారము నెఱిఁగినదని తాత్పర్యము. మధు విద్యయని. ఛాందోగ్యము నందొకఁడున్నది. సూర్యమండలాంతర్గత మధు విద్యా ప్రాధాన్యమును అందు దర్శింపఁగలము. సూర్యునకుఁ బురోభాగమున సామవేదమున్నదని ఛాందోగ్యము. శ్రీరాముఁడు సూర్య మండలాంతర్గత చిత్స్వరూపము రామావతార లక్ష్య సాధనకుఁ గైక ప్రేరేపకురాలని వ్యాఖ్యానింపఁ దలఁచి కల్పవృక్ష కవి-కైకను గూర్చి-మధు సామగానమూర్తి అని యన్నాఁడు. మఱియు విశేషమున్నది. మధు శబ్దము యొక్క తద్ధితరూపము మాధవుఁడు రామాయణ మున మాధవుఁడనఁగా శ్రీరాముడు. రాముఁడన్నచో గైకకు వాత్సల్యము అభిమానమును. విష్ణుముఖ వినిర్గత వాయువీచీ ప్రసారముచేతఁ బూరింపఁబడిన శంఖమునుండి వేదమహార్థమే ధ్వనించుచున్నది. ఆ శంఖము యొక్క యవతారమే భరతుఁడు. వాని తల్లి కైక. రాక్షస సంహరణార్థము రాముని అడవులకుఁ బంపి భరతుని రాజును చేసి రామావతార రహస్య ప్రకాశనము చేసినదీ యీ కైకయే కదా!

సీసపద్యమున రెండవ పాదము "కౌసల్య నవ శరత్కాల మందాకిని, సిత పుండరీకంబు శ్రీ సుమిత్ర, మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర కైకేయి నునునల్ల కల్వపూవు" అని, సుమిత్రను గూర్చి ప్రయోగింపబడిన "సిత పుండరీక, మందారపుష్ప"

శబ్దముల పైకి భావకవితా ధోరణిలో నున్నవి. సిత పుండరీకమనఁగా దెల్ల కలువ. లక్ష్మణుఁడు ఆదిశేషుని యొక్క అవతారము. తెల్లనిమేని చాయగలవాడు. లక్ష్మణుని తెల్ల కలువతోఁ బోల్చి యేమి సాధించెను? మల్లెపూవుతోఁ బోల్చరాదా? పోల్చరాదు. ఎందుకు పోల్చరాదో చెప్పెదను. ఇది యిట్లుండఁగా "మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర. వీరరసమునకు అరుణవర్ణమును ఆలంకారికులు నిర్ణయించిరి. శత్రుఘ్నుని వీరరసావతారమీరీతిగా ధ్వనించినది సుమిత్రను సిత పుండరీకమని వర్ణించి కౌసల్యను "నవశరత్కాల మందాకిని" అని వర్ణించి, వారిద్దఱి సాన్నిత్యమును చెప్పి వారివారి బిడ్డలయిన లక్ష్మణుని శ్రీరాముని సాన్నిహిత్యమునుగూడ విశ్వనాథవారు ధ్వనిమార్గమున నిరూపించిరి. కౌసల్యను విడిచి సుమిత్ర క్షణకాలము ఉండజాలదు. శరత్కాల మందాకినీ నదీ ధావళ్యమున యందు సిత పుండరీకముల ధావళ్యము లీనమైపోవును. కౌసల్యయు సుమిత్రయు ఇట్లే యుందురు, తెల్లని కలువలు తెల్లని గంగానది అంతయు శుద్ధ సాత్త్విక గుణము మందాకినీ నది తెల్లకలువల చేత దీప్తిమంతమై శరత్కాలమున శోభించుచున్నది మందాకినీ సదృశుఁడైన శ్రీరామచంద్రుని సాహచర్యమున సిత పుండరీక తుల్యుఁడైన లక్ష్మణస్వామి ప్రకాశించినాఁడు. గంగానదికిని, తెల్ల కలువలకు అంత విడదీయరాని సంబంధము శేషశేషి సంబంధమిది, జలము విడిచి కలువలు నిలుచునా! కలువలులేని జలములకు శోభ యున్నదా. రామలక్ష్మణుల యొక్క అనుబంధ మింతటదని విశ్వనాథవారి భావన.

¯కను గూర్చిన మరియొక వర్ణనము. ఆమె

ననునల కల్వపూవు" అని. కైకను మన్మథసామగాన మూర్తి యనుటలోని రహస్యమైన మహావిషయమును వివరించితిని సుమిత్రను తెల్ల కలువ యనుటలోని యౌచితిని నిరూపించితిని, కైక ననునల్ల కల్వయేమి?

లక్ష్మణుఁడు తెల్లని కలువయైనచో, భరతుఁడు నల్ల కలువ యగుట యౌచిత్యమే. భరతునకు శ్రీరామునకు రూపగత సామ్యము కూడఁ గలదు. రాముని వలె భరతుఁడును నల్లనివాఁడే. రాముని స్థానమున నిలబడి రాజ్యపాలన ధర్మరక్షణ గావించినవాఁడే, శ్రీరాముడు మందాకినీ నదియైనచో లక్ష్మణ భరతులిద్దఱును తెలుపు నలుపు కలువలై ఆ నదీ వైభవమునకు శోభాహేతువులైనారు ఇట్టి సోదరులు కలిగి శ్రీ రాముఁడు సకల లోకారాధ్యుఁడైనాడు. ఇది ఇట్లుండి కైకను నునునల్ల కల్వతోఁ బోల్చుటయేమి? కైక దశరథుని యొక్క శృంగార రస సర్వస్వము కౌసల్య దశరథుని పట్టపురాణి. సుమిత్ర కౌసల్య ననుసరించి జీవించినది. దశరథుఁడు తన జీవితమును కైకకు ధారవోసెను. ఈ కైక దశరథునకెంత ప్రేమపాత్రురాలనఁగా ఆమె దశరథుని పాలిట 'నల్ల కలువ' మరియొకఁడేల కారాదు. మన్మథునికి గల ఐదు బాణములలో నీలోత్పలమని యొకఁటున్నది. అదే నల్ల కలువ. అదిమన్మథుని చివరి బాణము. అది ప్రయోగింపఁబడినదా, అటుపై ఆ జీవుని ప్రాణముయొక్క యుత్క్రమణమే జరుగును. కైక దశరథుని యెంత ఆకర్షించినదనఁగా దశరథుఁడామె నిమిత్తమై తన ప్రాణములను పరిత్యజించెను ఇంత విపులార్థమును ధ్వనింపజేయుటకై, యేదో భావకవితాధోరణిలో జెప్పినట్లు ఈ చిన్న విశేషణముచేత, పాఠకుని యందింత ఆలోచనము కల్గించిరి.

కల్పవృక్ష రామాయణము ప్రారంభమున దశథుని ముగ్గురు రాణులను గూర్చి చెప్పిన యీ రెండు పద్యములు అమూలకములు. ఈ దృగ్ధ్వనిద మహార్థధ్వనన సామర్థ్యముచేత మద్గురువర్యులు శ్రీ విశ్వనాథ, రామకథాభాష్యకారులలో శిరోమణియైనారు. భారతీయులకు, సర్వ ప్రపంచమునకు ఆదర్శమైన శ్రీరామచంద్రుని యొక్క ఆయన సోదరులయొక్క అనుబంధమీ విధముగా విశ్వనాథవారుతమయూహావైభవముతో ఆవిష్కరించిరి.

# పుస్తకసమీక్ష

## దక్కన్ సర్దార్ దర్శనము

1/8 డెమ్మీ, పుటలు - 310 పేజీలు
కవరు పేజీ - కలర్ లామినేషన్
వెల : రు 100/-

రచయిత :
శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు
M. A., M.Ed.

రూపకల్పన :
డా॥ కె. కోదండరామాచార్యులు
M.O.L., M.A. Ph. D.

ప్రతులకు : శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు
ఎర్రుపాలెం - 507 201, ఖమ్మం జిల్లా

" దక్కన్ సర్దార్ దర్శనము " అంటే కీ శే. శ్రీ జమలాపురం కేశవరావుగారి జీవిత చరిత్ర 'దక్కన్ సర్దార్' జీవితచరిత్ర యువతరానికి స్ఫూర్తి నిస్తుందనటంలో ఏమాత్రం సందేహంలేదు. మహనీయుల చరిత్రలు భావితరాలకు స్ఫూర్తి ప్రదాయకాలు. మహనీయుల జీవితచరిత్రలు విధిగా ప్రతి ఒక్కరూ చదివితీరాలి. మహనీయులు జన్మనిచ్చిన వారికన్నా, కట్టుకున్న వారికన్నా, కన్నవారికన్నా పరులకే ఎక్కువగా ఉపయోగపడుతారనే విషయం 'జమలాపురం' వారి విషయంలోకూడా స్పష్టమైంది. ఒక పర్యాయం పిల్లల్ని చూచి వెళ్లదామని ఇంటికి వెళ్లుతారు శ్రీ కేశవరావు గారు. అప్పుడు వారి బావగారు వ్యంగ్యంగా 'పిల్లలకేం తెచ్చారు ? బట్టలా, బొమ్మలా, పుస్తకాలా ? ' అని అడుగగా "అవి తెస్తేనే రావాలా ? లేకుంటే రాగూడదా? నేనేం తేలేను, పంచియివ్వలేను. అయితే మమత, అప్యాయత, అభిమానం మాత్రం పంచియివ్వగలను, అవి వెలలేని ఆభరణాలు '' అని అన్నారుట. వారి ఆవేదన అర్థం చేసుకుంటే బోధపడుతుంది వారి ఆంతర్యం. స్వాతంత్ర్య సమరయోధుల మూగబాధ సామాన్యులకు అర్థంకాదు. వారి ఆలోచన ఉన్నతంగా ఉంటుంది. వారి ప్రవర్తన ఆదర్శవంతంగా ఉంటుంది. వారు కార్యశూరులు, వాక్శూరులు కాదు వారు త్యాగ రాజులు, భోగరాజులు కాదు అందువలనే వారు అకుంఠితదీక్షతో, అవిశ్రాంత పోరాటం కొనసాగించారు. ఈ గ్రంథంలో ఇటువంటి సంఘటనలు అనేకం. దీనిని ప్రతి ఒక్కరూ స్వంతం చేసుకోవాలి. అంతేకాదు ప్రతి గ్రంథాలయంలో ఉండవలసిన ఉత్తమ గ్రంథం.

ఈ గ్రంథమును భావితరాలవారికి అందించి శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు, డా॥ కె. కోదండ రామాచార్యులుగార్లు ధన్యులైనారు. వారిని అభినందిస్తున్నాను. - సమీక్షకులు

**కొమరగిరి**

---

## శ్రీమద్భాగవతము

(పురాణ కథా స్రవంతి)

1/4 క్రౌన్ - 596 పేజీలు
వెల : రు 100/-

ఆంగ్ల మూలం : శ్రీమతి కమలాసుబ్రమణ్యాం
తెలుగు అనువాదం : ఖరిడేహాల్ వెంకటరావు

ప్రతులకు ; Sri K. Venkata Rao
Plot No. 2, R & D Difence enclave
Sikh Village
SECUNDERABAD - 500 009

శ్రీమద్భాగవత కథను తేట తెలుగు వచనంలో చక్కగా వివరించారు ఈ గ్రంథకర్త శ్రీ ఖరిడేహాల్ వెంకటరావుగారు శ్రీమద్భాగవతం సామాన్య పురాణం కాదు. సంస్కృత మూల గ్రంథమును రచించిన తరువాత వ్యాసమహర్షికి చిత్తశాంతి కలిగిందట. భాగవతమనగానే పోతన గుర్తుకువస్తాడు. ఆయన

వ్రాసిన పద్యాలే మనసులోకి వస్తాయి ఈనాడు సామాన్యులు పద్యాలు చదివి అర్థం చేసుకునే స్థితిలోలేరు. అట్టివారికి శ్రీ ఖరిడేహాల్ వెంకటరావుగారు రచించిన ఈ 'శ్రీమద్భాగవతము' ఎంతగానో ఉపకరిస్తుంది. కారణం ? ఈ గ్రంథం వచనంలో ఉండటమే. ఈ గ్రంథము 12 స్కందములు. దశమస్కందములో పూర్వభాగము, ఉత్తరభాగము విడివిడిగా ఇవ్వబడింది. మొత్తం 243 Sub Heddings ఈ గ్రంథములో ఉన్నాయి. పాఠకులు ఏ విషయం చదవాలనుకుంటే క్షణంలో ఆ విషయం చూచి చదువుకొనవచ్చును. విషయ సూచిక వివరంగా ఉండటం ఈ గ్రంథం ప్రత్యేకత. ఇకపోతే భాష సరళంగా, అందరికీ అర్థమయ్యే విధంగా ఉన్నది. ముఖ్యంగా సామాన్య తెలుగు పరిచయమున్న స్త్రీలకు కూడా బాగా అర్థమవు తుంది. సత్పురుషులతో సత్సాంగత్యము, భాగవత పురాణ పఠనం వలన దుశ్చింతనలను దూరం చేసుకొని, సచ్చింతనలను పెంపొందించుకుని ఉత్తమ స్థితిని పొంద వచ్చును దానికి ఈ వచన గ్రంథం సామాన్యుల పాలిటి కామధేనువు. శ్రీ వెంకట్రావుగారు సామాన్య రచయిత కాదు, భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అనుగ్రహ మును సంపూర్ణంగా సంపాదించిన అదృష్టవంతులు. కనుక వీరి రచనలో భగవాన్ బాబావారి ఆధ్యాత్మిక చింతన కనిపిస్తుంది. ఈ గ్రంథమును శ్రీ సత్యసాయి బాబావారి పాదపద్మములకు సమర్పించుకున్నారు రచయిత వచనంలో ఒక మంచి గ్రంథమును తెలుగువారికి అందించి జీవితాన్ని సార్థకం చేసుకొనినారు శ్రీ వెంకట్రావుగారు. ఈ గ్రంథం ప్రతి ఇంటిలో ఉండవలసిన ఉత్తమ గ్రంథం. ప్రతి ఒక్కరూ చదువ వలసినది స్వంతం చేసుకోండి ! - సమీక్షకులు

భరద్వాజ్

# శ్రీ కృష్ణ చరితామృతము

రచయిత :

శ్రీ అవ్వారి గోపాలకృష్ణమూర్తి శాస్త్రి

1/8 డెమ్మి ; 238 పేజీలు ; వెల : రు. 35/-

ప్రతులకు :

శ్రీ అవ్వారి వెంకట హనుమ దీక్షితులు
వరగాని - 522 235 గుంటూరు జిల్లా

భక్తుల ఉపయోగంకోసం, సామాన్య జనానికి భాగవత రసాయనాన్ని అందించడంకోసం, సహజ సుందరమైన, సులభశైలిలో ఈ గ్రంథమును శ్రీ శాస్త్రిగారు రచించారు. పామరజనంకూడా విని తరించే విధంగా ఈ రచన సాగింది సంస్కృత శ్లోకాల భావాన్ని చిన్న చిన్న వాక్యాలతో సూటిగా విడమరచి చెప్పారు. ఈ గ్రంథం చదువుతుంటే ఆంధ్ర భాగవతం చదువుతున్న అనుభూతి కలుగుతుంది. శ్రీకృష్ణ తత్త్వమును అవగాహన చేసుకోవటానికి ఈ గ్రంథం ఎంతగానో ఉపకరిస్తుంది.

ఈ గ్రంథానికి అనుబంధంగా చేర్చిన శ్రీకృష్ణ సుప్రభాత స్తోత్రము, శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళి, కృష్ణంవందే జగద్గురుమ్, వల్లభాచార్య కృత 'మధురా ష్టకమ్' శంకరాచార్య కృతా 'శ్రీ కష్ణాష్టకము' మొద లగునవి కృష్ణ భక్తి పరాయణులకు నిత్య పారాయణకు ఉపయోగపడుతాయి ఒక్క మాటలో చెప్పాలంటే ఈ గ్రంథం భాగవత రసాయనం వడ్డించిన విస్తరి. మన ఆధ్యాత్మిక సంపదను కైవసం చేసికోదలచిన వారందరు తప్పక చదువవలసిన గ్రంథమిది.

సమీక్షకులు : డా. యన్ వెంకటరాయుడు
M. A. PhD
రీడరు తెలుగుశాఖ, పి ఏ ఎస్. కళాశాల
పెదనందిపాడు, గుంటూరుజిల్లా

# సాయి సేవకు అంకితమైన పుణ్యదంపతులు



భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి దివ్య ఆశీస్సులతో శ్రీ గుడివాడ వెంకటేశ్వరరావు, శ్రీమతి రత్నమాణిక్యాంబ పుణ్య దంపతులు భీమవరంలో అనేక ఆధ్యాత్మిక, విద్యా, సేవా కార్యక్రమాలను గత మూడు సంవత్సరాలుగా ఎంతో శ్రద్ధా భక్తులతో నిర్వహిస్తున్నారు. 1994 డిశంబర్ 31 వ తేదీన వారింటి ప్రాంగణంలో సాయంత్రం 6 గం. ల నుండి రాత్రి 12 గం వరకు భగవాన్ సాయి సంకీర్తన కడు వైభవంగా నిర్వహించబడింది అందులో వంద లాదిమంది సాయి భక్తులు పాల్గొన్నారు. ఆనాడు అక్కడ జరిగిన సంకీర్తనలో పాల్గొనిన భక్తులకు స్వామి పసిడి పలుకులు వినిపించే మహాద్భాగ్యం నాకు లభించింది. ఈ పుణ్య దంపతులు ఆధ్యాత్మిక, విద్యా, సేవారంగము లలో శ్రద్ధాభక్తులతో చేస్తున్న నిరాడంబర, నిస్వార్థ సేవను తెలుసుకొని ఆశ్చర్యపడి, 'ఎందరో మహాను భావులు అందరికీ వందనాలు' అని మనసులోనే అనుకున్నాను.

ప్రతి ఆదివారం వారిల్లు బాలబాలికలతో కళకళలాడుతూ ఉంటుంది. బాలబాలికలకు ఆధ్యాత్మిక విద్యాబోధన చేయటంతోపాటు భగవద్గీతశ్లోకములు, స్తోత్రములు, అష్టకములు ఇంకా ఎన్నో .... ఎన్నో .... నేర్పుతుంటారు. అంతే కాదు బాలబాలికలకు కూచిపూడి భరతనాట్యం కూడా నేర్పుతుంటారు. ఈ కార్యక్రమాల విషయంలో శ్రీమతి రత్నమాణిక్యాంబగారు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుంటారు.

ప్రతి సోమవారం ఉదయం 10 గం నుండి 12 గం. వరకు విష్ణుసహస్రనామస్తోత్ర పారాయణం, సత్సంగము ఉంటుంది. మరియు ఆధ్యాత్మిక ఉపన్యాసాలు కూడా ఉంటాయి. ప్రతి గురువారం సాయంత్రం 7 గం. నుండి 8 గం వరకు 'సాయి సంకీర్తన' జరుగుతుంది. ప్రతి అమావాస్య రోజున ఉదయం 10 గం. నుండి 12 గం. వరకు భగవద్గీత సామూహిక పారాయణ జరుగుతుంది ప్రతి నెల మొదటి శుక్రవారం ఉ. 10 గం. నుండి 12 గం. వరకు "సాయి గాయత్రి" 108 సార్లు పఠించి, శ్రీ లలితా సహస్రనామస్తోత్ర పారాయణ చేయబడుతుంది.

ఈ పుణ్యదంపతులు, భగవాన్ శ్రీ సత్యసాయిబాబా పేర ఉచిత కుట్టుమిషన్ శిక్షణా కేంద్రమును కూడా ఏర్పరచినారు. దానిలో ప్రతిరోజు ఉచితంగా శిక్షణ ఇవ్వబడుతున్నది. వారి గృహం ఒక ఆధ్యాత్మిక కేంద్రం, వారి ఇల్లు ఒక సేవా కేంద్రం. అది సంగీత, సాహిత్య, నాట్య కళలకు నిలయం. అందులో భగవాన్ సాయి ప్రతిష్ఠితులై ఉన్నాడు. ఆ కుటుంబ సభ్యులందరూ సాయీ సేవకులే. భగవాన్ సాయి సేవా సమితి సహకారంతో ఈ పుణ్య దంపతులు ఎన్నో కార్యక్రమాలను భీమవరంలో నిర్వహిస్తున్నారు. శ్రీ గుడివాడ వెంకటేశ్వరరావుగారు ఒక ప్రముఖ రైస్ మిల్లరే కాదు వీరు సాయి సేవకులు కూడాను. అంతేకాదు సాయివాణిని వినిపిస్తున్న "శ్రీవాణి" ప్రచారకులు, పోషకులు అని తెలియజేయటానికి నేనెంతో సంతోషి స్తున్నాను ప్రతి ఒక్కరూ ఈ పుణ్య దంపతులను ఆదర్శంగా గైకొని సాయి సేవకు అంకితం కావాలని ఆకాంక్షిస్తు న్నాను, ఆశిస్తున్నాను.

కొమరగిరి

శ్రీవాణి దశాబ్ది ప్రత్యేక సంచికకు మా శుభాకాంక్షలు

☎ 2053
2097
2557

# గౌతమ్ రెసిడెన్షియల్ స్కూల్ & కాలేజి

సజ్జాపురం - తణుకు

ఇంగ్లీషు & తెలుగు మీడియం

క్లాసులు : L. K. G. to ఇంటర్

ఇంగ్లీషు మీడియం : LKG to ఇంటర్‌మీడియట్
తెలుగు మీడియం : LKG to ఇంటర్ మీడియట్
ఇంటర్ గ్రూపులు : MPC., BiPC., MEC., & CEC.

సుంకర అప్పారావు
M.Sc., B.Ed.,
ప్రిన్సిపాల్ & కరస్పాండెంట్

చదవండి !　　　　　　　　　　　　　　　　　　　　చదివించండి ! !

చందాదారులుగా చేరండి !　　చేర్పించండి ! !

భారతీయ సంస్కృతీ సాహిత్య సలక్షణ మాస పత్రికను
ఆదరించండి ! ప్రోత్సహించండి ! !

ఆత్మీయులైన తమందరికీ

అభినందనమందారాలు ! గతంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారందించిన 'సప్తగిరి' మాసపత్రిక ఐదు భాషలలోను ప్రకటనలు సేకరించుటకు "తిరుమల తిరుపతి దేవస్థానముల ఏకైక ప్రతినిధి" బాధ్యత, భారతీయ ఆధ్యాత్మిక, సాహిత్యపు అమృతపు విలువలను ఆకళింపు చేసుకునే అవకాశం కల్పించింది. అప్పట్లో వృత్తి బాధ్యతల కనుగుణంగా నేను జరిపిన యథాశక్తి మాతృదేశ పర్యటనలో వివిధ వర్గాల భారత మాత ముద్దు బిడ్డలను కలవటం జరిగింది. ప్రపంచములో తమ భారతదేశం అత్యున్నత మైనదని, భారతీయ సంస్కృతీ, సంప్రదాయ, సాహిత్యాలు యావత్ ప్రపంచానికి తలమానికమైనటువంటి వన్న మీ అందరి భావనలు తెలుసుకున్నాను. 'జననీ జన్మ భూమిశ్చ' భావన స్ఫూర్తిగా, మీ అందరి ఆత్మీయతాశీస్సులతో 1993 సం॥లో స్వకీయ 'తిరుమల తిరుపతి ప్రచురణలు' సంస్థ ఆవిర్భవించి "సప్తపది" సలక్షణ మాస పత్రిక రూపుదిద్దుకుని, భగవదనుగ్రహంతో భారతీయ సాహిత్య సేవలో తన వంతు పాత్ర నిర్వహిస్తోంది. తిరుమల తిరుపతి పబ్లికేషన్స ద్వారా 1993 నుంచి ప్రకటన దారుల సహకారంతో, ఉచిత పంపిణీకై నిర్దేశించిన తిరుమల యాత్రీకులకు సూచనలతో కూడిన భారతీయ పంచాంగము క్యాలెండరు మీ అందరి ప్రశంశలకు పాత్రమైంది, మీరందించిన ప్రోత్సాహస్ఫూర్తితో, ప్రకటనదారుల సహకారంతో 1995 ఉచిత పంపిణీకై నిర్దేశించిన భారతీయ పంచాంగము క్యాలెండరు మీకందిస్తున్నాము "సప్తపది" మాస పత్రికపట్ల, క్యాలెండరుపట్ల భారతీయ ఔన్నత్య ప్రచారముకోసం ఇంకా చెయ్యవలసిన కార్యక్రమాల గురించి మీ ఆశీఃపూర్వక సలహా సూచనలను ఆహ్వానిస్తూ ... "మంచికి మించిన పూజలేదు" మంచికెన్నడూ లోటు రాదు" పదాల స్ఫూర్తితో ,భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి దివ్యాశీస్సుల నర్థిస్తూ, ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు.

భవదీయ

డా. పల్లూరి దత్తాత్రేయ ఉమాశంకర్, D.A-Sc
ప్రధాన సంపాదకులు

---

తిరుమల తిరుపతి పబ్లికేషన్సు 20-4 అంతస్థు కృష్ణా కాంప్లెక్సు తిలక్ రోడ్డు,
అబిడ్స్, హైదరాబాద్ 1　　　　సంవత్సర చందా : రూ. 96/-

Phone : 238

## SRI SITARAMA MANURES

**Prop : G. SITA REDDY**

BURUGAGUDEM, Reddigudem Mandalam, Krishna Dist

Phones : Resi : 46, Shop : 22

## *Sri Seetha Ramanjaneya Manures & General Merchant*

**Prop : Ch. Srinivasa Rao**

REDDIGUDEM, Krishna Dist

## SRI SRINIVASA MANURES

**Prop : Rama Koti Reddy**

RANGAPURAM, Reddigudem Mandalam, Krishna Dist

Phone : 52

## Sri Venkateswara Manures Depot

**Prop : Ch. Rami Reddy**

REDDYGUDEM, Krishna Dist

## SRI SRINIVASA MANURES & PESTICIDES

**Prop : Karankula Rama Rao**

REDDIKUNTA, Reddigudem Mandalam, Krishna Dist

Phone : 36

## PRASAD MANURES & PESTICIDES

**Prop : Kambhampati Prasada Rao**

REDDIGUDEM, Krishna Dist

## VIJAYA MANURES & PESTICIDES

**Prop : B. Anji Reddy**

BURUGAGUDEM, Reddigudem Mandalam, Krishna Dist

## VASAVI MANURES & GENERAL MERCHANTS

**Prop : Dara Koteswara Rao** Phone : 43

REDDIGUDEM, Krishna Dist

*With best compliments from :*

# TABS INDIA

16, Industrial Development Area
CHARLAPALLI
HYDERABAD - 500 051

OFFICE:
TABS INDIA Phone: 665949
3-4-549/2, Y. M. C. A.
NARAYANAGUDA
**HYDERABAD - 500 029**

PROPRIETOR:
*P. V. R. Mohana Rao*
Phone: 666465

# KOHINOOR

GOLD SHEET Covered Bangles



CASH REFUNDABLE
CONDITION

25 YEARS GUARANTEE

ESTD. 1901 Phone : 2630

**KOHINOOR ROLLED GOLD COMPANY** (Regd)

P. B. No.10, Machilipatnam–521 002 (A.P.)